

# క్రైమ్ క్రైమ్

ఆది నవలతోనే ఆకాశంలోకి దూసుకు వెళ్ళిన సంచలన నవలా కారుడు సూర్యదేవర రామ్మోహనరావు అందిస్తున్న థ్రిల్లర్ క్రిమినల్స్.

దేశాన్ని కుదిపేస్తున్న బడా బాబుల బండారంపై జి.వి. అమరేశ్వరరావు సంధించిన పరిశోధనాత్మకాస్త్రం 'ది స్విస్ బ్యాంక్'

పోలీస్ ఆఫీసర్ల పరిశోధనలు వారం వారం క్రైంకథగా అందిస్తున్నాం.
సామాన్య మానవుల సాధక బాధకాలపై వారం వారం ప్రత్యేక వ్యాసాలు.

మారిన

సచిత్ర వారపత్రిక

# మయూరి చూశారా?

ఒకసారి చదవండి మళ్ళీ అదే మిమ్మల్ని చదివిస్తుంది.

# ఉత్తరాలు

## ముఖచిత్రం

నటి రాధ నా అభిమాన నటి కాకపోయినా ముఖచిత్రం నన్ను అత్యంత ఆకర్షించినది అంత ఆకర్షణీయంగా ముఖచిత్రం వేసినందుకు అభినందనలు -సిహెచ్ సుబ్బారావు, విజయవాడ

## వేయిపడగలు

వేయిపడగలు నవల 50 సంవత్సరములు తర్వాత తోకచుక్క' వలె కనిపించి పాఠకులలో సంచలనం సృష్టించింది కెమెరాలాంటి మీ సంస్థ ఈ నవలను మళ్ళీ సీరియల్‌గా అందిస్తున్నందుకు నా కృతజ్ఞతలు

- నిమ్మల ఉమామహేశ్వరరావు, ఖరగ్‌పూర్

★ ★ ★

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి 'వేయిపడగలు' మమ్ములను ఎంతగానో ఆకట్టుకుంటోంది

- నాగండ్ల వెంకటేశ్వరరావు, అమ్మాపాలెం

## సీరియల్స్

రాద ముఖచిత్రం చాలా బాగుంది ప్రేమసాగర మదనం సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా వుంది

- ఎస్ కె ఫజుల్లా, ఎల్ వి సుబ్బయ్య, గూడూరు

★ ★ ★

డా రవీంద్రబాబుగారి ప్రేమసాగర మథనం ఎంతో ఉత్కంఠ కలిగిస్తున్నది

- కృష్ణదేవ్, ఆముదాలవలస

★ ★ ★

ప్రేమసాగర మదనం సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా సాగుతోంది రచయిత కదనం నడిపించటంలో తమ నైపుణ్యాన్ని చూపిస్తున్నారు కదనంలో బిగువు సడలకుండా సీరియల్ ఆసాంతం నడిపించాలని మనవి

- చంద్ర మదుసూదన్‌నాయుడు, నెల్లూరు

★ ★ ★

తీపి గురుతు సీరియల్ గ్రామీణ జీవనాన్ని, గ్రామాలలో నివసించే రైతుల జీవన వృత్తి అయిన వ్యవసాయం ఎంత నష్టదాయకంగా వుందో తెలుపుతున్నది గిట్టుబాటుధరలు అన్న అంశంపై కూడా రచయిత శ్రీ ఆదూరి వేంకట సీతారామ మూర్తి గారు సీరియల్‌లో ప్రస్తావించారు ఇంతవరకు మేము చదివిన కదలలో గిట్టుబాటు దరల గురించి ప్రస్తావించడం బహు అరుదు

రాష్ట్ర కేంద్రప్రభుత్వ గ్రామీణ, రైతు వ్యతిరేక విధానాల వలన స్వాతంత్ర్యం సిద్ధించి 40 ఏళ్ళు గడిచినా వారి పరిస్థితి రోజు రోజుకూ దిగజారి పోతున్నదన్నది ప్రామాణికంగా రుజువు చేయవచ్చును మన నేతలు వేదికలెక్కి ఉపన్యసించడమే కాని నిజంగా గ్రామీణ బారతానికి ఏమీ మేలు చేయలేదంటే అతిశయోక్తి కాదు దీనికి నీరసించి పోతున్న గ్రామాలే ఉదాహరణలు

గ్రామాల నుండి పట్టణాలకు రైతులు, కూలీల వలస పోవడం జరుగుతున్నదే ఈ వలసల వలన తీవ్రమైన సమస్యలు పట్టణాలలో ఉత్పన్నమవుతున్నాయి దీని నరికట్టాలంటే రైతులకు గిట్టుబాటు దరలు లబించాలి దానిలో కొంత భాగం కూలీలకు చేరాలి మిగిలిన గ్రామాలలోనే పెట్టుబడి వుండి అబివృద్ధి కార్యక్రమాలు స్వంతంగా చేసుకునే వీలేర్పడుతుంది అబివృద్ధి కార్యక్రమాల వలన గ్రామాలలో కూలీలకు పనులు దొరుకుతాయి వారి జీవనం మెరుగుపడుతుంది

- ఎస్ పి శంకరరెడ్డి, రైతు సంఘం, నంద్యాల

## కథలు

కె నాగేశ్వరిగారి కద తెర చాలా బాగుంది ఆమెకు మా దన్యవాదములు

- బి ఆర్ రమ్య, బాబూరావు, మల్దకల్ మండలం

★ ★ ★

ముఖచిత్రం నటి రాధ చాలా బాగుంది కథలలో మిన్నగా, గుమ్మా ప్రసాదరావుగారి కద నింగి నేలకు దిగింది సీత చురుకుతనం, నేటి నూతన దంపతులకు మార్గదర్శం కాగలదని మా అబిప్రాయము గణపతిరావు లాటి మామలు వున్నంత కాలం సంఘం బాగుపడదు కద చాలా బాగుంది -షేక్ మస్తాను, గాలి బీబి, ముమ్మలనేనివారిపాలెం రేపల్లె

★ ★ ★

రాద ముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఆకర్షణీయంగా ఉంది పందెం కథ ఆలోచింప జేసేదిగా ఉంది -కె ఎన్ వి రవికుమార్, మైలవరం

★ ★ ★

పునాదిరాళ్ళు కథలోని శంకరం పాత్ర ఈ తరం విద్యార్థులకు ఒక మాత్ర

- కె యన్ శేఖర్‌బాబు, మైలవరం

## వ్యాసాలు

అందాల తార రాద ముఖచిత్రం తో వెలువడిన సంచిక అత్యంత ఆకర్షణీయంగా వుంది అందానికి అవరోదం డయాస్టియా వ్యాసం విజ్ఞాన దాయకంగా వుంది సుందరసీమలో శ్రీ చక్ర పెరుమాళ్ళు స్వామి వ్యాసం చాలా చక్కగా వుంది

- మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం

★ ★ ★

'రాద' ముఖచిత్రంతో వెలువడిన సంచికలో 'శ్రీ చక్ర పెరుమాళ్ళస్వామి' వ్యాసం, వింబుల్డన్ - 87 వ్యాసం బాగున్నాయి

- టి శశిధరకుమార్, తిరువూరు

## శీర్షికలు

లతగారి దూరదర్శనం', తిరుమల రామచంద్ర గారి 'హైదరాబాద్ నోట్ బుక్' శీర్షికలు "చాలా బాగుంటున్నాయి 'వ్యక్తిగతం' శీర్షిక విజ్ఞాన దాయకంగా ఉంది 'చిన్నారి బాలల దీన గాదలు' ఆలోచింపజేసేవిగా ఉంటున్నాయి

- గొడవర్తి హరిప్రసాదరాజు, బోదన్ □


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938-1972)

14-20 ఆగస్టు 87

శ్రీ ప్రభవనామ సం. శ్రావణ బ: పంచమి

సంపుటము 79 : సంచిక 50

ముఖ్య సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాందీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

నటి : ముచ్చెర్ల అరుణ

(ఫొటో : వి. సత్యమూర్తి)

న్యూఢిల్లీ లేఖ



డా.జయదుబాషి

# ప్రవాస భారతీయ బాలల దయనీయస్థితి!

లండన్ ఈసారి నేను లండన్‌కు రెండుసార్లు వెళ్లాను మొదటిసారి ఎన్నికలకు ఒకటి రెండు రోజులు ముందు అమెరికా వెళ్తూ అక్కడ ఆగాను రెండోసారి, స్వదేశానికి తిరిగి వస్తూ అంటే ఎన్నికలు అయిపోయిన తర్వాత నెలకి, మళ్లీ వెళ్లాను ఇప్పుడు లండన్ ఇటువంటి పరిస్థితిలో ఉంది దానంతటది ఒక రాజధానీ నగరంగా లేదు మరొక చోటికి వెళ్లబోయే ముందు ఒక రోజో, రెండు రోజులో గడిపేటటువంటి మజిలీ స్థలం అయిపోయింది ఇదంత పెద్ద విషయం కాదనుకోండి ఎందుకంటే గత అయిదు సంవత్సరాలలో నాలుగు సార్లు లండన్ వెళ్లిన నావంటి వాళ్లు ఏ పనీ లేకపోయినా కేవలం గడిచిన దినాలని తలచుకోవటం కోసమే అక్కడికి వెళ్తారు

ఎన్నికలకు మూడు రోజుల ముందర, చాలా ముఖ్యమయినటువంటి ఎన్నికలు జరగబోతున్నాయనే చిహ్నాలేమీ కనపడలేదు మార్గరెట్ థాచర్ మూడవసారి పోటీ చేస్తున్న ఎన్నికలవి నామటుకు నాకు ఆమె గెలుస్తుందనడంలో ఏ సందేహమూ లేదు బహుశా మెజారిటీ తగ్గుతుందేమో ననుకున్నాను ఆమె అంత కచ్చితంగా ప్రేమాస్పదురాలైన వ్యక్తేమీ కాదు ఆమె ధైర్యానికి ఆమెను వ్యతిరేకించే వాళ్లు చాలామంది ఉన్నారు కూడ కాని ఆమెకు ధైర్యం అనేది ఉన్నది పాలక పక్షం లోపలా బయటా ఆమె ప్రత్యర్థులుగా నిలిచిన వాళ్లందరి మీదా ఆమెకున్న ఘనత అదే ఆమెకన్నా ముందు టోరీలను సోషలిస్టుల కన్నా భిన్నంగా ఊహించడం సాధ్యమయ్యేది కాదు కనుకనే సోషలిస్టుల దాడి ముందు వాళ్లు పడిపోయారు కాని చర్చిల్‌లాగనే థాచర్ కూడా వేరే తానులోని ముక్క ఎందుకంటే అప్పుడప్పుడు సాంప్రదాయక జ్ఞానాన్ని తలకిందులు చేసేసి, పండితులను తరిమేయక తప్పనిస్థితి వస్తుంది సరిగ్గా థాచర్ చేసినదిటువంటి పనే ఆమె కేవలం తన స్వంత నిపుణులను మాత్రమే గాక తమ సంక్షేమాన్ని విచ్చిన్నం చేస్తున్నదనీ అందుకు ఆమె చాలా మూల్యం చెల్లించవలసి వస్తుందని వాదించిన పెద్ద మనుషులతో కూడా ఆమె ఇటువంటి పద్ధతిలోనే వ్యవహరించింది అందువల్ల ఆమె ఏమీ మూల్యం చెల్లించవలసి రాలేదు

బ్రిటన్‌లో పెద్ద ఎత్తున నిరుద్యోగం ఉన్నదనే మాట నిజమే దాదాపు 30 లక్షల మంది కార్మికులు అంటే మొత్తం శ్రామిక జనాబాలో తొమ్మిదింట ఒక వంతు పనిలేకుండా ఉన్నారు కాని ఈ నిరుద్యోగం లండన్‌లో కనబడదు నిజానికి, కొత్తగా ఈ మధ్య కాలంలో తలెత్తిన సేవారంగ పరిశ్రమల వల్ల లాభం పొందిన దక్షిణ ఇంగ్లండ్‌లో పరిస్థితి బాగానే ఉంది ఉత్తర ప్రాంతంలో మాత్రం బొగ్గు, ఉక్కు వంటి పాత పరిశ్రమలు ఇంకా ఉన్నాయి బొగ్గుకు గానీ ఉక్కుకుగానీ గిరాకీ పెరగకపోవడంతో ఈ పరిశ్రమల స్థితి ఏమంత బాగాలేదు బ్రిటన్‌లో మాత్రమే గాక ఇతర చోట్ల కూడా యిటువంటి పరిశ్రమల భవిష్యత్తు నిరాశాజనకంగానే ఉన్నది అయితే మనదేశంలో మాత్రం ఇంకా ఈ విషయమై కనీసం స్పృహ కూడా రాలేదు

ఏమైనప్పటికీ ఎవరూ ఉక్కు గురించో, బొగ్గు గురించో నేర్చుకోవడం కోసం లండన్‌కు వెళ్లరు ఒకప్పుడు బ్రిటన్‌ని గొప్ప దేశంగా మార్చినటువంటి పరిశ్రమలు అవే అయినా, అప్పటి నుంచి క్రమంగా అవి క్షీణిస్తూ వచ్చాయి సోషలిజం పేరు మీద దేశాన్ని తమ యిష్టా రాజ్యంగా మార్చుకుని వ్యవహరించి నటువంటి ట్రేడ్ యూనియన్‌లే ఇందుకు ప్రదాన కారణం ప్రపంచ శక్తిగా అమెరికా బలోపేతం కావడాన్ని ఏదో ఒక కారణంపై నిరసించే రాడికల్స్ అనబడే వాళ్ల చేతిలో వాటిలో కొన్ని ఉన్నప్పటికీ ఆ ట్రేడ్ యూనియన్ల కాలం తీరిపోయింది కనుక వీళ్లు అమెరికన్ అణుక్షిపణులకు వ్యతిరేకంగానో, చివరికి అణుశక్తికి వ్యతిరేకంగానో ఆందోళన చేస్తున్నారంటే వాస్తవానికి వాళ్లు యూరప్‌లో అమెరికా అదికారానికి వ్యతిరేకంగా గళమెత్తుతున్నారని అర్థం ఇటువంటి ఆందోళనను అర్థం చేసుకోవచ్చు ఎంధుకంటే యూరప్ ఇప్పుడు రెండో స్థాయి శక్తిగా మారిపోయింది చాలా సంపన్నమైనటువంటి యూరోపియన్ దేశం పశ్చిమ జర్మనీ ఇప్పుడు ప్రపంచంలో మూడో స్థానంలో - అమెరికా, జపాన్‌ల తర్వాత - ఉంది ఇంగ్లండ్ బహుశా అయిదో స్థానంలోనో ఆరో స్థానంలోనో ఉండవచ్చు గత పన్నెండు నెలల్లో తనను అదిగమించినట్టు చెప్పబడుతున్న ఇటలీ తరువాత ఉండవచ్చు

ఈ క్షీణత ఆర్థికేతర రంగాలలో, ఉదాహరణకు సాంస్కృతిక రంగంలో బ్రిటిష్ శక్తిపై ఏమీ ప్రబావం చూపినట్టు లేదు లండన్‌లో ఏ సమయంలోనైనా అత్యుత్తమ శ్రేణికి చెందినటువంటి నాటకాలు కనీసం డజను ఆడుతుంటాయి సీటు వంద రూపాయల నుంచి 500 రూపాయలకు అంతకు



మించి టికెట్లున్నప్పటికీ వీటిలో ఏ నాటకాన్నయినా ఎంచుకోవచ్చు పికాడెల్లీ పక్కనే షాఫ్ట్స్ బరీ అవెన్యూ ఒక థియేటర్ తరువాత మరొక థియేటర్ చూస్తూపోతే అన్నీ బ్రహ్మాండమయిన వ్యాపారం చేస్తున్నాయని అర్థమవుతుంది అగాథా క్రిస్టీ నాటకం మూస్ ట్రాప్ ఇప్పటికి 35 ఏళ్ళుగా ఆడుతున్నారు బహుశాప్రపంచంలో అతి ఎక్కువ కాలం వరుసగా నడిచిన నాటకం అదే కావచ్చు ఇంత విస్తృతమయిన, పుష్కలమైనటువంటి నాటకరంగాన్ని కాపాడుతున్నదేమిటి? సగటు బ్రిటిష్ పౌరుల వేతనాలు అంత ఎక్కువేమీ కాదు కేంబ్రిడ్జి విశ్వవిద్యాయం నుంచో, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం నుంచో బయటపడిన యువకుడు సివిల్ సర్వీసుతో సహా ఎక్కడయినా ఉద్యోగం సంపాదించగలిగితే అదృష్టవంతుడే అప్పుడు ఆ వ్యక్తికి సంవత్సరానికి పదివేల పౌండ్లకు మించి రావు కొనుకోలు శక్తి లెక్కలో చెప్పుకోవాలంటే ఆ సంపాదన నెలకు దాదాపు 3500 రూపాయలు అద్దెలు చాలా ఎక్కువ ఎన్నో నిత్యావసర వస్తువుల దరలు కూడా అంతే కాని నాటకాలకూ, ఒపెరాలకూ, సంగీత సమ్మేళనాలకూ ఎప్పుడూ డబ్బు ఉంటూనే ఉంటోంది నేను అక్కడున్న వారంలో ఏ నాటకానికీ నేను ఒక్క టికెట్ కూడా సంపాదించ లేకపోయాను కొన్ని టికెట్లయితే సీటుకు వెయ్యి రూపాయల వరకు కూడా పెరిగాయి

ఇంగ్లండ్‌లో ఇప్పుడు రెండు ప్రత్యేకమయిన వర్గాలున్నాయి ఒకటి శ్వేత జాతి బ్రిటిష్ వాళ్ళది రెండవది మిగిలినవాళ్ళది దీనిలోనే భారతీయులు కూడా ఉంటారు ఒక వర్గంగా భారతీయుల స్థితి అమెరికాలో, అంతకంటే చాలా తక్కువ స్వేచ్ఛా సమాజమయిన ఇంగ్లండ్‌లో కన్నా బాగానే ఉంది మీ వృత్తిలోనో వ్యాపారంలోనో ఎంత ఉన్నత స్థానానికి ఎదిగినప్పటికీ బ్రిటన్‌లో మీ స్థితి ఏమంత గొప్పది కాదు బ్రిటన్‌లో డజనుకన్నా ఎక్కువమంది కోటీశ్వరులయి నటువంటి భారతీయులున్నారని నేను విన్నాను కాని శ్వేత జాతి కోటీశ్వరుల లాగానే ఇంగ్లీషు సమాజం లోకి వీళ్ళను స్వీకరించరు అని నా అనుమానం బారతీయులలో కొందరు సీనియర్ ప్రభుత్వాధికారులు కూడా ఉన్నారు గాని, వాళ్ళు అంత ఎక్కువగా కనబడరు లండన్‌లోని హీత్రూ విమానాశ్రయంలో ఇమిగ్రేషన్ అదికారులలో చాలా-మంది భారతీయులే కాని వాళ్ళను మీరు బారతీయులేనా అని అడిగితే కాదంటారు

"మీరు భారతీయులు కాదంటే అర్థమేమిటి? బారతీయుల లాగనే కనపడుతున్నారు గదా? అని వారిలో ఒకరిని అడిగి విస్మయపరిచాను నేను

బారతీయ సంతతికి చెందిన వాణ్ణే అన్నాడాయన

అంటే మీ నాన్నో తాతో భారతీయులా? అని నేను సాగదీశాను

ఆయనేమీ జవాబివ్వలేదు గాని, నేను ఆ తరువాత విన్నదేమిటంటే, ఇటువంటి వ్యక్తులు బ్రిటన్‌కు కెన్యా నుంచో, హాంగ్‌కాంగ్ నుంచో వచ్చిఇప్పుడు బ్రిటిష్ పాస్‌పోర్టులు సంపాదించుకున్నారు వాళ్ళు, వాళ్ళ పిల్లలు ఇంట్లో ఏమి చేస్తారో, వాళ్ళతో వాళ్ళు ఇంగ్లీషులో మాట్లాడుకుంటారో, హిందీ, గుజరాతీ, సిందీలలో మాట్లాడుకుంటారో నాకు తెలియదు వాళ్ళ పిల్లల స్థితి దయనీయమైనటువంటిది వాళ్ళకు హిందీ గానీ, మరే భారతీయ భాషగానీ, నేర్పబడదు భారతదేశం గురించి తాజ్‌మహల్, గాంధీ వంటి మామూలు విషయాలు తప్ప ఇంకేమీ తెలిసి ఉండదు వాళ్ళు ఇంట్లో బారతీయ ఆహారం తీసుకుంటారు బైట ఇతర రకాల ఆహారం తీసుకుంటారు వాళ్ళు హిందూ దేవాలయాలకు వెళ్ళరు వాళ్ళలో చాలా మందికి తాము భారతీయులమని కూడా తెలిసి ఉండక పోవచ్చు కాని వాళ్ళు స్థానిక పిల్లలకంటే చాలా తెలివిగా ఉంటారు ఎందుకంటే, వాళ్ళు జ్ఞానం పట్ల, విద్యపట్ల సహజంగానే ఉన్నతమైన గౌరవం ఉంచే హిందువులు గదా కాని వాళ్ళు పెరిగేకొద్దీ, వాళ్ళు ఎక్కడ నివసిస్తున్నప్పటికీ, జాతీయ జీవన స్రవంతి నుంచి దూరమైపోతారు అమెరికాలో పరిస్థితులు ఇంత ఘోరంగా ఎందుకు లేవంటే అక్కడ జాతీయ జీవన స్రవంతి అనేటటువంటిదేమీ లేదు విదేశాలలోని బారతీయ శిశువుల స్థితి నిజంగా దయనీయమైనది □



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1987 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీని నిర్వహిస్తున్నాము గతంలో లాగే ఇప్పుడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాదిక్రమంలో ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి సంచికలో ఆ తరువాతి సంచికలో ప్రచురిస్తాము అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము

**ముగింపు తేదీ : 22 ఆగస్టు,1987**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు 700/ చొప్పున బహుమతి లభిస్తుంది ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి రెండవ మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు 750/- రు 650/-, రు 550/ వంతున అదనపు బహుమతులుగా అందజేస్తాము మిగిలిన మూడు కథలకీ ఒక్కొక్కదానికీ అదనంగా రు 350/- చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము

### నిబంధనలు

1 కథా వస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి

2 కథ వ్రాత ప్రతి పన్నెండు అర రావు (ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండకూడదు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి వ్రాతప్రతిపై 1987 దీపావళి కథల పోటీకి అని మొదటి పేజీపై భాగంలో స్పష్టంగా రాయాలి

3 అనువాదాలు అనుసరణలు కాపీ కథలు పంపరాదు గతంలో ప్రచురింపబడిన రేడియోలో ప్రసారం అయిన ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన వాటిని పోటీకి పంపరాదు ఈమేరకి రచయిత(త్రు)లు హామీ పత్రం రాసి సంతకం చేసి వ్రాత ప్రతితో పాటు పంపాలి హామీ పత్రం లేని రచనలు పరిశీలింపబడవు ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు

4 రచయితలు రచయిత్రులు కలం పేరుతో రాసినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాల్సి ఉంటుంది.

5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫొటోలతో సహా ప్రచురిస్తాము.

6 పోటీలో బహుమతి పొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫొటో జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది

7 రచనలపై వచ్చే ఎలాంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది

8 పోటీకి పంపే కథలు 22 ఆగస్టు 1987కి గానీ అలోగా కానీ మా కార్యాలయానికి చేరేలా పంపాలి ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు

9 పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవర్లు జత పరచి పంపనవసరం లేదు

10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించటం జరుగుతుంది ఆ విషయాన్ని ఆయా రచయిత(త్రు)లకి తెలియ చేస్తాము ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత(త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యం కాదు వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకీ అవకాశం లేదు.

11 పోటీకి పంపే కథలని సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వార పత్రిక గాంధీనగరం విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు కవరు పై భాగంలో 1987 దీపావళి కథల పోటీకి అని స్పష్టంగా రాయాలి

రచయిత(త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము

–సంపాదకుడు

సీరియల్

# రైహటి మహోల్ల

సి. ఆనందారామం

(గత సంచిక తరువాయి)

జూబ్లీహాల్‌లో బాగవతార్ పాటకచ్చేరి ముగిసింది ప్రేక్షకుల కరతాళ ధ్వనులు మారుమ్రోగుతుండగానే నాకర్జంట్ పని వుంది సార్! వెళ్ళిపోవాలి అని బాగవతార్ కారు కోసం వెయిట్ చేయకుండా ఆటోలో తన ఇన్‌స్ట్రుమెంట్స్‌తో వెళ్ళిపోయాడు ఏండెటో

సంతోషించాడు బాగవతార్ ఏండెటో తనతో కూడా యింటికొస్తే మృదుల వెంటనే అతణ్ణి వదిలిపెట్టదు అతడి అమెరికా దేశాన్ని గురించి అతడుండే ప్రాంతాన్ని గురించి ఏవేవో ప్రశ్నలు అడుగుతూనే ఉంటుంది ఒక గంటసేపు బాతాఖానీ వేసుకున్న తరువాత కాని ఏండెటో అక్కణ్ణుంచి బయటపడడు

తంబూరా కార్లో పెట్టించి తను కూర్చుని మృదుల కోసం కబురు పంపించాడు పెళ్ళైన తరువాత కూడ ఊళ్ళో ఉంటే బాగవతార్ పాటకచ్చేరీకి తప్పకుండా వెళ్తుంది మృదుల ఆ రోజు కూడా వచ్చింది

ఆర్గనైజర్ తిరిగొచ్చి సర్! మృదులగారు లేరు మీ పాట కచ్చేరీ పూర్తికాగానే హడావిడిగా వెళ్ళిపోయారట ఏదేనా పనిమీద ఇంటికే వెళ్ళేరేమో? అన్నాడు గుండెమీద ఏదో పెద్ద బరువు పెట్టినట్లైంది బాగవతార్‌కి ఏండెటో హడావిడిగా వెళ్ళిపోయాడు మృదుల కూడా హడావిడిగా వెళ్ళిపోయింది ఒకవేళ

తరువాత ఊహించడానికి అతని మనసు యెదురు తిరిగింది కార్లో కూర్చుని చప్పుడు చేస్తూ డోర్ వేసేసి, త్వరగా పోనీ అన్నాడు డ్రైవర్‌తో డ్రైవర్ తాపీగా వెనక్కి తిరిగి ఎక్కడికి సార్! అన్నాడు

ఇంటికే త్వరగా! డ్రైవర్ గేర్ మార్చి స్పీడ్ పెంచాడు ట్రాపిక్ సిగ్నల్ రెడ్ లైట్ చూపడంతో ఆపవలసి వచ్చింది

ఆపుతావేం? త్వరగా పోనీయమని చెప్పలేదూ! రాగ జ్ఞానం మరిచిపోయి నట్లు కీచున అరిచాడు

రెడ్ లైట్ వచ్చింది సార్! ఇపుడు రోడ్ క్రాస్ చేస్తే పెనాల్టీ వేస్తారు అంతేకాదు వెహికల్ సీజ్ చేసినా చెయ్యొచ్చు అప్పుడు మనకి మరింత ఆలస్యమవుతుంది పోనీమంటారా? వినయంగా అడిగాడు డ్రైవర్

వద్దులే విసుగ్గా మొహం పక్కకి తిప్పుకున్నాడు ఎవరో అమ్మాయి పంజాబీ డ్రెస్సుతో మోపెడ్ మీద వెళ్తూ సిగ్నల్ యివ్వకపోవడంతో తనూ ఆగింది

మృదులా! అరిచాడు ఆ అమ్మాయి మొహం యిటు తిప్పింది మృదులకాదు ఈ రోజుల్లో ఆడపిల్లలందరూ పంజాబీ డ్రెస్‌లు వేసుకుని మోపెడ్ మీద తిరిగేవాళ్ళే ముఖ్యమంత్రి రకరకాల రూల్సు ప్రవేశ పెడుతున్నారు కాని ఆంధ్రదేశంలో ఆడపిల్లలంతా విదిగా చీరలే కట్టుకోవాలనే రూలు ప్రవేశ పెట్టడంలేదు పంజాబీ డ్రెస్సుల్లో జీన్స్‌లో ఫ్రాక్స్‌ల్లో తెలుగుదనం ఎక్కడేడ్చింది ఎట్లాగైతేనే గ్రీన్ లైట్ వచ్చి కారు ముందుకు కదిలింది ఫర్లాంగు దూరం నడిచిందో లేదో పెద్ద ప్రొసెషన్ ఎదురొచ్చింది రిజర్వేషన్స్‌కి వ్యతిరేకంగా విద్యార్థులంతా ఊరేగింపుగా ముందుకి నడుస్తున్నారు ఈ రకమయిన ఊరేగింపులు ఏ రకమైన అల్లరులకు దారితీయకుండా పోలీసులు ఎక్కడికక్కడ బందోబస్తు చేస్తున్నారు ప్రొసెషన్ గొంతు చించుకుని నినాదాలిచ్చుకుంటూ జెండాలు పట్టుకుని బ్లాక్ బేడ్జస్ తగిలించుకుని పెళ్ళి నడకలతో ముందుకు సాగుతోంది వాళ్ళలో ఒక్కొక్కడ్ని చావదన్నాలనిపించింది బాగవతార్‌కి పోలీసులు లారీలతో జనాన్ని అటూ యిటూ వొత్తిగిలచేస్తున్నారు ఏ రకంగాను ఏ వర్గంలోను ఉద్రేకాలు చెలరేగకుండా జాగ్రత్తపడుతున్నారు మొత్తంమీద ఆ ప్రొసెషన్ రోడ్డు దాటేసరికి పూర్తిగా నలభై అయిదు నిముషాలు పట్టింది అప్పుడు మళ్ళీ కదిలింది కారు ప్రొసెషన్ కారణంగా ట్రాపిక్ జామ్ అయింది దాన్నొంచి తప్పించుకొని బయటపడేసరికి మరో అరగంట పట్టింది ఇల్లు చేరుకొనేసరికి తలుపు తాళం వేసి వుంది ఇది అతను అనుమానిస్తున్నదే! అతని దగ్గర డూప్లికేట్ తాళం వుంది తలుపు తెరిచి కాలితో ఒక్క తాపు తన్నాడు కోపంగా ఇల్లంతా చీకటిగా వుంది లైటు వేసాడు హాల్లో లేదు మృదుల ఎందుకుంటుంది? మృదుల ఎక్కడ వుంటుందో అతని మనసు చెప్తోంది ఫ్లాట్స్ కిందవున్న షెడ్స్‌లో కారు పార్క్ చెయ్యబోతున్న డ్రైవర్‌తో కారు పార్క్ చెయ్యకు మనం మళ్ళీ బయలుదేరాలి అని తలుపు మళ్ళీ బయటి నుంచి లాక్ చేసేసి కార్లో కూర్చుని ఏండెటో యింటికి పోనీ అన్నాడు కారు ఏండెటో యిల్లు చేరుకొనేసరికి లైట్లు వెలుగుతున్నాయి లోపల్నుంచి మంద్రంగా పాప్ మ్యూజిక్ వినిపిస్తోంది ఎంతో ఆసక్తితో శాస్త్రీయ సంగీతం నేర్చుకుని అద్భుతంగా మృదంగం వాయించినా అతనికి పాప్ మ్యూజిక్ అంటే కూడా యిష్టమే డాన్స్ కూడా అద్భుతంగా చేస్తాడు అప్పుడప్పుడు క్లబ్స్‌లో పెర్‌పార్మెసెస్ కూడా యిస్తాడు తలుపులు బయట వేసున్నాయి లోపల్నించి స్టెప్స్ వేస్తున్నచప్పుడు వినిపిస్తోంది దబదబ తలుపు బాదాడు బాగవతార్ కాలింగ్ బెల్ వున్నదన్న మాట మరిచిపోయి లోపల్నించి ముందు స్టెప్స్ ఆగిపోయాయి తరువాత మ్యూజిక్ ఆగిపోయింది

ఎవరూ! లోపల్నుంచి విసుగ్గాఅరిచాడు ఏండెటో తలుపు తీయకుండానే

నేనే తలుపు తెరు గొంతు మార్చి అన్నాడు బాగవతార్ సంగీతం పాడేటప్పుడు అతడు రకరకాల కంఠస్వరంతో పాడటం ప్రాక్టీస్ చేసాడు అతడి పాటకచ్చేరీలో యిదొక ప్రత్యేక ఆకర్షణ

నేను బిజీగా వున్నాను నన్ను డిస్టర్బ్ చెయ్యొద్దు ఇంకోసారిరండి లోపల్నించే అరుస్తూ అన్నాడు ఏండెటో

నేను బాగవతార్‌ని తలుపు తీయి బయటి నుంచి అరిచాడు

రెండు నిముషాల నిశ్శబ్దం తరువాత తలుపులు తెరుచుకున్నాయి ఎవరో హడావిడిగా లోపలి గదిలో పరిగెడుతోన్న సందడి గుమ్మాని కడ్డంగా నిలబడ్డ

జరిగినకద - 1 స్వేచ్ఛాజీవి మృదుల కర్ణాటక సంగీత విద్వాంసుడు బాగవతార్‌ను తనంతతానే కోరి పెళ్ళి చేసుకుంటుంది తనకంటే ఇరవై సంవత్సరాలు చిన్నదైన మృదుల ప్రవర్తన బాగవతార్‌కు విచిత్రంగా కనబడుతుంటుంది ఆమె మరెవరినైనా ప్రేమిస్తున్నదేమోనని అనుమానిస్తాడు

ఏండెటో ని తీసుకుని ఏండెటో బెడ్‌రూమ్‌లోకి వెళ్ళబోయాడు బాగవతార్ కర్టెన్ వేసి వున్న గుమ్మానికి రెండు చేతులు చాచి అడ్డుగా నిలబడి ఇది నా బెడ్‌రూమ్ మీరు లోపలికెళ్ళడానికి వీల్లేదు అన్నాడు కరుగ్గా

నేను వెళ్ళితీరాలి

ఇది నా యిల్లు నేను వీల్లేదంటున్నాను తెరవెనుక ఏదో నీడ కదిలింది

ఎవరున్నారు లోపల?

అది మీకనవసరం

అంత రహస్యంగా దాచవలసిన అవసరమేమొచ్చింది?

అది నా వ్యక్తిగత విషయం మీకు చెప్పవలసిన అవసరంలేదు ఏండెటో ని తప్పించుకుని లోపలికెళ్ళడానికి ప్రయత్నించాడు బాగవతార్ అతడు ఎటు కదిలితే అటు కదులుతూ చేతులు అడ్డుగా జాపుతున్నాడు ఏండెటో తెరమీద నీడ అటూ యిటూ కదులుతోంది

ఎవర్నో తెచ్చి యింట్లో పెట్టుకున్నావని పోలీసు రిపోర్టు యిస్తాను

ఎటూ కాని వేళ నా యింటి మీదకొచ్చి నానా గొడవా చేస్తున్నావని మతి చలించిందని మెంటల్ హాస్పిటల్‌లో చేర్పిస్తాను

యూ బ్రూట్

ఇంగ్లీషు తిట్లు తిట్టకు నేను తెలుగులో బోలెడన్ని తిట్టగలను. లోపలివాళ్ళు వింటే నవ్వుకుంటారు గతుక్కుమని వెనక్కి తగ్గాడు లోపల వున్నది మృదులేనా? తనని చూసి నవ్వుకుంటోందా? జుట్టు పీక్కున్నాడు

మా యింట్లో జుట్టు పీక్కోకు వెంట్రుకలు ఎక్కడ అంటే అక్కడ పడితే ఆరోగ్యానికి మంచిదికాదు గిరుక్కున తిరిగి యింటికొచ్చేసాడు అప్పటికీ యింటికి తాళం వేసే వుంది రగులుగుపోతోంది మనసు తాళం తీసి బట్టలేనా మార్చుకోకుండా గుమ్మం దగ్గర కుర్చీ లాక్కుని కూర్చున్నాడు

ఎంత రాత్రయినా రానీ ఈ దారి నుంచేగా లోపలికెళ్ళాలి లోపలికి అడుగు పెడుతున్నప్పుడే రెడ్ హేండెడ్‌గా పట్టుకోవాలి

పాటకచ్చేరీ కోసం అంతకు ముందు రెండు రోజులుగా చేసుకున్న ప్రాక్టీసు - మూడు గంటల సేపు ఆగకుండా సాగిన పాటకచ్చేరీ - ఎలాగైనా ఏండెటో ని త్వరగా అందుకోవాలని చేసిన ప్రయత్నం - వీటన్నింటితో విపరీతంగా అలిసిపోయాడు అప్పటివరకూ టెన్షన్‌లో తెలియకపోయినా కుర్చీలో కూలబడ్డాక ఒక్కసారిగా నిద్ర కూరుకొచ్చింది కళ్ళ మీదకి కుర్చీలోనే నిద్రలోకి జారిపోయాడు






ఎక్కడి నుంచో దూరంగా వినిపిస్తోన్న పాప్ మ్యూజిక్ సవ్వడికి మెలుకువ వచ్చింది కళ్ళు తెరిచాడు బాలసూర్యుడి లేత కిరణాలు చురుక్కున పొడిచాయి కళ్ళని

అప్పుడే తెల్లారిపోయిందా! ఇంకా రాలేదా మృదుల? అక్కడేవుండిపోలేదు కదా! గాబరా - భయం - కోపం - ఉడుకుమోత్తనం - కసి పాప్ మ్యూజిక్ మరి కాస్త దగ్గరగా వినిపిస్తోంది అది పైన మృదుల బెడ్ రూమ్‌లోంచి ఆ పాట అంతక్రితం రాత్రి ఏండెటో ఇంట్లో విన్నదే

యు టాట్ మి హౌ టు లవ్
వాట్ ఎ జాయ్ వాట్ ఎ జాయ్
యు నెవర్ సెడ్ టూ మచ్
బట్ స్టిల్ యు షోడ్ ది వే

రేగిన పుండు మీద కారం పూసినట్లైంది ఎప్పుడొచ్చింది యింట్లోకి ఎప్పుడు పైకి వెళ్ళింది? సిగ్గు లేకుండా అదే పాట ఎలా పాడుకుంటూందో ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచి వీది తలుపు దబాల్న మూసేసి తనని నిద్రలోకి జార్చినందుకు కుర్చీని ఒక్క తాపు తన్ని రెండేసి మెట్లు గెంతుకుంటూ మృదుల బెడ్ రూమ్‌లోకి వెళ్ళాడు బాత్రూమ్‌లో స్నానం చేస్తోంది బాత్రూమ్ డోర్‌కి పై బాగాన వున్న అద్దంలో నుంచి మృదుల నగ్న సౌందర్యం మసకగా కదులుతోంది షవర్ కింద స్నానం చేస్తోంది ఆ జల్లుల మధ్య జలదేవతలా స్వచ్ఛంగా - దివ్యంగా - అమాయకంగా వుంది ఇంకా పాట హమ్ చేస్తూనే వుంది స్నానం చేస్తోంటే అటూ యిటూ స్టెప్స్ కూడా వేస్తోంది

స్టుపిడ్ అని అరుస్తూ బాత్రూమ్ డోర్‌ని ఒక్క తోపు తోసాడు అటాచ్‌డ్ బాత్రూమ్ కావడం వల్ల ఎవరూ రారనే ధైర్యంతో బోల్టు పెట్టుకోలేదు డోర్ తెరుచుకుంది షవర్ మధ్యవున్న మృదుల మొదట చిన్న కేక పెట్టింది భయంతో తరువాత యూ నాటీ, అంటూ తడి వొంటితో అతణ్ని అల్లుకుపోయింది

ఉండుండు బట్టలు పాడైపోతాయి అని ఖంగారుపడిపోయాడు బాగవతార్ అతడు పాటకచ్చేరీలకి ప్రత్యేకించి జరీ అంచు పట్టు పంచె సిల్కు లాల్చీ వేసుకుంటాడు వాటిని జాగ్రత్తగా కాపాడుకుంటాడు

నువ్వు నీ బట్టలు ఇలా నా యెదురుగా కనపడితే నాకు సిగ్గెయ్యదూ తన శరీరం అతనికి కనబడకుండా మరింతగా హత్తుకుపోతూ అతని ముఖం మీద షవర్ జల్లులతో చిరుదెబ్బలు కొట్టసాగింది

ఉండుండు ఒదులొదులు అంటున్నాడేకాని అతనికీ అనుభూతి హాయిగా వుంది మృదుల మీద కోపం - రాత్రంతా తను పడ్డ అవస్థ - తను అపురూపంగా దాచుకునే బట్టలు - అన్నీ మర్చిపోతున్నాడు ఊహకందని ఏ లోకాల్లోకో తేలిపోతున్నాడు

కాలింగ్ బెల్ చప్పుడు వినిపించింది ఉలిక్కిపడ్డారు యిద్దరూ బాగవతార్‌ని బాత్రూమ్ లోంచి బయటికి నెట్టి నిముషంలో వచ్చేస్తా అని తలుపు బోల్ట్ పెట్టేసుకుంది ఒంటిమీద తలమీద పడ్డ చన్నీళ్ళు బాగవతార్‌ని చాలా వరకు చల్లార్చినా మృదుల చేతుల్లోంచి బయటపడగానే అరగంట కింద వదిలేసిన ఆలోచనలన్నీ ఈగల్లా ముసురుకున్నాయి వచ్చి తల తుడుచుకుని బట్టలు మార్చుకుని వీది తలుపు తెరిచాడు ఎదురుగా టాక్సీ డ్రైవర్ చేతిలో యాభైరూపాయల నోటు ముందుకు జాపి ఇది అమ్మగారి కియ్యండి అన్నాడు

ఎందుకు? అడిగాడు బాగవతార్

నిన్న నా టాక్సీలో ఆవిడ్ని తిప్పాను వందరూపాయల నోటు యిచ్చారు అప్పుడు నాదగ్గిర చిల్లరలేదు ఇప్పుడు తెచ్చాను తీసుకొని మీ బార్యగారి కివ్వండి నేవెళ్ళాలి

బొమ్మలా నిలబడ్డ బాగవతార్ చేతిలో యాభై రూపాయల నోటు పెట్టేసి వెళ్ళి పోయాడు టాక్సీ డ్రైవరు అతడు లోలోపల నవ్వుకుంటున్నట్లు తోచింది బాగవతార్‌కి

మీ బార్య గారికివ్వండి అని ఎంత వెటకారంగా అన్నాడు వాడు మృదుల స్నానం చేసి జీన్స్‌లో తయారై వచ్చింది స్నానం చేసి దువ్వుకోకుండా వదిలేసిన జుట్టు ఫాన్ గాలికి విశృంఖలంగా ముఖం మీద చిందులు వేస్తోంది కాంతివంతమైన కళ్ళు ఎప్పటిలాగే నవ్వుతున్నట్లుగానే వున్నాయి మృదులలో గొప్ప ఆకర్షణ ఏసందర్భంలో యెప్పుడు చూసినా నవ్వుతున్నట్లే కనిపించడం

టాక్సీవాడు యాభైరూపాయలిచ్చాడు ఏభైరూపాయల నోటు ఆమె వేపు చాచాడు బాగవతార్ అది చూడగానే మృదుల ముఖం పాలిపోతుందని టాక్సీలో వెళ్ళినందుకు ఏవేవో కథలు కల్పించి చెప్పడానికి ప్రయత్నిస్తుందని ఊహించాడు అయితే మృదుల అతి మామూలుగా ఆనోటు నీపర్సులోనే వుండనీ ఎవరిదగ్గరుంటేనేం? అదిసరే– రాత్రంతా ఎక్కడెక్కడ తిరుగుతున్నావు? అట్నుంచి అటే మరో ప్రోగ్రాంకి వెళ్ళావా? నీకోసం చూసి చూసి నిద్రలోకి జారిపోయాను రాలేకపోతే ఫోనైనా చెయ్యొద్దా ముద్దుగా కోప్పడింది

నిర్ఘాంత పోయాడు ఇదేమిటి? ఇవన్నీ తను అనవలసిన మాటలు కదూ!

నువ్వెక్కడి కెళ్ళావు రాత్రి?

నేనా! ఎక్కణ్నుంచి మొదలు పెట్టను? ఆలోచిస్తూ అంది

జుట్టు పీక్కోబోయి ఆగిపోయి నిజంచెప్పు అన్నాడు కళ్ళెర్రజేసి గద్దిస్తూ ఒక్క అడుగు వెనక్కి వేసింది అబద్ధం చెప్పవలసిన అవసరం నాకేమిటి?

తప్పుచేసిన వాళ్ళకి అబద్ధాలతో అవసరం తప్పదు

ప్రాస బ్రహ్మాండంగా వుంది కాని అసలు తప్పంటే యేమిటంటా? ఎద తప్పో






# గోద్రెజ్ వారి కొత్త సబ్బు-ఫే
# పూలరాసులలో జలకాలాటలాడిన అనుభవం.

రూ.3.75*




ఫే గోద్రెజ్ వారి కొత్త సబ్బు

ఫే దీనితో వుంది అధిక నురుగునిచ్చే ప్రత్యేక పదార్థం ఎక్స్ఎల్ఎ ఇది మీకిస్తుంది ఉప్పు నీటిలో కూడా మెత్తటి నురుగు

ఫే రండి, చాలా సమయం నిలిచి వుండే పూల-పరిమళాలు వెదజల్లే మృదువైన 'ఫే' తో స్నానం చేయండి.

ఫే దీంతో స్నానం పూల రాసులలో జలకాలాటలాడిన అనుభవం

* స్థానిక పన్నులు అదనం బరువు 75 గ్రాములు

గోద్రెజ్

Enterprise

## రేపటి మహిళ

–ఏది ఒప్పో నిర్ణయించే వాళ్లెవరుట?"

తడబడి పోయాడు భాగవతార్. ఈ పిల్ల మామూలు ఆడవాళ్లల్లా ఏడ్చినా దెబ్బలాడినా– భయపడినా– అతడు అర్థం చేసుకో గలిగేవాడు. కాని అతని కంతక్ముందు పరిచయంలేని సరికొత్త పద్ధతిలో మాట్లాడేస్తోంది అమాయకంగా కనపడే యీ అతితెలివైన పిల్ల. సమాధానం చెప్పలేకపోతున్నాడు సరికదా బుఱ్ఱపనిచేయడంలేదు. కళ్లప్పజెప్పి చూసాడు.

"రాత్రి ఎప్పుడొచ్చావు?" బోనులో ముద్దాయిని నిలదీస్తున్న లాయర్‌లా అడిగాడు.

"ఎప్పుడొచ్చానో సరిగ్గా టైమ్ చూసుకోలేదు. టాక్సీలో వచ్చాను. నాతాళం చెవితో తలుపు తీసుకుని బెడ్‌రూమ్‌లో కొచ్చి పడుకున్నాను. ఏముంది యిందులో".

"నేను గుమ్మందగ్గిరే కుర్చీలో కూర్చున్నాను కదా! నాకెనపడకుండా ఎలా వచ్చావు?"

"ఏవిటీ...... రాత్రంతా".... వాక్యం పూర్తి చేయకుండా ఆగిపోయి పడిపడి నవ్వుతూ, నవ్వుల మధ్య ఒక్కొక్క మాటా మాట్లాడుతూ...

"ఇక్కడ .... ఈ కుర్చీలో.... రాత్రం..... తా. కూర్చునే..... " పొట్ట చేత్తో పుచ్చుకుని నవ్వేసింది. బిక్కచచ్చి పోయాడు భాగవతార్. ఎగురుతోన్న ఆ జుట్టు పట్టుకుని ఎడాపెడా వాయించాలనుంది. అపని ఎందుకు చెయ్యలేక పోతున్నాడో అతనికే అర్థం కావటంలేదు. నవ్వాపుకుని, చటుక్కున అతని మెడచుట్టూ చేతులు వేసి నుదుటి మీద ముద్దుపెట్టుకుని, "ఎంతప్రేమ, నేనంటే" అంది గోముగా.

"ఎలా వచ్చావు? లోపలికి." ఏడుపు గొంతుతో అడిగాడు,

"సింపుల్. నువ్వు తలుపు దగ్గిర కుర్చీ వేసుకోవడానికి ముందే వచ్చి లోపల పడుకుని వుంటాను. నువ్వు ప్రేమలో మునిగి తేలిపోతూ పైన చూడకుండానే గుమ్మం దగ్గర కాపలా కాసి వుంటావు".

"అ......," అన్నాడు నోరుతెరిచి. ఆనోరు రెండు చేతులతో మూసి "దోమలు దూరాయి. వాతావరణంలో పొల్యూషన్ ఎక్కువైపోయి దోమలు పెరిగి పోతున్నాయి" నవ్వింది.

ఈ గంద్రగోళంలో తను అడగ దల్చుకున్నదేమిటో మర్చిపోయాడు భాగవతార్. అతని భుజం చుట్టూ చెయ్యివేసి, "తెల్లవార్లూ సరిగ్గా నిద్రలేదేమో? కాస్సేపు రెస్ట్ తీసుకో. లేచేసరికి వంటమనిషితో వేడివేడి కాఫీ రెడీ చేయిస్తాను". అని చెయ్యి పట్టుకుని బెడ్‌రూమ్ లోకి తీసుకు వెళ్ళి మంచం మీద పడుకో బెట్టి ఫాన్ వేసి మెత్తటి కాశ్మీర్ శాలువా కప్పింది. తనకంటె ఇరవైయేళ్ళు చిన్నదైన ఆ అమ్మాయి చేతుల్లో నలభై యేళ్ల పెద్దమనిషి పసివాడిలా మారిపోయి నిద్రలోకి జారిపోయాడు. అతను లేచేసరికి ఉదయం పదకొండు గంటలైంది. బెడ్‌రూమ్ కిటికీ తెరలన్నీ లాగేసి చీకటిగా వుంచడం వల్ల సూర్యకిరణాలు లోపలికి రాక అతనికి పొద్దెక్కుతోందనే స్పృహ కలగలేదు. గడియారం చూసి ఖంగారు పడిపోయి మంచానికున్న కాలింగ్ బెల్ నొక్కాడు గట్టిగా. వంట మనిషి వేడి కాఫీ కప్పుతో అతని ముందుకొచ్చి కాఫీ సైడ్ టేబిల్ మీద పెట్టి చిన్న స్లిప్ చేతికందించింది.

"డియర్ బి,

నువ్వు అతిగాఢంగా నిద్రపోతున్నావు. ముద్దుపెట్టుకున్నాకూడా మెలుకువ రానంత గాఢంగా – అంత సుఖనిద్ర పాడు చెయ్యాలనిపించలేదు. అర్జెంటు పనిమీద వెళుతున్నాను. వివరాలు వచ్చాక.

ఎత్ కౌసస్ – యమ్.

తల తిరిగి పోయింది భాగవతార్‌కి. గొంతు ఎండుకు పోయినట్టై గటగట కాఫీ తాగబోతే నాలిక చుఱ్ఱుమని చేతిలో కప్పు కిందెత్తేసాడు.

(ఇంకా ఉంది)

# నోబెల్ బహుమతికి అర్హుడు



విశ్వకవి రవీంద్ర నాద టాగూర్ తర్వాత మరే భారతీయ సాహిత్యకారుడినీ నోబెల్ సాహిత్య బహుమతి వరించ లేదు ఆరు దశాబ్దాల తర్వాత ఆ పురస్కారానికి అర్హుడిగా గుర్తించ బడిన రచయిత విద్యాదర్ సూరజ్ ప్రసాద్ నయిపాల్ 1977 నుంచి ఇప్పటి వరకు ఆయన అనేక సార్లు ఆ బహుమతికి ప్రతిపాదించ బడ్డాడు ఆయన మొదటి పుస్తకం ప్రచురించబడి సరిగ్గా 30 సంవత్సరాలయింది ఆయన పూర్వీకులు భారతీయ బ్రాహ్మణులు ఉత్తర ప్రదేశ్ లోని గోరఖ్‌పూర్ నుంచి ఆయన తాత వెస్టిండీస్ లోని ట్రినిడాడ్‌కు వలస వెళ్ళాడు 1932 లో జన్మించిన నయిపాల్ తల్లిదండ్రులకు కలిగిన ఏడుగురు బిడ్డలలో రెండవ వాడు పెద్ద కుటుంబం, పేదరికం కలిసి ఆయనకు బాల్యంలో ఇంటాబయటా గందరగోళం వ్యాపించి ఉన్నట్టనిపించేది ఈ గందరగోళం మధ్య పాఠశాల ఒక్కటే సవ్యంగా ఉన్నట్టు ఆయన భావించేవాడు ఆ పరిసరాల నుంచి వెళ్ళి పోవాలనే కోర్కె ఆయనను ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి చేర్చింది ఇంగ్లీషు ఐచ్ఛిక అంశంగా స్కాలర్‌షిప్‌తో ఆయన అక్కడ చదువు కొనసాగించాడు ఆరు సంవత్సరాల చదువు తర్వాత నిరుద్యోగంతో నిరాదారంగా లండన్‌లో అడుగు పెట్టిన నయిపాల్ రచనా వ్యాసంగం సాగించడానికి ప్రయత్నించి తొలి రోజుల్లో విఫలమయ్యాడు నవలారచనలో విఫలమైన నయిపాల్ త్వరలోనే కథారచయితగా ప్రముఖుడు కాగలిగాడు ఆ విజయంతో ప్రోత్సాహం పొంది వరుసగా మూడు పుస్తకాలు ప్రచురించాడు ఆ తర్వాత వ్రాసిన ఎ హౌస్ ఫర్ మిస్టర్ బిస్వాస్ నయిపాల్‌కు రచయితగా స్థిరమైన స్థానం సంపాదించి పెట్టింది 1962లో భారత దేశం సందర్శించిన నయిపాల్ తన అనుభవాలను అభిప్రాయాలను ఆన్ ఏరియా ఆఫ్ డార్క్‌నెస్ పేరిట అక్షరబద్ధం చేశాడు ఆ తర్వాత మిస్టర్ స్టోన్ అండ్ ది నైట్స్ కంపానియన్ ది మిడిల్ పాసేజ్ ఇన్ ఎ ఫ్రీస్టేట్ ఎ బెండ్ ఇన్‌ది రివర్ ది మిమిక్ మెన్ వంటి పుస్తకాలతో ఆయన మహారచయితగా ఖ్యాతి గడించాడు 1977 లో ప్రతిష్ఠాత్మక పత్రిక న్యూస్ వీక్ ముఖపత్రాన్నలంకరించే గౌరవం కూడ పొందిన నయిపాల్ తప్పని సరిగా నోబెల్ బహుమతి పొందుతాడని సాహిత్యాభిమానులు ఊహించారు ఈ మధ్యనే ది ఎనిగ్మా ఆఫ్ అరైవల్ పేరిట ఆత్మకథాత్మకమైన నవల వ్రాసిన నయిపాల్ బ్రిటన్‌లోని స్టోన్ హెంజ్ సమీపంలోని విల్ట్‌షైర్ గ్రామంలో నివసిస్తున్నాడు ఆయన భార్య పాట్ ఇంగ్లీషు వనిత □

# వ్యక్తిగతం

## ఆర్థిక విధానాల విజయం!



నిరాడంబరమైనటువంటిదనీ వర్గాలతో సంబంధం లేని సామరస్యానికి నెలవనీ ఎంత ప్రతిష్ఠ ఉన్నా ఆస్ట్రేలియన్ లేబర్ పార్టీ ఇంత వరకు ఎన్నికలలో వరుసగా విజయాలు సాధించ లేక పోయింది 1901 లో స్వాతంత్ర్యం పొందిన నాటి నుంచి ఇప్పటి వరకు ఆస్ట్రేలియాను పాలించినటువంటి 23 మంది ప్రధాన మంత్రులలో కేవలం తొమ్మిది మంది మాత్రమే లేబర్‌పార్టీకి చెందిన వారు అటువంటి స్థితిలో వరుసగా మూడవసారి కూడ విజయం సాధించి బాబ్‌హాక్ చరిత్ర సృష్టించారు ఈ గెలుపు తర్వాత కళ్ళలో విజయానందం ప్రకాశిస్తున్న హాక్ "ఇది గర్వించదగిన కృతజ్ఞత చూపించదగిన సమయం అన్నారు పందొమ్మిది రోజుల ఎన్నికల ప్రచారం సందర్భంగా తలెత్తిన విభేదాలను మరిచిపోదామనీ తన ప్రభుత్వం ప్రజలందరికీ చెందినటువంటి ప్రభుత్వమని ఆయనన్నారు రాజకీయాలలోకి రాక ముందు యూనియన్ నాయకుడిగా ఉన్నహాక్ మద్యపాన ప్రియుడుగా ఉండేవాడు కాని 1983 ఎన్నికల్లో పోటీ చేసేప్పుడు గెలిస్తే తాగడం మానేస్తానని వాగ్దానం చేసి ఆ వాగ్దానం నిలబెట్టుకున్నాడు ఆయన కార్మిక వర్గ మద్దతును మాత్రమే గాక సాధారణంగా అనుమానాలతో ఉండేటటువంటి మధ్య తరగతి వ్యాపార వర్గాల మద్దతును కూడ కట్టుకోగలిగాడు హాక్ సాధించిన విజయం ప్రధానంగా ఆయన ఆర్థిక విధానాలదేనని వ్యాఖ్యాతలు అంటున్నారు ప్రభుత్వ వ్యయాన్ని జాతీయాదాయంలో ఒక శాతానికి మించకుండా చూడాలని ఆయన ప్రయత్నించారు □

# రష్యా తలుపులు తెరుస్తున్న చెయ్యి!.



సోవియట్ రష్యా అధినేత మిఖయిల్ గోర్బచేవ్ ఆర్థిక రాజకీయ రంగాలలో అనేక సంస్కరణలను ప్రకటిస్తున్నారు ఈ సంస్కరణలన్నిటినీముందు కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, తర్వాత దేశ పాలక సంస్థ అయినటువంటి సుప్రీం సోవియెట్ ఆమోదిస్తూ వస్తున్నాయి అలా ఆమోదం పొందిన తాజా సంస్కరణలలో అలెగ్జాండర్ యాకొవ్‌లెవ్ అనే సిద్ధాంత వేత్తను పొలిట్ బ్యూరో లోకి తీసుకోవడం ఒకటి యాకొవ్‌లెవ్ స్థాయి పెరగడం రాజకీయ ఆర్థిక విధానాల సడలింపు క్రమంలో ఒక ప్రధాన విజయమని భావిస్తున్నారు 63 సంవత్సరాల యాకొవ్‌లెవ్ ఇప్పుడు బాగా ప్రచారంలో ఉన్న గ్లాస్‌నోస్ట్ (బహిరంగ విధానం) నిర్మాత అని, కళాత్మక, సాహిత్య స్వేచ్ఛ ఇతోధికంగా ఉండాలని వాంఛిస్తున్నారని తెలుస్తున్నది ప్రస్తుత స్థాయి యాకొవ్‌లెవ్‌కు పార్టీలో రెండో స్థానాన్ని అనదికార రెండో కార్యదర్శి స్థానాన్ని ఇస్తుంది రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఆయన పార్టీలో ప్రవేశించాడు పార్టీ ప్రచార శాఖకు 1973లో నిర్వాహక అదిపతిగా నియమించ బడినప్పటి నుంచి సైద్ధాంతికంగా ఆయన తీసుకున్న దృక్పథం ఆయనను తెరమరుగు చేసింది ఆ దృక్పథానికి శిక్షగా ఆయన పది సంవత్సరాల పాటు కెనడాలో రాయబారిగా పని చేయాల్సి వచ్చింది 1983 లో అప్పుడు వ్యవసాయ శాఖ కార్యదర్శిగా ఉన్న గోర్బచేవ్‌ను కెనడాకు ఆహ్వానించిన తర్వాత యాకొవ్‌లెవ్ స్థితి మారిపోయింది కొంత కాలం ఒక ఆలోచనా బృందం అదిపతిగా తర్వాత ప్రచార శాఖ అదిపతిగా ఆయన పదవులు నిర్వహించారు అప్పుడే ఆయనకు పత్రికారంగం గురించి కళల గురించి గోర్బచేవ్‌కు సలహాలిచ్చే బాధ్యత కూడా వచ్చింది ఆ క్రమంలోనే ఆయన గ్లాస్‌నోస్ట్ గురించి గోర్బచేవ్‌కు నచ్చజెప్పారు గోర్బచేవ్ సతీసమేతంగా విదేశ యాత్రలు చేయడం వెనుక కూడ యాకొవ్‌లెవ్ మంత్రాంగం ఉన్నట్టు తెలుస్తున్నది ఈ యాత్రల ఫలితంగా పశ్చిమ యూరప్‌లో గోర్బచేవ్ ఎంతో ఆదరణను కొత్తగా సంపాదించారు 1959లో అమెరికాలోని కొలంబియా విశ్వవిద్యాలయంలో చదివిన ఆయన అమెరికాపట్ల తీవ్రమైన విద్వేషాన్ని ప్రకటించే రచనలు చేశారు వాటిలో ఒకదాని గురించి చర్చిద్దామని అమెరికన్ రాయబారి ఆర్థర్ హార్ట్‌మాన్ అడిగితే అలాగా అయితే నేను దాన్ని చదవాలి అన్నారట యాకొవ్‌లెవ్ ఆయన పేరిట వచ్చిన రచనలు ఆయనవేనా అని ? □

# భారత దేశానికి దక్షిణ కొసన తెలుగు పతాకను ఎగురవేస్తున్న ఆంధ్రుడు

"తెలుగు పతాకం యె గురని దిశయేలేదు
తెలుగు దివ్య వెలుగనట్టి నిశయేలేదు
తెలుగు పులుగు చేరలేని దేశం లేదు
తెలుగు వెలుగు దూరలేని దేశం లేదు

అన్నారు ప్రఖ్యాత కవి డా దాశరథి ఈ మాటల్ని అక్షరాలా నిజమనిపించాడొక తెలుగువాడు

భారత దేశానికి దక్షిణాన వున్న చిట్ట చివరి ప్రదేశం గ్రేట్ నికోబార్ దీవిలోని ఇందిరా పాయింట్ దీనినే లోగడ పిగ్మాలియన్ పాయింట్ అని పిలిచేవారు ఈ ఇందిరా పాయింట్ భూమధ్యరేఖకు ఉత్తరాన 6° 45 తూర్పున 95° 5 మధ్యన వుండటం వలన దేశానికి దక్షిణాన చిట్ట చివరి ప్రాంతంగా పరిగణింపబడుతున్నది ఇక్కడ 30 మీటర్ల ఎత్తుగల లైట్ హవుస్ తప్ప మరేమీలేదు అంతా అడవి లైట్ హవుస్ కెదురుగా భీకరమైన సముద్రం ఇందిరా పాయింట్ దగ్గర వున్న ఒకే ఒక వ్యక్తి లైట్ హవుస్ వాచ్‌మన్ అతను పదహారణాల ఆంధ్రుడు తెలుగు పతాకను దేశానికి దక్షిణ దిశను ఎగురవేస్తున్న ఈ తెలుగు బిడ్డే చక్కా ఎర్రన్న ఇతను శ్రీకాకుళం జిల్లాలోని పలాస దగ్గర వజ్రపు కొత్తూరు గ్రామానికి చెందినవాడు ఇతని వయసు సుమారు ఏభై సంవత్సరాలు

ఈ ప్రాంతంలో వర్షాలు ఎక్కువ అంతా అడవి అప్పుడప్పుడు భూకంపాలు కూడా రావడం కద్దు ఇలాంటి మారుమూల ప్రదేశంలో ఎర్రన్న అతని భార్య దాలమ్మతో జీవన సమరం సాగిస్తున్నాడు

ఎర్రన్న ఇరవై సంవత్సరాల క్రితం పొట్ట చేతో బట్టుకుని శ్రీకాకుళం నుంచి అండమాను దీవులకు చేరుకున్నాడు లైట్ హవుస్ డిపార్టుమెంటులో టెంపరరీగా బోట్‌మన్‌గా చేరాడు రాత్రనకా పగలనకా పడవల మీద పని చేసేవాడు ఆ రోజుల్లో జీతం కూడా చాలా తక్కువ ఆ తర్వాత ఈస్ట్ ఐలండ్ అన్న ద్వీపంలో ఇతణ్ణి నియమించారు ఈస్ట్ ఐలండ్ ద్వీపం నుంచి దిగ్లాపూర్ ద్వీపానికి మధ్య పడవలో రేషను సామాగ్రిని చేరవేయడం ప్రభుత్వ అధికారులను ఒక చోట నుంచి మరో చోటికి తీసుకుని వెళ్లడం ఇతని పని అక్కడ కొన్నాళ్లు పని చేసి తర్వాత గ్రేట్ నికోబార్ దీవిలోని కాంపెల్‌బేకి బదిలీ చేసారు

కాంపెల్‌బేకి 51 కిలోమీటర్ల దూరంలో వున్న ఇందిరా పాయింట్ దగ్గర అప్పుడు లైట్ హవుస్ నిర్మాణం జరుగుతున్నది కాంపెల్‌బే నుంచి ఇందిరా పాయింటుకు ఆ రోజుల్లో రోడ్డులేదు లైట్ హవుస్ నిర్మాణానికి కావలసిన సామాను అక్కడ పని చేసే కూలీలకు ఇంజనీర్లకు కావలసిన ఆహార సామాగ్రి కాంపెల్‌బే నుంచి సముద్రం మీద ఇందిరాపాయింటు దగ్గరకు చేర్చాలి ఈ పనికి ఎర్రన్న నియమించబడ్డాడు ఈ సముద్రంలో ప్రయాణం ప్రాణాలతో చెలగాటం లాంటిది కారణం ఇక్కడ అలల తాకిడి ఎక్కువ సముద్రంలో కరెంటుకూడా ఎక్కువే అదీకాక విపరీతమైన వర్షమూ గాలీ ఆ గాలికి పడవ అటూ ఇటూ ఊగుతూ కొట్టుకుపోతూ వుండేది

అంతేకాక ఆ రోజుల్లో మలేరియా ఎక్కువగా ఉండేది ఎవరన్నా జబ్బున పడితే వారిని సముద్రం మీద తీసుకుని వెళ్లడం కష్టం కనుక జబ్బుతో ఉన్న వారిని కావిడీల మీద అడవిలో కొండలు గుట్టలూ ఎక్కుతూ దిగుతూ 51 కిలోమీటర్లు కాంపెల్‌బే వరకూ మోసుకుని పోయేవారు ఎర్రన్న అట్లా చాలామందిని కావడీల్లో మోసుకుని పోయి అక్కడి ఆసుపత్రిలో చేర్పించాడు



ఇందిరా పాయింట్ లైట్ హవుస్ వద్ద పని చేసే వాచ్‌మన్ దంపతులు ఎర్రన్న, దాలమ్మ

1973 నుంచీ నేటివరకూ ఎర్రన్న అక్కడే వాచ్‌మన్‌గా కాలక్షేపం చేస్తున్నాడు ఎర్రన్న ఇతని బావమరిది అప్పన్న ఇక్కడ పని చేస్తున్నారు ఒకరు శలవులో వెళితే వుండేది రెండవవారు ఒక్కరే

ఎర్రన్న తనకు కావలసిన రేషను సామాన్లు నెలకో పదిహేను రోజులకో ఒక్కసారి 16 కిలోమీటర్లు బస్సుమీద మరో 35కిలోమీటర్లు నడిచి కాంపెల్‌బే వెళ్లి తెచ్చుకోవాలి

తరచుగా కాంపెల్‌బే వెళ్లడం ఈ కారణంగా కుదరదు కనుక ఎర్రన్న కూరలకుకానీ, పాలూ పెరుగులాంటి వస్తువులకు నోచుకోలేదు కోళ్లను పెంచుదామని ప్రయత్నించాడు కానీ ఇక్కడ పాములు ఎక్కువగా వుండటం వలన కోళ్లు బ్రతకలేదు

ఇందిరాపాయింట్ సుమత్రాకు సుమారు 150 కిలోమీటర్లు దూరంలోనూ ఇండోనేషియాకు 80 కిమీ దూరంలోనూ వుండటమేకాక అంతర్జాతీయ సముద్ర రహదారికి దగ్గరగా వుండటం వలన దేశ విదేశీయుల పడవలు చేపల్ని పట్టుకోవడానికి తరచుగా ఈ ప్రాంతానికి వస్తుంటాయి ఇక్కడ ఏ రకమైన రక్షణశాఖ సిబ్బంది కానీ పోలీసు సిబ్బంది కానీలేదు అన్నిటికీ ఎర్రన్నే! ఎటైనా ప్రమాదం ముంచుకుని వచ్చినా అతన్ని కాపాడే నాదుడులేడు పైగా అతనే ఈ సరిహద్దుక్కూడా కాపలాదారుగా వ్యవహరిస్తుంటాడు

ఒక సందర్భంలో కార్ నికోబార్ దీవి నుంచి కొంత మంది నికోబారి ఆదిమ జాతివారు తుపానుకు పడవల్లో చావు బ్రతుకుల మధ్య ఈ ప్రాంతానికి కొట్టుకొని వచ్చారు ఎర్రన్న దూరం నుంచే వారిని చూసి, ఎలాగో వారిని రక్షించి తన ఇంట్లో వారికి అన్నం పెట్టి తన స్వంత ఖర్చులతో కాంపెల్‌బే వరకూ వారందరినీ తీసుకొని వెళ్లి అక్కడి అధికారులచేత వారిని కార్ నికోబార్ పంపే ఏర్పాటు చేసాడు

అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ రాష్ట్రపతి జ్ఞాని జైల్‌సింగ్ ఇందిరాపాయింట్‌ను దర్శించినప్పుడు నీ అనుభూతి ఎట్లాంటిది అని అడిగినప్పుడు "పెద్ద వాళ్లతో ఏం మాట్లాడతాను?? నమస్కారంపెట్టి విజిటర్స్ బుక్ వారికివ్వడమే నా పని ఒకవేళ ఏమైనా మాట్లాడితే తప్పులు దొర్లవచ్చును అంటాడు ఈ అమాయకుడు

ఇంత దూరాన మీరు వంటరిగా ఎట్లా వుండగల్గుతున్నారు? అని రాష్ట్రపతీ క్యాబచ్చా? కైసాహై?? (ఏం బాబూ!! ఎట్లా వున్నావు?) అని ఇందిరాగాంధీ ఇతణ్ణి అడిగారట

ఇన్ని సంవత్సరాల నుంచి ఇక్కడే వుంటున్నావు కదా నువ్వు బదిలీ ఎందుకు కోరుకోలేదు అని అడిగితే 'నాకు ఇక్కడే బాగుంది పోర్ట్ బ్లెయిర్‌లో క్వార్టరు ఇవ్వరు అక్కడ ఇంటి అద్దె ఖర్చులూ భరించలేను చచ్చేవాళ్లం ఎక్కడన్నా చావాల్సిందే కదా అన్ని ఇబ్బందులతో అక్కడ కష్టపడటంకన్నా ఇదే మేలు అంటాడు ఎర్రన్న

ఈ లైట్ హవుసును సందర్శించడానికి వచ్చే యాత్రికుల సంఖ్య చాలా అరుదు కారణం సరైన రవాణా సౌకర్యం లేకపోవడమే ఏడాదికి ఒకరో ఇద్దరో వచ్చిపోతుంటారు ఆ వచ్చిన వారికి తన చిన్న తోటలోని కొబ్బరి బొండాల్ని ఇచ్చి ఆదరిస్తుంటాడు ఈ అభినవ కుచేలుడు

విశాలమైన సముద్రం తండ్రిగా దట్టమైన అడవి తల్లిగా, ఎత్తైన లైట్ హవుస్ అన్నగా– అండగా నిలిచి ఎర్రన్న దంపతుల్ని రక్షిస్తున్నవేమో ననిపిస్తుంది అక్కడి వాతావరణం చూస్తుంటే!!

–యస్ వి ప్రసాద్

# పంటినొప్పి వచ్చిందంటే గుర్తొచ్చేది భగవంతుడు, లేదంటే లవంగ నూనె.

సందేహం లేదు. పంటి నొప్పి తగ్గించడంలో తరతరాలుగా ఇంటింటా లవంగ నూనె ప్రధాన పాత్ర వహిస్తూనే ఉంది. లవంగం నిజంగా ఒక గొప్ప దినుసు. దీనిలో ఔషధ గుణాలే కాదు, ఆరోగ్యాన్ని చురుగ్గా ఉంచే ఆ తాజాదనాన్నిచ్చే సద్గుణం కూడా ఉంది. ఇందుచేత నిత్య జీవితంలో దీనికెంతో ఆదరణ ఉంది. పాక శాస్త్రంలోనేమి, ఔషధ శాస్త్రంలోనేమి, ఆఖరుకు ప్రామిస్ టూత్‌పేస్టులో కూడా దీని సద్గుణాల వినియోగం జరుగుతూనే ఉంది.

ప్రామిస్ టూత్‌పేస్టు ద్వారా లవంగ నూనెలోని ఔషధ గుణం, మీ పళ్లలో మూల మూలలా చేరి, మీ పళ్ల మొదళ్లకు హాని చేస్తున్న సూక్ష్మజీవులతో పోరాడుతుంది. తత్ఫలితంగా మీ పళ్లు సదా ఆరోగ్యవంతంగానూ, దృఢంగానూ ఉంటాయి. ఇంకా ప్రామిస్‌లోని ఇతర దినుసులు, మీ పళ్లను మంచి ముత్యాల్లా మెరిసిపోయేలా చేస్తాయి. ప్రామిస్‌తో పళ్లు తోముకున్న తర్వాత మీ పలుకులు సువాసనలు వెదజల్లుతాయి. ఎందుకంటే, నోటి దుర్వాసన కలిగించే సూక్ష్మజీవులను కూడా ఈ లవంగ నూనె కూల్చి వేస్తుంది, మీ శ్వాసలో తాజాదనం నింపి తెస్తుంది.

ప్రామిస్ టూత్‌పేస్టు, లవంగ నూనె...టూత్‌పేస్టుల ప్రపంచంలో ఇది నిజంగా ఒక అద్భుత మిశ్రమం. దీన్ని మీరు క్రమం తప్పకుండా వాడితే బహుశ: మీకు లవంగ నూనె గుర్తు రాకపోవచ్చు, మీకు దాని అవసరమూ కలగకపోవచ్చు. మీ పళ్లు మెరిసిపోతుంటాయి, మీ శ్వాస సువాసనా భరితంగా ఉంటుంది.




Promise



లవంగ నూనెతో అద్భుత సృష్టి - ప్రామిస్ టూత్‌పేస్టు

బల్సారా—
టూత్‌పేస్ట్ విశేషజ్ఞులు

CHAITRA - B BLS 820 TEL

# ఎవరికోసం

కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు

ప్రభుత్వ ఆస్పత్రిలోని ఇన్‌టెన్సివ్ కేర్ వార్డులో ఒక గంటనుంచి డాక్టర్లు సతమతమవుతున్నారు ఒక స్త్రీ వళ్ళంతా కాలింది ఎనభైశాతం కాలడంవల్ల ఆమె బ్రతికే అవకాశం చాలా తక్కువ అపస్మారక స్థితిలో ఉంది అయినా విధి నిర్వహణలో లోపం జరక్కూడదని డాక్టర్లు ప్రయత్నిస్తున్నారు ఆమె ఇప్పుడిప్పుడే కళ్ళు తెరిచేందుకు ప్రయత్నిస్తోంది కనుబొమలు ముఖం కూడా కాలాయి మనిషి రూపం చాలా వికృతంగా తయారయింది

ఆ వార్డుకు కొంచెం దూరంలో కారిడార్‌లో చాలామంది జనం ఉన్నారు కొంతమంది నిలబడి కొంతమంది పొడవైన బెంచీల మీద కూర్చుని ఉన్నారు అందరి ముఖాల్లో విషాదచాయలు దట్టంగా అలుముకున్నాయి

ఆస్పత్రి సూపరింటెండెంట్ ఒక పోలీసు ఆఫీసరుతో అటుగా నడుస్తూంటే అందరూ వారివంక సంభ్రమంగా ఆర్తిగా చూస్తున్నారు పోలీసు ఆఫీసరు అందరివంకా ఒకసారి సాలోచనగా చూసి ముందుకు కదిలాడు సూపరింటెండెంట్ ఒక సంపన్నంగా కనబడుతున్న వ్యక్తికి దగ్గరగా వెళ్ళి భయపడకండి మా ప్రయత్నం మేము చేస్తున్నాం ప్రమాద పరిస్థితి తప్పింది ఆమె బ్రతుకుతుంది అంటూ ఓదార్పు మాటలు చెప్పి ఇన్‌స్పెక్టర్‌ని అనుసరించాడు

నాకూతుర్ని చేతులారా చంపావు నువ్వు రాక్షసుడివి నీ అంతం చూస్తాను నిన్ను కటకటాల వెనక్కు పంపకపోతే నేను నీ మామను కాను ఈ మాటలు యువకుని మనస్సుని తూట్లు పొడుస్తున్నాయి

ఎంత అల్లారు ముద్దుగా పెరిగింది ఒద్దు వద్దన్నా వినకుండా ఇతణ్ణి నమ్మి పెళ్ళి చేసుకుంది అయినా ఈ ప్రేమ పెళ్ళిళ్ల నిర్వాకం ఇలానే వుంటుందని నాకు ముందే తెలుసు ఆ మామగారి పెద్దదిక్కయిన ఒక ముసలావిడ అన్నమాటలు శూన్యంలోంచి దూసుకుంటూ ఈటెల్లా గుండెకు తగులుతున్నాయి

ఎంత అందంగా ఉండేది ఎంత వికృతంగా తయారయింది అంతాయోగం ఎవరినని ఏం ప్రయోజనం ఇలా జరగాల్సి ఉంది జరిగింది ఈ కాలం పిల్లలకు కొంచెం కూడా సహనం ఓర్పు లేదాయె చుట్టం చూపుగా వచ్చినావిడ అన్న మాటలు వికృతార్థాన్ని ఎత్తి చూపిస్తున్నాయి

యువకుడు అసహనంగా లేచాడు అతనికి బిగ్గరగా అరవాలని వుంది ఆస్పత్రి దద్దరిల్లేలా ఏడ్వాలని ఉంది ఒక్కపరుగున వెళ్ళి భార్యను కౌగలించుకొని తన అశ్రువులతో మండే ఆమె శరీరానికి మంచి గంధం పూత పూయాలని ఉంది కానీ గొంతు పెగలటంలేదు అడుగు ముందుకు పడటం లేదు ఎంతో నిస్సత్తువగా ఉంది

అవును మీరన్నది నిజమే సుజాతను నేనే చంపాను నాతో కాపురం చేయలేక ఆమె ఒంటికి నిప్పంటించుకుంది నేను నేరస్థుణ్ణి నన్ను ఉరి తీయండి స్త్రీలు నన్ను చూసి అసహ్యించుకునేట్టు బేడీలు వేసి నన్ను నడివీధిలో నడిపించండి యువకుని మనసు బాధతో మూల్గుతున్నది

అయ్యగారు మిమ్మల్ని రమ్మంటున్నారు అటెండరు మాటలకు యువకుడు తలెత్తి అతని వంక చూశాడు తేరుకుని మెల్లగా అతణ్ణి అనుసరించాడు

రండి కూర్చోండి మీకు శ్రమ కలిగిస్తున్నందుకు క్షమించండి అయినా తప్పదు మా డ్యూటీ ఈ ప్రమాదం ఎలా సంభవించిందో చెప్పగలరా? ఇన్‌స్పెక్టర్ అడిగాడు

సుజాతను నేనే చంపాను కోపంతో ఆమె వంటిమీద కిరసనాయిలు పోసి నిప్పంటించాను నాలుగు అగ్గిపుల్లలు ఒక్కసారి గీసాను మండుతుంటే ఆనందంగా చలిమంట కాచుకున్నాను యువకుడు ఉన్మాదంగా అన్నాడు ఒక్క క్షణం ఆగి ఏమిటలా చూస్తారు ఇన్‌స్పెక్టర్ నన్ను అరెస్ట్ చెయ్యండి బేడీలు వెయ్యండి జైల్లో పెట్టండి ఉరితీయండి అలానే ఏదో గొణుగుతున్నాడు మాటలు ఒక్కోసారి మెల్లగా మరోసారి బిగ్గరగా అంటున్నాడు విషాదజీర వాక్యాలను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది

మీరు ఆవేశంగా మాట్లాడుతున్నారు స్థిమితపడండి జరిగింది చెప్పండి చాలు ఈ పరిస్థితుల్లో మిమ్మల్ని ఇలాంటి ప్రశ్నలు వేయకూడదు అయినా ఇది మా డ్యూటీ ఇన్‌స్పెక్టర్ ఎంతో సహనంగా యువకునికి నచ్చచెప్పాడు

చూడండి మిస్టర్ రవికుమార్ మీరు నాతో చెప్పింది ఒకరకంగా ఉంది ఇప్పుడు మరో రకంగా ఉంది మీరు స్టేట్‌మెంట్ మారిస్తే మీకే ప్రమాదం కేసు జటిలమవుతుంది సూపరింటెండెంట్ హెచ్చరికగా అన్నాడు

నా భార్య పోయిం తర్వాత నేను బ్రతికి ఏమి ప్రయోజనం డాక్టర్? నాకు జీవితం మీద ఆశలేదు నేను హంతకుణ్ణి అలానే నోట్ చేసుకోమనండి రవి కంటి వెంట రెండు కన్నీటి చుక్కలు వేగంగా జారాయి

ఆమె బ్రతకదని మీరెందుకనుకుంటున్నారు ఆమెకు ఎలాంటి ప్రమాదం లేదు కొంచెం సేపులో ఆమె కోలుకుంటుంది మీరు ఆవేశంతో ఏదో తప్పుడు స్టేట్‌మెంట్ ఇచ్చి ప్రమాదం కొని తెచ్చుకున్నారని తెలిస్తే ఆమె ఎప్పటికి కోలుకో లేదు ఆలోచించి నిజం చెప్పండి సూపరింటెండెంట్ ధైర్యం చెప్పాడు

సుజాత మెల్లగా కళ్ళు తెరుస్తోంది రెప్పలు విడివడుతున్నాయి పెదవులు విచ్చుకుంటున్నాయి రవీ రవీ అంటోంది

ఎదురుగా రవికుమార్ దీనంగా ఆమె ముఖంలోకి చూశాడు ఆమె కళ్ళు చెమర్చాయి రవి ఆమె కన్నీళ్ళు చూసి తట్టుకోలేకపోతున్నాడు

ఇప్పుడెలా ఉంది మనుషుల్ని గుర్తుపట్టగలుగుతున్నారా? దాహంగా ఉందా? సూపరింటెండెంట్ అడిగాడు

ఇప్పుడు బాగానే వుంది డాక్టర్! రవీ నన్ను క్షమించు నేనే తొందరపడ్డాను ఆవేశంలో జరిగిపోయింది అసలు ఇలా జరుగుతుందని నేను ఊహించలేదు ఏదో నిన్ను ఉడికిద్దామని అలా చేశాను ఇంతవరకు వస్తుందని అనుకోలేదు గొణుగుతున్నట్లు చెప్పుకుపోతోంది రవి సంతప్తుడై వింటున్నాడు ఇన్‌స్పెక్టర్ నోట్ చేసుకుపోతున్నాడు

సుజాత ఒక సంపన్న వంశంలో జన్మించింది చాలా గారాబంగా పెరిగింది తల్లి మరణంతో తండ్రే ఆమెకు సర్వస్వం అయ్యాడు ఏది కావాలంటే అది జరిగిపోతూండటంతో ఆమెలో మంకుతనం పెరిగింది ఒకరోజు మారుతి కారు కావాలంటే తండ్రి బ్లాకులో కొనిచ్చాడు మరో రోజు తన క్లాస్‌మేట్ రవికుమార్‌ని ప్రేమించానంటే పెళ్ళి చేయటానికి ఒప్పుకున్నాడు అయితే ఆయన రవికి ఒక విషయం నిక్కచ్చిగా చెప్పాడు

చూడు నాయనా! మా సుజాత నిన్ను ప్రేమిస్తున్నానంటోంది నిన్ను తప్ప మరెవరినీ పెళ్ళి చేసుకోనంటోంది ఇందులో నాకు అభ్యంతరం ఏముంటుంది? నువ్వూ బాగా చదువుకున్నావు ఉద్యోగమంటావా నీలాంటి లక్షణమైన వాడిని వెతుక్కుంటూ అవే వస్తాయి నువ్వు వెతకనక్కర్లేదు కానీ సుజాత లాంటిది నీకు దొరుకుతుందో లేదో నువ్వు తెల్సుకోవలసిన విషయం ఆమెలో వున్న అందం చదువు ఇంకా

ఏవో ఏవో నిన్ను ఆకర్షించి ఉంటాయి కాని ఆమెలో ఒక చిన్న లోపం ఉంది అది ఒక్కోసారి ఈ సుగుణాలన్నిటిని మరుగున పడేస్తుంది సుజాతకు మంకుతనం చాలా ఎక్కువ తన మాటే నెగ్గాలంటుంది అందులో ఏ మాత్రం సడలింపు ఉండదు తండ్రిగా నేను భరిస్తున్నాను కని పెంచిన మమకారం అలాంటిది కాని భర్త తండ్రి లాంటివాడు కాలేడు కని పెంచలేదు కాబట్టి తండ్రికుండే క్షమించే గుణం ఓర్పు ఉండవు చిన్నతనం నుంచి మమకారం ముడిపడలేదు కాబట్టి మీది ప్రేమ సంబంధం యవ్వనం పొంగు ఉన్నంత వరకే దీనికి బలం అప్పుడే ఒకరి పట్ల మరొకరికి మమకారం అనురాగం పెనవేసుకోవాలి మమకారంతో మాతృత్వం సిద్ధించినట్లు కామంతో మమకారం సిద్ధించుకోవాలి అప్పుడే వివాహ సంబంధం స్థిరంగా నిలిచేది

అంత అనుభవంతో ఆయన చెప్పిన మాటలు అప్పుడే ఎంత అర్థం చేసుకున్నాడో కానీ అన్నిటికి సరే' అనేశాడు కానీ ఇప్పుడు ఆ మాటల అంతరార్థం తెలిసి తప్పు తనదేనని రవి పశ్చాత్తాప పడుతున్నాడు

సుజాత ప్రతి చిన్న విషయానికి రవిని సాదించేది విశ్వనాద్ పిక్చర్‌కు రిలీజ్ డే మొదటి ఆట సినిమా టిక్కెట్లు దొరక్కపోతే అది రవి అసమర్థత ఆఫీసు నుంచి అరగంట ఆలస్యంగా వస్తే అది భార్య పట్ల నిర్లక్ష్యం కారు చెడిపోతే మెకానిక్‌కు ముందుగా చూపించి చెక్ చేయించక పోవడం అతని అశ్రద్ధ

రవి ఎంతో సహనంతో నచ్చచెప్పేవాడు ఆమె విసుక్కున్నా అంతగా పట్టించుకోక సర్దుకుపోయే వాడు అందువల్ల ఆమె మంకుతనం మరీ పెరిగింది క్రమంగా రవిలో సహనం నశిస్తోంది ఎంతటివాడికైనా బలహీన లక్షణాలు, పురుషాహంకారం తగు మాత్రమైనా ఉంటాయిగా'



ఒకరోజు సుజాత తన బర్త్‌డే పార్టీ చేసుకుంటానంది అందుకు రవికి అభ్యంతరం లేదు అయితే దుబారా ఖర్చులు చేస్తూ డబ్బు చాలక తండ్రి నుండి పట్టుకొస్తానంటుంది అది రవి ఆత్మాభిమానానికి గొడ్డలిపెట్టు

ఆ రోజు ఆమె అల్టిమేటం ప్రకటించింది అయితే నేను బర్త్‌డే చేసుకోవటం మీకు ఇష్టం లేదన్నమాట అవున్లే ఎందుకుంటుంది? ఆయన ఓ పిచ్చి తండ్రి కాబట్టి బర్త్‌డే రోజుకు మూడు రోజులు ముందుగా అన్ని ఏర్పాట్లు చేసి ఆ రోజుకు అందర్నీ పిలిచి గ్రాండ్ పార్టీ ఇచ్చేవాడు అయినా నా పిచ్చి గాని మొగవాడి మోజు ఎంత కాలం ఉంటుంది? ముచ్చట తీరేంత వరకో అంత మోజు తీరింతర్వాత మీ దగ్గరుండాల్సిన ఖర్మ నాకు పట్టలేదు ఇప్పుడే పుట్టింటికి వెళ్ళిపోతున్నాను

సుజా' నువ్వు పరిస్థితి అర్థం చేసుకోవడం లేదు నువ్వేమంత చిన్నదానివికాదు ఇప్పుడు ఆర్భాటంగా బర్త్‌డే చేసుకోవడానికి ఒక బిడ్డకు తల్లివి కాబోతున్నావు పైగా మాటి మాటికి డబ్బు ఇలా ఖర్చు పెడితే ఇప్పుడు అనుభవించే ఈపాటి జీవితం మన పిల్లలు రేపు అనుభవించలేరు వాళ్ళకు

## త్వరలో ప్రారంభం!
### కొత్త శీర్షిక




# చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి వైద్య సలహాలు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకి ఆరోగ్య సంబంధమైన సమస్యలపై ప్రసిద్ధ ఆయుర్వేద ఔషధాల తయారీ సంస్థ చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వైద్య నిపుణులు సమాధానాలు ఇస్తారు పాఠకులు తమ ప్రశ్నలని 'చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి వైద్య సలహాలు శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003 అనే చిరునామాకి ఈ కింద ఇచ్చిన కూపన్ జతపరిచి పంపవచ్చును ఒక కూపన్‌తో ఒక ప్రశ్నని మాత్రమే పంపాలి

కూపన్

ఆంధ్ర సచిత్ర వార పత్రిక




చింతలూరు ఆయుర్వేద ఫార్మశీ వారి వైద్య సలహాలు

ప్రశ్న



పంపినవారి పేరు

పూర్తి చిరునామా

## ఎవరికోసం

మిగిలేది ఏమీ ఉండదు రవి ఆవేశంగా అన్నాడు

"అయితే కడుపుతో ఉన్నంత మాత్రానా, ఒక నలుసుని కన్నమాత్రానా ఆడది అమ్మమ్మ అయిపోతుందా? మగవాడికి పెళ్ళాం మీద మోజు తీరిపోతుందా? ఆమె కోరికలు అతడికి ఉరి తాళ్ళులా అనిపిస్తాయా? వెటకారంగా అంది సుజాత

అది కాదు సుజా! నీ మీద ప్రేమ లేక కాదు అంత గ్రాండ్‌గా చేయడానికి డబ్బు లేక తాహతుకు మించి చేస్తే రేపు మన గతేమవుతుందనే ఆలోచనకొద్దీ

అయితే నేను ముందాలోచన లేని మూర్ఖురాల్ని మీరే తెలివి గలవారు ఇంత తెలివి తేటలుండి ఏం సంపాయిస్తున్నారు పెళ్ళానికి చిన్న కోరిక తీర్చలేకపోతున్నారు ఈసడింపుగా అంది

ఆమెతో వాదించడం వృదా అని అతడు గదిలోంచి బయటకు వచ్చి డ్రాయింగు రూంలో ఏదో పుస్తకం తిరగేస్తున్నాడు సుజాత లోపల మండిపోయింది ఆమె కోపం పూర్తిగా చల్లారలేదు లోపల ఉన్న కసి బయటకు వెడల గక్కాలంటే భర్త ఆమెను లెక్క చేయనట్టు అక్కడ నుంచి కదిలి వెళ్ళి డ్రాయింగు రూంలో కూర్చున్నాడు ఆమె అతణ్ణి వెతుకుతూ అక్కడికి వెళ్ళాలంటే అహంభావం అడ్డుపడింది మరో మార్గం తోచలేదు

కిరోసిన్ డబ్బా అల్మారాలోంచి తీసి దబ్బున నేల మీద పెట్టింది దానికి సొట్టపడింది అయినా మూత ఉండటం వల్ల అది తొణకలేదు బలంగా మూత తీసింది గరాటు అల్మారాలోంచి తీసి నేల మీద విసిరేసింది అది పెద్దగా శబ్దం చేస్తూ వంటింట్లో ప్రతిధ్వనించింది సుజాత గుమ్మం లోంచి తొంగి చూసింది రవి రాలేదు ఆమె కోపం పెరిగింది గరాటు డబ్బాలో పెట్టింది తీగను పైకీ కిందకూ లాగుతూ మూత లేని చిన్న డబ్బాలోకి కిరోసిన్ తోడుతోంది మధ్య మధ్యలో తొంగి తొంగి గుమ్మం వైపుగా చూస్తోంది రవి రావడం లేదు చిన్న డబ్బా కిరోసిన్‌తో నిండిపోయింది ఒంటినిండా జిమ్ముకుంటే ఆ వాసనకు రవి వుండబట్టలేక వస్తాడని ఆశించి అలానే చేసింది అయినా రవిలో చలనం లేదు ఆమెలో అహంకారం మేల్కొంది రవి ఆమెను అలక్ష్యం చేస్తున్నాడనే బావం ప్రబలమైంది ఏమైనా రవి వచ్చేట్టు చేయాలి నిశ్శబ్దంగా వున్న వాతావరణంలో అగ్గిపుల్ల గీసిన మోతకు తప్పకుండా రవి పరుగున వస్తాడు తనని ఆదరిస్తాడు ఒద్దంటూ బ్రతిమిలాడుకుంటాడు అప్పుడు తన పంతం నెగ్గుతుంది ఈ ఒక్కసారికి పంతం నెగ్గితే చాలు ఇహనుంచి మంచిగా మారచ్చు ఇలాంటి మొండి పట్టుదలకు పోకూడదు ఆవేశంలో రవిని ఎదిరించకూడదు కానీ ఇప్పుడు వెనుతిరిగితే తరువాత రవికి తను చులకన అయిపోతుంది అతడు తనని గేలి చేయవచ్చు ఇంత కాలం ఠీవిగా బ్రతికి ఇంత దీనంగా లొంగిపోకూడదు

అంతే అగ్గిపుల్ల వెలిగించింది – ఆ శబ్దానికి రవిలో చలనం లేదు ఆమె గుమ్మంలో నుంచి చూపులు సారిస్తోంది ఏక్షణమైనా రవి డ్రాయింగు రూంలోంచి ఒక్క ఉదుటున వస్తాడు మండే అగ్గిపుల్ల ఆర్పేస్తాడు కాని అలా జరగలేదు ఎప్పుడు నిప్పు వేళ్ళ చివర్ల తాకిందో ఎప్పుడు ఆమె నైలాను చీరను మంట చుట్టేసిందో తెలియదు స్పృహ వచ్చేప్పటికి ఆమె ఆస్పత్రిలో ఉంది ఎదురుగా రవి కన్నీళ్ళ తో నిలబడి ఉన్నాడు

అయితే ఇంత జరుగుతున్నా మీరు ప్రమాదం ఆపేందుకు ఆమెను రక్షించేందుకు ఎందుకు వెళ్ళలేదు ఇన్స్పెక్టర్ రవి వైపు చూస్తూ అడిగాడు

నా దురదృష్టం సిగరెట్లు అయిపోయినాయి కదా అని అప్పుడే బయటకు వెళ్ళాను వచ్చేప్పటికి అంతా అయిపోయింది"

ఐసీ అంటూ ఇన్స్పెక్టర్ పెన్ను జేబులో పెట్టుకున్నాడు సుజాత కళ్ళు మూతలు పడుతున్నాయి □

1వ వారం



2వ వారం



3వ వారం



4వ వారం



5వ వారం



# చూడండి!
# కేవలం 6 వారాల్లో త్వరగా
# మీ చాయ మెరుగవుతుంది

6వ వారం



## క్లియర్•టోన్
## ద్వారా చాయ మెరుగయ్యే పద్ధకం

మీ ముఖంపైన చాయ మరింత మెరుగ్గా మిలమిల మెరిసేలా, ప్రకృతి మీకిచ్చిన వరంలా

క్లియర్•టోన్ చాయను మెరుగు పరిచే క్రీమ్ చేస్తుందిది నిజం

క్లియర్•టోన్‌ని రోజుకి రెండుసార్లు మృదువుగా రాయండి దానిలోని మృదుత్వాన్ని మీ చర్మంలో లోపలికి ఇంకుతూన్న అనుభవాన్ని పొందండి —మిగిలేదిక కేవలం అద్భుతమైన ఆ ఫ్రెంచి సుగంధం క్లియర్•టోన్ యొక్క 4 విధాల చర్య ఇక మొదలు

**అద్వితీయమైన తీరులో చర్మపు చాయని మెరుగు పరిచే పదార్థం** (మరే క్రీములోనూ లేదు ఇది) మీ చర్మం లోపలనుంచి ప్రకృతి సహజమైన ఆ మెరుగు మెరుపును పునరుజ్జీవితం చేస్తుంది

**సూర్యకిరణాలను వడగట్టగల ప్రత్యేకమైన పొర మీకు** రోజంతా రక్షనిస్తుంది సూర్యకిరణాల నుంచి నల్లబడకుండా

**సమృద్ధవంతమైన మాయిశ్చరైజర్ మీ చర్మాన్ని అలా** కోమలంగా యవ్వనంలోని నేవళంగా వుండే ఆ లక్షణాన్ని తీసుకొస్తుంది

**వారాలు తిరిగే సరికల్లా చర్మంపైన మచ్చలలా మాసిపోతాయి** అలా చూస్తూచూస్తూ ఆరు వారాలు తిరిగేసరికల్లా క్లియర్•టోన్ తెచ్చే ఆ తేడాని మారే చూస్తారిక-దేశమంతట్లోని వేలకి వేల స్త్రీలూ ఇప్పటికే వాడి అనుభవంలోకి తెచ్చుకున్న ఆ అనుభవాన్ని.

క్లియర్•టోన్ తెచ్చే మెరుగైన చాయను మీరూ వేడుకోవాలిక కదూ?




లండన్ • ప్యారిస్ • న్యూయార్క్

సీరియల్

# మంత్రనగరం

గంధం

## రావినూతల సువర్ణకన్నన

(గత సంచిక తరువాయి)

చిన్న చిన్న పొదల్ని తప్పించుకుంటూ ముందుకు నడుస్తున్నాడు అరవింద్

అడవంతా పచ్చగా రకరకాల అడవిపూలతో పక్షుల అరుపులతో ఎంతో మనోహరంగా వుంది

మానవుడెంత ప్రగతి సాధించినా ఈ ప్రకృతిని గెలవగలడా? తన్మయత్వంగా అనుకున్నాడు

కెమేరా తీసి మెడకి తగిలించుకున్నాడు మెటల్ డిటెక్టర్ అతని చేతిలో వుంది

కొంత దూరం అలా నడిచాడు మెటల్ డిటెక్టర్ ఆన్ చేసి కొమ్మ కొమ్మకీ విరగబూసిన అడవి పూలని చూస్తూ మరికాస్త ముందు కెళ్ళాడు మధ్య మధ్య ప్రకృతిలోని సౌందర్యాల్ని తన కెమెరాలో పొందు పరచుకుంటున్నాడు

సూర్యుడు తల్లి గర్భంలోకి వెళ్ళడం ఇష్టం లేనట్టు మెల్లగా పయనిస్తున్నాడు

చెట్ల మధ్యనించి సూర్య రశ్మి కింది కొమ్మల ఆకుల మీద కుంకుమ అద్దినట్టు ఎర్రగావుంది

ఒత్తుగా పెరిగిన చెట్ల గుబురుల్లోంచి తప్పించుకుని వచ్చిన సూర్య కిరణాలు నేల మీద పడి వింత వింత డిజయిన్లుగా కనిపిస్తున్నాయి

సన్నని గాలి సున్నితంగా, హాయిగా శరీరాన్ని తాకుతుంటే తనని తాను మర్చిపోతున్నాడు అరవింద్

అతని కెమెరా క్లిక్‌మంటూనే వుంది

అతని చేతిలోని మెటల్ డిటెక్టర్ అనయే వుంది

ఇక్కడో నిధి దొరికితే? అనుకుని తన ఆలోచనకి తనే నవ్వుకున్నాడు

ఓ పెద్ద చెట్టు మీద పసిరిక పాము ఓ పిచ్చుక పిల్లని పట్టుకుని ఫలహారం చేస్తోంది

పిచ్చుక గోలగా అరుస్తోంది

క్రమేపీ దాని అరుపు ఆగిపోయింది

ఎందుకో ఆ దృశ్యం చూసేసరికి అరవింద్ ఒళ్ళు అదోలా జలదరించింది

క్షణం అలా నిల్చుండి పోయాడు

ఓ కోతి పిల్ల అతన్ని చూసి వెక్కిరించింది

అతను నవ్వాడు తేరుకుని

అది వింతగా చూసింది

ఇంతలో దాని తల్లి కాబోలు గబాల్నవచ్చి దాన్ని పొట్టకు కరుచుకుని బయం బయంగా చూస్తూ పారిపోయింది వాటి చేష్టలకి సన్నగా నవ్వుకుని మరికాస్త ముందుకెళ్ళాడ తను

చిన్న చిన్న కుందేళ్ళు నెమళ్ళు, లేళ్ళలాంటి చిన్న చిన్న జంతువులు, కోతిపిల్లలు అరవింద్‌ని చూసి కంగారుపడిపోయి బిత్తర చూపులు చూస్తూ పరుగులు తీస్తున్నాయి

దూరంగా పెద్ద జలపాతం వేగంగా దుమికి కొండలమీంచి పడి సెలయేరులా ప్రవహిస్తోంది ఆ ఏటిమీద వాలిన పెద్ద పెద్ద కొమ్మలకి విరగబూసిన అడవిపూలు ఏట్లోరాలి వాలుకు వేగంగా సాగిపోతున్నాయి

అలా మరి కొంత దూరం నడిచాడు అరవింద్ తన్మయత్వంగా హటాత్తుగా చేతిలోని మెటల్ డిటెక్టర్ మోగింది

టక్కున ఆగిపోయాడు అరవింద్

డిటెక్టర్ అటు ఇటు తిప్పాడు

అది మోగుతూనే వుంది దానిలోని ముల్లు ఏటికేసి చూపిస్తోంది అతను దాని సాయంతో పది గజాలు ఏటి వైపుకి నడిచాడు

ముల్లు వేగంగా కదులుతోంది

ఉత్సాహంగా మరో నాలుగడుగులు వేశాడరవింద్ ముల్లు డైరెక్షన్ మారింది.

అటు ఇటు నడిచి మొత్తానికి ఒక చోట నమ్మకం కుదిరాక ఆగాడు డిటెక్టర్ నేలకభిముఖంగా పెట్టాడు

అక్కడేదో మెటల్ వున్నట్టు నమ్మకంగా చెప్పింది డిటెక్టర్

వాచ్ చూసుకున్నాడు అరవింద్

ఆరు గంటలు చూపిస్తోంది వాచ్

ఓసారి తను వచ్చిన వైపుకి చూశాడు

జరిగినకథ - 2 పురావస్తు పరిశోధనా కేంద్రం ఆఫీసర్ అరవింద్‌కు పై అధికారి జయదేవ్ తన ఇంట్లోనే ఆశ్రయం ఇస్తాడు తన కూతురు కాంతిని పెళ్ళి చేసుకొమ్మని కోరుతాడు ఒక సమాచారం కోసం అరవింద్ ఖనిజాలున్న ప్రదేశానికి బయలుదేరుతాడు మధ్య దారిలో అడవిలో రైలాగిపోతుంది అక్కడి అద్భుత నిధుల గురించి, వాటిని కాపలా కాసే పిశాచాల గురించి కథలు విని ఉన్న అరవింద్ అడవిలోకి బయల్దేరతాడు



గుబురుగా పెరిగిన చెట్లు పొదలు తప్ప సరైన దారి కనిపించడం లేదు అంతటా చీకట్లు వహించేస్తున్నాయి

క్షణం ఆలోచనలో పడి ఓ నిర్ణయానికొచ్చిన అరవింద్ ఒక చోట గుర్తు పెట్టుకుని అక్కడ తవ్వడానికేమైనా దొరుకుతుందేమో అన్నట్టు వెతికాడు అయితే అక్కడ ఎండుటాకులు పుల్లలు తప్ప నేలను తవ్వేందుకుపయోగపడే దేమీ కనిపించలేదు నిరాశగా వెనుతిరిగి నాలుగడుగులు వేశాడు

హటాత్తుగా అతని కళ్లు వింతగా మెరిశాయి

దూరాన ఓ పొదలో ఏదో వస్తువు కనిపించింది ఒక్క పరుగున అక్కడికి చేరుకున్నాడు

ఆ వస్తువుకేసి పరిశీలనగా చూశాడు

అది ఓ అడవి దున్నకొమ్ము

అరవింద్ ఆనందానికి హద్దుల్లేవు

గబాల్న దాన్ని పొదలోంచి లాగాడు

ఆ కొమ్ము చాలా పెద్దదిగానూ బరువుగానూ వుంది మెల్లగా దాన్ని తీసుకుని తను గుర్తులు పెట్టుకున్న చోటికొచ్చాడు

మెటల్ డిటెక్టర్ సాయంతో ఒక చోట ఆ కొమ్ముతో తవ్వడం ప్రారంభించాడు

అతి ప్రయాస మీద అడుగు లోతు తవ్వాడు

# మంజీరనాదం

డిటెక్టర్ గోలపెడుతూనే వుంది

అతనికి ఆయాసం వస్తోంది

మరికాస్త లోతుకి తవ్వాడు

అంతే! అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి!

డిటెక్టర్ చూపించిందీ అతను కష్టపడి తవ్విందీ దర్శనం ఇచ్చింది

మెల్లగా దాన్ని చేతిలోనికి తీసుకున్నాడు అరవింద్ అది బాగా తుప్పుపట్టిపోయిన ఒకపెద్ద కత్తి!!

అతని పెదవుల మీద అలసటతో గూడిన దరహాసమెలిసింది

ఆ కత్తిని ఒకసారి ఎత్తి చూస్తూ –

అబ్బో! కత్తే ఇంత బరువుగా వుందే!! దీన్ని వాడే మనిషెలా వుండేవాడో!! అనుకున్నాడో క్షణం

ఏదో పక్షి భయంకరంగా అరుస్తూ అతని తల మీదుగా ఎగిరిపోవడంతో ఉలిక్కిపడి ఈ లోకంలోకొచ్చాడు అరవింద్

అమ్మో చాలా చీకటి పడిపోయిందే! అనుకున్నాడు చుట్టూ భయంగా చూస్తూ

మరుక్షణం కత్తి చరిత్రని వెతికింది అతని మనస్సు అది తీసికెళ్ళడం మంచిదికాదు అలా అని ఇంత పురాతన వస్తువు వదిలిపోవడానికి ఇష్టం లేదు

కాసేపు ఆలోచించిన అరవింద్ ఆ కత్తితోనే మరికాస్త తవ్వి దాన్ని జాగ్రత్తగా పూడ్చి పెట్టాడు కొమ్ము చేత పట్టుకొని సామాన్లు సర్దుకొని తిరుగుముఖం పట్టాడు

ఓ మహావృక్షం ఏ గాలివానకో పూర్తిగా వేళ్ళతోపాటు కూలి పారేనీళ్ళలో పడిపోయింది అయితే చిత్రంగా వేళ్ళన్నీ పైకొచ్చినా ఇంకా అడుగున ఎక్కడ పట్టుందో తిరిగి పుంజుకుని ప్రాణం పోసుకుంది

ఆశ్చర్యంగా ఆ చెట్టునే చూస్తూ నడుస్తున్న అరవింద్ మళ్ళీ డిటెక్టర్ మోగడంతో ఉలిక్కిపడి చూశాడు

అది పదేపదే మోగుతోంది

చ!చ! ఇంక వద్దు బాబూ! అన్నట్టు దాన్ని ఆఫ్ చెయ్యబోయి టక్కున ఆగిపోయాడు వెన్నెల్లో ఏదో కనిపించింది అది చూపిస్తున్న వైపు టార్చ్‌వేసి చూసాడోసారి పరీక్షగా

పడిపోయిన వటవృక్షపు వేళ్ళదగ్గర ఏదో వస్తువు మిలమిల మెరుస్తోంది

ఒక్క అంగలో దాన్ని సమీపించాడు అరవింద్ డిటెక్టర్ మోత ఎక్కువైంది

మెల్లగా ఆ మెరిసే వస్తువును చేతిలోకి తీసుకున్నాడు




అది ఒక బంగారు నాణెం!

మట్టి కొట్టుకున్నా మిలమిల మెరిసిపోతోంది

కర్చీఫ్‌తో మట్టిని తుడిచి చూశాడు

ఏదో లిపి!

అస్పష్టంగా వుంది!!

మళ్ళీ మళ్ళీ తుడిచి జాగ్రత్తగా పరిశీలించి చూశాడు

అది పాలి బాష!!

అరవింద్ కళ్ళు ఆనందంతో తళుక్కుమన్నాయి

నాణేన్ని ముద్దు పెట్టుకుని జేబులో వేసుకున్నాడు అయితే డిటెక్టర్ ఇంకా మోగుతూనే ఉంది

అతనోసారి కళ్ళు చిట్లించి జేబులోని నాణేన్ని దూరంగా వుంచి మళ్ళీ వచ్చి చూశాడు

అయినా డిటెక్టర్ మోగుతూనే ఉంది

అయితే అది నాణెంవైపు చూపడం లేదు మరోవైపుకి చూపుతోంది అంటే అంతకన్నా దగ్గర్లో మరో మెటలుందన్నమాట!

అప్రయత్నంగా అరవింద్ నోట విజిల్ వెలువడింది అతని ఆనందాని కంతులేదు చటుక్కున డిటెక్టర్ తీసుకుని అటుగా నడవబోయాడు

అంతే!పెద్దగా ట్రైన్ కూత వినిపించింది

ఓ సారి నిరాశగా అటు ఇటు చూశాడు

మళ్ళీ మళ్ళీ అరిచింది ట్రైన్

ఇంక తప్పదన్నట్టు డిటెక్టర్ స్విచ్ ఆఫ్ చేసి, నాణేన్ని జేబులో వేసుకుని దున్న కొమ్మును చేత పట్టుకుని ఓసారి పరిసరాలు జాగ్రత్తగా గమనించి చక చక అడుగులు వేస్తూ ట్రైన్‌కేసి నడక సాగించాడు

ఎంత వేగంగా నడిచినా అక్కడికి చేరుకోవడానికి దాదాపు గంట పట్టిందతనికి

అందరూ అతనికేసి ఆతృతగా చూస్తున్నారు

బ్రతికే వున్నారా నాయనా? అక్కసుగా అన్నాడు సింగ్

ఆహా! కనిపించడంలా? నిక్షేపంలా వున్నాను నవ్వుతూ అన్నాడు అరవింద్

ఏమైనా నిదులు దొరికాయా??

ఎక్కడా తవ్వుకోవడానికి టైముంటేగా మళ్ళీ నవ్వాడు అరవింద్

నిదుల మాటకేంగానీ అక్కడ క్రూర మృగాలేమైనా కనిపించాయా? అన్నారు కొందరు ఉత్సాహవంతులు

ఊహు! చిన్న చిన్న కుందేళ్ళు లేళ్ళులాంటివి మాత్రం కోకొల్లలుగా ఉన్నాయి

పోనీ అవే నాలుగు కొట్టుకు రాకపోయారా? కష్టానికైనా కాస్త ఫలితమైనా దొరికేది! అన్నాడు సింగ్ వ్యంగ్యంగా

కష్టానికి మించిన ఫలితమే లభించింది!

ఏమిటో అది?

ఇదిగో! చేతిలోని కొమ్ము మీద టార్చ్‌లైట్ వేసి చూపించాడు అరవింద్

ఏవిఁటిది కుతూహలంగా అడిగారంతా

అడవి దున్నకొమ్ము

మైగాడ్!! ఇంతపెద్ద కొమ్మా! నోరు తెరిచాడో అతను

సరిగ్గా ఏనుగంత వుండచ్చు ఈ కొమ్ము తాలూకు దున్నపోతు అన్నాడింకో అతను

కచ్చితంగా ఏనుగుని మించి వుండ వుంటుంది ఈ కొమ్ము మొయ్యడమే చాలా కష్టంగా వుంది!

ఓసారి దాన్ని పైకి ఎత్తడానికి ప్రయత్నిస్తూ అన్నాడు అరవింద్

అవును అది కొమ్ము కాబట్టి సరిపోయింది అదే అడవి దున్నయితే నీ ఎముకలు కూడా ఇలాగే దొరికేవి గొణిగాడు సింగ్

ఏవిఁటి సింగ్‌గారేదో అంటున్నారు ? ఒరగా అతనికేసి చూస్తూ అన్నాడు అరవింద్

అహఁ!! మరేం లేదు అడవి దున్న కొమ్ముకి బదులుగా అడవి దున్న మీ

# గడుసులోకం —బాబు







క్షనిఎంచనందుకు ఆనందిస్తున్నాను' గంభీరంగా అన్నాడు సింగ్

థాంక్యూ' నవ్వాడు అరవింద్

ఇంతలో గార్డ్ వచ్చాడటుకేసి

వచ్చారా బాబూ' ఏమయిపోయారో అని హడలి చస్తున్నాం' అన్నాడు అరవింద్‌ని చూస్తూ

సారీ సర్ మీకు ఇంజన్‌తోపాటు నేను కూడా కాస్త ట్రబుల్ ఇచ్చినట్టున్నాను అన్నాడు అరవింద్ నొచ్చుకుంటూ

ఇట్సాల్‌రైట్'' మాకేం ఇబ్బంది లేదనుకోండి కానీ ఇంతసేపు ఎం చేశారండి అక్కడ? కుతూహలంగా అడిగాడు గార్డ్

చాలా చూశాను' నవ్వాడు అరవింద్

నయం మీ అదృష్టం బావుంది ఈ సమయంలో ఆ అడవి సెలయేరు దగ్గరికి అడవి జంతువులు మందలు మందలుగా వస్తాయి వాటిలో ఏ ఒక్కటి చూసినా మీకు నూకలు చెల్లేవే''

నిజమే కానీ ఎవిటో నాకు చిన్నతనం నించీ ఇలాంటి ప్రదేశాలన్నా పురాతన వస్తువుల సేకరణన్నా చాలా ఇష్టం అందుకే దొరికిన ఈ అవకాశాన్ని ఒదులుకోలేక పోయాను అన్నాడు అరవింద్

ఇంతకీ పురాతన వస్తువులు ఏవైనా దొరికాయా? తమాషాగా అడిగాడు గార్డ్

ఆఁ ఇదిగో' కొమ్ము చూపిస్తూ అన్నాడు అరవింద్

ఈ కొమ్మా?

అవును బావుంది కదూ? కాస్సేపు ఈ కొమ్ము కొన్ని శతాబ్దాలనాటిది అనుకుందాం నవ్వాడు అరవింద్ గార్డ్ కూడా నవ్వాడు

ఇంతకీ ట్రైన్ బాగయినట్టేనా?

ట్రైన్‌కాదు ట్రబులిచ్చింది ఇంజన్ వ్యంగ్యంగా అన్నాడు సింగ్ ఆ మాటకి నవ్వారు

అరవింద్ కూడా నవ్వేశాడు

ఇంజన్ దాదాపు బాగయినట్టే ఎంత సేపటికి మీరు రాకపోవడంతో కంగారుపడి విజిల్ వేశాం' అన్నాడు గార్డ్

థాంక్యూ అన్నాడు అరవింద్

గార్డ్ ఇంజన్‌కేసి నడిచాడు

మరో అరగంటకి ఇంజన్ బాగయింది

గట్టిగా విజిల్ వేశాడు డ్రైవర్

గార్డ్ ట్రైన్‌కి కాస్త ఇవతలగా వచ్చి–

ఇంజన్ రెడీ త్వరగా ఎక్కండి అన్నాడు అరిచినట్టు

పసి పిల్లల్లా అరిచారు పేసింజర్స్

బిలబిల్లాడుతూ ఆనందంగా కేరింతలు కొడుతూ ట్రైన్లో ఎక్కేశారు

అరవింద్ వాళ్లంతా కూడా తమ కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కేశారు అసలు ఇంజన్ ఇంతలో బాగవుతుందని ఎవరూ అనుకోలేదు

ఆ రాత్రి ఆ కీకారణ్యం మధ్య బిక్కు బిక్కుమంటూ అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకున్నట్టు గడపాలని అనుకున్నవారందరికీ ఇంజన్ బాగయిందనేసరికి వెర్రి ఆనందం వచ్చేసింది

అందరూ ఎక్కేశారా? మరోసారి హెచ్చరించాడు గార్డ్

ఎక్కేశాం' అరిచారు పాసింజర్స్

ఆ తర్వాత గార్డ్ కూడా ఎక్కేసి ఓసారి పరిసరాలు టార్చ్ సహాయంతో పరికించి అందరూ ట్రైన్ ఎక్కేశారన్న నమ్మకం కుదిరాక గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు

ట్రైన్ మరోసారి రంకెపెట్టి మెల్లగా కదిలింది

* * * * * *

అరవింద్ తిరిగి వచ్చేసరికి నాలుగు రోజులు పట్టింది ఈ నాలుగు రోజులూ ఆ మన్ను కొమ్ముని మొయ్యడం అతని స్థితికి మించిన పనయింది

అయినా దాన్ని వదల దల్చలేదు

ఓ గుడ్డలో చుట్టి తనతో పాటు తెచ్చాడు

ఏవిటది? అంటూ కుతూహలంగా అడిగారు పలానా అని తెలిసి నవ్వేశారు

ఇలాంటి కొమ్ములు నీక్కావాలంటే చెప్పు ఓ లారీడు పంపుతాను అన్నాడో ఫ్రెండ్ తమాషాగా

అయినా అదేదో ఏనుగు దంతమైనట్టు అంత భద్రంగా తీసికెళ్తే మీ క్లాబోయే మావగారు నిన్నో చవటకింద తీసుకుంటారు మీ కాంతి తాటాకులు కడుతుంది అంటూ ఆట పట్టించారు అతని దగ్గర బాగా చనువున్నవాళ్లు

అయినా ఎవరి మాటలూ పట్టించుకోలేదు అరవింద్ వాటిని చూసి జయదేవ్ కాంతీ కూడా మెచ్చుకుంటారని అతనికి బాగా తెలుసు అయితే గోల్కొండ కాయన్ సంగతి మాత్రం ఎవరికీ చెప్పలేదు

నాలుగు రోజుల తర్వాత ఇల్లు చేరిన అరవింద్‌ని ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి చేసేసింది కాంతి

వెళ్లిన పనయిందా అరవింద్? అడిగాడు జయదేవ్ అయిందన్నట్టుగా తలూపాడతను

ఆ చేతిలో ఏవిటి? గుడ్డలో చుట్టిన కొమ్ముకేసి చూస్తూ అంది కాంతి

చెప్పుకో చూద్దాం నవ్వుతూ అన్నాడు అరవింద్

ఆమె ఆలోచించింది కానీ అంతు దొరకలేదు

# మంజీరనాదం

ఏవిటరవింద్? జయదేవ్ కూడా కుతూహలంగా అడిగాడు

అపూర్వమైన వస్తువులు తెచ్చానుసార్ వుత్సాహంగా అన్నాడు అరవింద్

కుతూహలంగా చూశారు తండ్రీ కూతుళ్ళు

అరవింద్ కొమ్ముకి కట్టిన గుడ్డ విప్పి కొమ్ముని టేబిల్ మీదపెట్టాడు

"ఏవిఁటిది ఆశ్చర్యంగా చూసింది కాంతి

అడవి దున్నకొమ్ము అంటూ జరిగిందంతా విపులంగా చెప్పాడు అరవింద్

ఏదీ ఆ గోల్డ్ కాయన్? ఆతృతగా అడిగాడు జయదేవ్ అరవింద్ జేబులో ంచి నాణాన్ని తీసి అతని చేతిలో పెట్టాడు

ఆ బంగారు నాణాన్ని పరిశీలనగా చూస్తున్నాడు జయదేవ్ అతనికళ్ళు వింతగా మెరుస్తున్నాయి కాంతి కూడా తండ్రిచేతిలోని నాణాన్ని కుతూహలంగా చూస్తోంది

అరవింద్‌ని మరికొన్ని వివరాలు అడిగాడు జయదేవ్

అరవింద్ చెప్పాడు

జయదేవ్ మొహంలో రకరకాల బావాలు తొంగిచూస్తున్నాయి తండ్రీ కూతుళ్ళు బంగారు నాణాన్ని కుతూహలంగా చూస్తుంటే అరవింద్ మాత్రం దున్న కొమ్ముని చూస్తున్నాడు

ఇది దొరికిన ప్రాంతాల్లో మనకి ఇంకా చాలా విషయాలు దొరకచ్చు" హటాత్తుగా అన్నాడు జయదేవ్

అవును! నాకూ అదే అనిపించింది! ఉత్సాహంగా అన్నాడు అరవింద్

డేడీ! మనం అక్కడికోసారి వెళ్దాం డేడీ! మరింత ఉత్సాహంగా అంది కాంతి

ఎక్కడికి? వింతగా చూశాడు జయదేవ్

అదే" ఆ అడవిలోకి!

అదేమైనా బాంబేనో కల్‌కటానో అనుకుంటున్నావా? ఎంచక్కా ప్లేన్‌లో క్షణాల మీద వెళ్ళడానికి! అది బ్రహ్మాండమైన కీకారణ్యం! నవ్వుతూ అన్నాడు అరవింద్

కాకపోతే జీప్‌లో వెళ్దాం!

లాబం లేదు చెప్పానుగా అది మరీ కీకారణ్యం! ఒక్క కాలినడక తప్ప ఎలాంటి వాహనాల్లోనూ అక్కడికెళ్ళలేం! ఏదో ఆలోచిస్తూ అన్నాడు అరవింద్

పోనీ నీలాగే అక్కడిదాకా ట్రైన్‌లో వెళ్ళి ఆపైకాలినడక వెళ్దాం!

అదీ లాబం లేదు!

ఏం విసుగ్గా అంది కాంతి

అక్కడ ట్రైన్ ఆగదు!

మరి నువ్వెలా వెళ్ళావ్ చిరుకోపంగా అంది కాంతి

చెప్పానుగా ట్రైన్ ఇంజన్ రిపేర్ మూలంగా వెళ్ళ గలిగాను" అన్నప్పుడూ అంత అదృష్టం పట్టదుగా?

ఓ" అవునుగదూ మర్చిపోయాను పోనీ ఓ పన్చేస్తే? ఆశగా అంది కాంతి

చెప్పు!

సరిగ్గా ఆ బాను గుహ దగ్గరికి రాగానే చైన్ లాగేద్దాం! ట్రైన్ ఆగగానే దిగేద్దాం! ఇంక దీనికి తిరుగులేదు అన్నట్టు అంది కాంతి

ఐయిడియా బానే వుంది! కానీ మళ్ళీ వచ్చేటప్పుడెలా వస్తాం? నవ్వాడు అరవింద్

జయదేవ్ కూడా నవ్వాడు

నిజమే! అన్నట్టు నిరాశగా చూసింది కాంతి

రెండు నిమిషాలు ఎవరి ఆలోచనలో వారున్నారు

పోనీ ఇలా చేస్తే? హటాత్తుగా అన్నాడు జయదేవ్

ఏమిటి? కాంతి అరవింద్ ఇద్దరూ ఒకేసారి అడిగారు ఆదుర్దాగా

అరవింద్! స్టేషన్ నుంచి బానుగుహ సుమారు ఎంత దూరం వుంటుంది

దాదాపు ఇటు పదిహేను కిలో మీటర్ల దూరంలో, అటు తొంబయి కిలో మీటర్ల దూరంలో ఉండచ్చు! అన్నాడు అరవింద్

అయితే మన సరంజామాతో వెళ్ళి ఆ స్టేషన్‌లో దిగి అక్కణ్ణుంచి పదిహేను కిలో మీటర్లు నడుచుకుంటూ వెళ్తే?

బానే వుంటుంది అలా చేద్దామా? అన్నాడు అరవింద్

అవును! అలానే చేద్దాం! చాలా సరదాగా ఉంటుంది! ఉత్సాహంగా అంది కాంతి

కానీ తమరు రావడం లేదు! వ్యంగ్యంగా అన్నాడు అరవింద్

ఎందుకు రాను? కచ్చితంగా వస్తాను!

అంత దూరం నువ్వు నడవలేవమ్మా! అనునయంగా అన్నాడు జయదేవ్

ఎందుకు నడవలేను? మీకన్నా యాక్టివ్‌గా నడుస్తాను! నా స్వబావం గురించి మీకు తెలియనట్టు మాట్లాడతారేమిటి డేడీ! చిరుకోపంగా అంది కాంతి

ఇది నలుగురు ఫ్రెండ్స్‌ని తీసుకుని సెకండ్‌షో సినిమా చూసి రావడం కాదు! అడవి అడవిలో కెళ్ళడం! నేను రమ్మంటే పెద్ద పెద్ద మగాళ్ళే హడలిపోయారు అక్కడికి రావడానికి ఆఫ్ట్రాల్! ఆడపిల్లవి! నువ్వు

అతని మాట పూర్తికానేలేదు–

ఇదిగో అరవింద్! ఆఫ్ట్రాల్ గిఫ్ట్రాల్ అంటే బావుండదు! ఈ రోజుల్లో ఆడది సాదించలేందేం లేదు! ఆ సంగతి మీకూ తెలుసు! ఈ రోజులనే ఏమిటి ఏ రోజుల్లో అయినా స్త్రీ ఆదికురాలే! అంతెందుకు అంతటి శ్రీ కృష్ణ పరమాత్మ యుద్ధరంగంలో సోలిపోతే సత్యబామకాదూ అతన్ని కాపాడింది? సవాల్ చేసింది కాంతి

సరే! తల్లీ! నువ్వు సత్యబామవే! ఒప్పుకున్నాం కానీ

"కానీకాదు ఏంకాదు నేనూ మీతో పాటు ఒస్తున్నానంతే మొండిగా అంది కాంతి

అరవింద్ జయదేవ్‌కేసి చూశాడు ఆయన ఓ సారి చిన్నగా నవ్వేసి అదోలా తల పంకించాడు

కాంతి కళ్ళు తళుక్కుమన్నాయి చాటుగా అరవింద్‌ని ఎక్కిరించింది

అరవింద్ కూడా నవ్వేశాడు

అయితే అరవింద్! మన ట్రూపంతా బయల్దేరుదాం దానిక్కావలసిన ఏర్పాట్లు నువ్వు చూడు నేను పర్మిషన్ సంగతి చూస్తాను అన్నాడు జయదేవ్

అలాగే సర్! అన్నాడు అరవింద్

(ఇంకా ఉంది)

# నాభి

నిలువునా ప్రవహించే నీటిలో తప్ప
నిలకడగా ఉన్న జలంలో నిప్పు పుట్టదు–

కండగల పొలాల గుండెల్లో తప్ప
బండబారిన క్షేత్రాల్లో పంట లభించదు–

ఘనీభవించిన మేఘపు కారుణ్యంలో తప్ప
గాలికి లొంగిన మొయిల్లో వర్షం జనించదు–

మానవత్వం కుసుమించిన మనసులో తప్ప
దానవత్వపరాకాష్ఠలో దాతృత్వం హసించదు–

తాడనలో తపించే తనువుల్లో తప్ప
కలకలలాడే గుండెల్లో కసి వికసించదు–

చేతన కుసుమిస్తేనే చీకటి తొలగుతుంది
వేదన ప్రసవిస్తేనే వేకువ వెలుగుతుంది

– నాగభైరవ కోటేశ్వరరావు

ఉచితం



మీరు కొనుగోలుచేసే ప్రతి

**ఆక్సో** డ్రాయరుకు **ఆక్సో** బనియన్ ఉచితం!

రెండు **ఆక్సో** బనియన్లకు

ఒక **ఆక్సో** బనియన్ ఉచితం!!

OXO
BRIEFS & VESTS

CDC OA16

# అల్లుడుగారూ జిందాబాద్

**కోమకొండ సత్యానంద్**

నాన్నగారికి ఢిల్లీ నుండి ట్రాన్స్‌ఫరై వైజాగ్ వచ్చేసిన దగ్గర్నుండీ రాజమండ్రి వెళ్లామని అనుకుంటూనే వున్నా వెళ్ళడానికి యిప్పటికి గానీ కుదిరిందికాదు మా బాబాయ్ కూడా ఉత్తరం వ్రాశారు ఈ పండక్కి తప్పకుండా రమ్మనమని తీరా ప్రయాణం అయ్యాక పండుగ సందర్భంగా అటు ట్రైన్లు, ఇటు బస్సులు హెవీ రష్‌గా వుండడంవల్ల చాలా యిబ్బందయ్యింది

ఎలాగైతేనేం ఆర్టీసీ వాళ్ళు దయతో వేసిన రెండు స్పెషల్ బస్సుల్లో రెండవ బస్సు ఎక్కగలగడం అందులో విండోసైడు సీటు దొరకడం రెండూ జరిగాయి

మొత్తానికి సీటు దొరికిందిలేమ్మా ఈ బస్సు సరిగ్గా సాయంత్రం నాలుగు గంటలకు వెళ్తుందిట కాంప్లెక్సు నుండి రిక్షామీద వెళ్ళు అక్కడ బాబాయినీ, పిన్నినీ లక్ష్మిని అందర్నీ అడిగినట్లు చెప్పు బాబాయిని మందులు సరిగా వాడమన్నానని చెప్పు ఉత్తరం వ్రాసివుంటే బాబాయి కాంప్లెక్సుకు వచ్చేవాడు కాంప్లెక్సు నుండి రిక్షా 'ఎక్కి వెళ్ళమ్మా!' బస్సు కదిలేవరకూ నాన్నగారు ఏదో చెప్తూనే వున్నారు

బస్సు కదిలింది బస్సు నిండగా ఇంకా నలుగు రైదుగురు నిలబడి ఉన్నారు

బస్సు కాంప్లెక్సు నుండి ఎన్ హెచ్ ఫైవ్ మీదుగా బి హెచ్ పి వి, పాత గాజువాక స్టీలు ప్లాంటు దాటుకుంటూ వెళ్తుంది నా చిన్నప్పుడు నాన్నగారు వైజాగ్‌లో నే చేసేవారు అప్పుడు గాజువాక దాటితే మరింకేమి ఉండేది కాదు ఇప్పుడు గాజువాక తర్వాత చాలా ఏరియా ఆక్యుపై అయిపోయింది

బస్సు వెళ్తుంటే కిటికీలోంచి గాలి రివ్వున వీస్తుంది అలా విండోసైడు సీట్లో కూర్చున్నప్పుడు, అలా గాలి చల్లగా వీస్తున్నప్పుడు సాధారణంగా నేను ఏవో ఆలోచనల్లోకి వెళ్ళిపోతుంటాను

నా ఆలోచన లెప్పుడూ ఆడవాళ్ళ సమస్యల మీదే ఉంటాయి

అవునండి మరి ఈ సమాజం ఆడవారిని ప్రతి దశలోనూ మగవాళ్ళ మీద ఆధారపడేలాగే చేసింది మగతోడు అనివార్యమయ్యే పరిస్థితుల్ని సృష్టించి అది మగవాళ్ళ అహంకారానికి ఉనికి నిచ్చింది ఆడవాళ్ళకి అబలత్వాన్ని ఆపాదించింది

పైగా ఆడవాళ్ళకి సామాజిక పరంగా ఎన్ని సమస్యలండి? అన్ని సమస్యలకంటే అతి దారుణమైనది, హేయమైనది డౌరీ సిస్టమ్!

అంతటితో సరిపోయిందా? పెట్టు పోతల్తో అల్లుళ్ళ అలకలు తీర్చడం అత్త మామలకు అదో అగ్ని పరీక్ష! కావలిస్తే చూడండి ఈ పండుగలకి రైల్వే స్టేషన్లలో ఆర్టీసీ కాంప్లెక్సులో ఎంత మంది ప్రయాణీకు లుంటారో? ఆ ప్రయాణీకుల్లో నలభైశాతం భార్యల్తో కలసి మామగారింటికి వెళ్ళే అల్లుళ్ళే కదా? మరో పాతికా ముప్పైశాతం ఇంటికి వెళ్ళాక తండ్రి తన బర్తకి ఏం పెడతాడో ఏమిటో, తీరా పెట్టలేకపోతే ఏం కొంప మునుగుతుందో ఏమిటో అనే దిగులుతో గుండెల్ని నింపుకొని గుబులుగా నిలబడే ఆడపడుచులే కదా? (అఫ్‌కోర్స్! కొంత మందికి అలాంటి గుబులు ఉండక పోవచ్చు వాళ్ళు అదృష్టం చేసుకొని డబ్బున్న తల్లిదండ్రులకు పుట్టి ఉండొచ్చు ) మిగిలిన వాళ్ళు పిల్లా పీచూ ముసలీ ముతకా బిజినెస్‌మాన్లు తదితరులు ఉంటారనుకోండి అది వేరే విషయం!

అయినా మా ఆడవాళ్ళల్లో కూడా మార్పు రావాల్సింది కట్న కానుకలు అడిగినంత ఇస్తేనే సంబంధాన్ని ఖాయం చేసుకుందా మనుకొనే కాబోయే అత్తమామల్నే కాదు- తన సోదర్లకి కట్నం అడిగే తనని చూడ్డానికి వచ్చే కుర్రాళ్ళ తల్లిదండ్రుల్తో మిగతా విషయాలు మాట్లాడే తల్లిదండ్రుల్ని కూడా అపోజ్ చేసి ఆదర్శ వివాహాల్ని ప్రపోజ్ చేస్తూ స్త్రీ జాతి మనుగడకు ఊపిరి పోసే స్థితికి మా వాళ్ళు కూడా ఎదగాలి!

అలా నాలో నేను ఏవేవో అనుకుంటుండగా అనకాపల్లి కాంప్లెక్సులో బస్సు ఆగింది

ముందెళ్ళిన బస్సుల్లోనే అందరూ కిక్కిరిసి పోయి వెళ్ళినట్లున్నారు కాంప్లెక్సులో పెద్దగా జనం లేరు ఆ ఉన్న కొద్ది మందిలో బహు కొద్ది మందే మా బస్సు దగ్గరికి వచ్చేరు

మా బస్సులో వాళ్ళు కొంతమంది దిగగా, బస్సులో మరికొంతమంది ఎక్కగా–నెట్ రిజల్ట్‌గా నా ప్రక్క సీటు ఖాళీగా ఉండడం కూర్చోడానికి నిలబడి ఎవరూ లేకపోవడం జరిగింది

ఈ సీజన్లో ప్రతి బస్సూ కిక్కిరిసి వెళ్తుంటే ఈ బస్సులో నా ప్రక్క సీటు ఖాళీగా ఉండడంచూసి నాకు చాలా ఆశ్చర్యమేసింది

బస్సు మళ్ళీ బయలుదేరింది గానీ అనకాపల్లి కాంప్లెక్సు దాటాక వచ్చే ఫోర్‌రోడ్ జంక్షన్లో మళ్ళీ బస్సు ఆగింది ఎందుకు ఆగిందా అని ముందుకు చూసేంతలో కండక్టరు డోర్ తియ్యడం, బస్సులోకి ఓ యువకుడు రావడం, బస్సు కదలడం అన్నీ జరిగిపోయాయి

ఆ యువకుడు టికెట్ తీసుకుని వచ్చి ఒకసారి బస్సంతా పరికించి చూసాడు లేటెస్ట్ మోడల్ ఫ్రేమున్న కళ్ళజోడు పెట్టుకొని నేవీ బ్లూ ప్యాంటులోకి వైట్ ఫుల్‌హ్యాండ్స్ షర్టు యిన్‌చేసి ఒత్తైన తలతో చామన చాయతో చక్కగానే ఉన్నాడు ఆ యువకుడు ఎత్తు అయిదున్నర అడుగుల కంటె కాస్త ఎక్కువగానే ఉండొచ్చు

బస్సంతా పరికించిచూస్తున్న అతని దృష్టి నా ప్రక్కన ఖాళీగావున్న సీటుమీద పడింది ఆ తర్వాత నామీద పడింది నేనూ అతనివైపే చూస్తున్నాను

ఖాళీగా వున్న చోటు ప్రక్కన నేను ఉండడంతో అతని కళ్ళలో నిరాశ చోటుచేసుకుంది అతను మళ్ళీ బస్సంతా కలయజూశాడు బహుశా ఎక్కడైనా మరో ఆవిడ ఒక్కర్తే ఒకే సీట్లో కూర్చొనివుందేమో ఆవిడ్ని నా ప్రక్కనో లేక నన్ను ఆవిడప్రక్కనో కూర్చోమని చెప్పి తను చోటు సంపాదించుకోడానికేమో! కానీ అతనికి ఆ అవకాశం కలగలేదు ఎందుకంటే బస్సులో అలా ఒకే ఆవిడ లేక ఒకే చిన్న పిల్లాడు కూర్చున్న సీటుఏదీ అక్కడలేదు మరి!

నిరాశగా ముఖం త్రిప్పి అక్కడున్న స్టీల్ రాడ్‌కు జారబడబోతున్న అతను ఎక్స్‌క్యూజ్‌మీ అన్న మాట విని వెనుదిరిగి చూసాడు

ఇఫ్ యూ డోంట్‌మైండ్ ఇలా కూర్చోండి ఫర్వాలేదు అన్నాను నేను

అతను ఒక్కక్షణం నావైపుచూసి చేతిలో వున్న బ్రీఫ్‌కేసను పైనపెట్టి మెల్లిగా వచ్చి నా ప్రక్కన కూర్చున్నాడు అతను కూర్చున్నప్పుడు బస్సులో చాలా జతల మగకళ్ళు నా వైపు చూశాయి బహుశా ఆ ఛాన్స్(?) వాళ్ళకి దక్కితే బాగుణ్ణేమో!? (సారీ డియర్ జెంటిల్ మెన్!)

బస్సు శారద బ్రిడ్జి డిగ్రీ కాలేజీ దాటి వెళ్తుంది నేను నా ప్రక్కన కూర్చున్న యువకుడి గురించి ఆలోచించడం మొదలుపెట్టేను

ఈ యువకుడి వాలకం చూస్తుంటే పండుగ కానుకల్ని డిమాండ్ చేసి మరీ గుంజుకునేందుకు మావగారింటికి వెళ్తున్న అల్లుడిలా వున్నాడు మరి అతని భార్య? పండక్కి పదిహేను రోజుల ముందే వచ్చి కూతుర్ని తీసుకొని వెళ్ళుంటాడు ఆమె తండ్రి గురుడు ఇప్పుడు ధీమాగా పండగ టైముకి వెళ్తున్నట్లున్నాడు

అలా అతనిగురించి ఆలోచించిన తర్వాత అతనితో మాటలు కలిపి విషయాన్ని లాగాలని అన్పించింది అందుకే అతనితో మాటలు మొదలు

పెట్టేను

'మీరు రాజమండ్రి వరకూ వస్తున్నారా? ఈ బస్సు రాజమండ్రి వరకే వెళ్తుంది, అందుకే అతన్ని అలా అడిగాను అతను నావైపు చూసి

వెళ్తుంది రాజమండ్రి వరకేనండి కానీ ఇప్పుడు రాజానగరంలో దిగి రేపు ఉదయం వస్తాను అక్కడికి' అన్నాడు

'అది మీ నేటివ్ ప్లేసా?

"ఏది?

రాజమండ్రి

'కాదండి మా అత్తవారి ఊరు

అత్తవారి ఊరు అన్నప్పుడు అతని ముఖంలో, కంఠంలో ఏదో మార్పు, కళ్ళల్లో ఏదో వెలుగు కన్పించాయి నాకు నేననుకున్నట్టే గురువుగారు వెళ్తుంది అత్తగారింటికే నా ఊహ కరెక్టయి నందుకు నాకు చాలా ఆనందమేసింది

మీరేం చేస్తున్నారు?"

జి ఎల్ గా చేస్తున్నాను'

మీ పెళ్ళి ఎన్నేళ్ళయ్యింది?

ఆరేళ్ళు పెళ్ళి ఆరేళ్ళయినా క్రొత్త పెళ్ళికొడుకు లాగే కన్పిస్తున్నాడే అని మనసులో అనుకుంటూ 'పండక్కి వెళ్తున్నారుకదా, పండుగ కానుకలు బాగానే ముడతాయికదండీ మీకు? అన్నాను

మనసులోని అభిప్రాయం అనుకోకుండా నోటి ద్వారా వచ్చేసింది వెంటనే నాలిక్కొరుచుకున్నాను అతను నా కళ్ళల్లోకి చూసి, నేను నాలిక కరచుకోవడం గమనించి చిన్నగా నవ్వాడు

అఫెండ్ అవుతాడేమో అనుకున్నాను గానీ, అతను స్పోర్టివ్‌గానే తీసుకున్నాడు నేను సూటిగా ఎవర్ని ఎలాంటి విషయం అడిగినా అదేమిటో ఎవరూ ఏమీ అనుకోరు–పైగా చాలామంది నాతో నువ్వు మాట్లాడే విషయం కోపం తెప్పించేదే అయినా మాట్లాడే విధానం మాత్రం కోపం తెప్పించదు అని అన్న సందర్భాలు చాలా వున్నాయి ఇతని విషయంలో కూడా అదే జరిగివుంటుంది అనుకున్నాను

తుని దాటింది తునిలో కొందరు ఎక్కారు గానీ, ఆడవాళ్ళు ఎవ్వరూ ఎక్కకపోవడంవలన అతను నా ప్రక్కసీటు ఖాళీ చేయాల్సిన అవసరం కలగలేదు ఎక్కివుంటే లేచి వాళ్ళకు తన సీటు ఆఫర్ చేసేవాడిలాగే వున్నాడు

అతనితో కొంతసేపు మాట్లాడడం వలన క్రొత్తదనంపోయింది నాకు ఎవరితోనైనా చాలా తక్కువ సమయంలో మింగిల్ అయిపోగలను నేను పైగా అలా మింగిల్ అయిపోయాక ఏ విషయాన్నైనా సింపుల్‌గా మాట్లాడేయగలను అందుకేనేమో అతనితో అలా మాట్లాడగలుగుతున్నాను అన్నీ'

రాజమండ్రిలో మీ ఫాదరిన్లావాళ్ళు వుండేది ఎక్కడండి?

జాంపేట పిచ్చుక వీదిలోనండి

అతను చెప్పింది విన్న నా కళ్ళు మెరిశాయి ఎందుకంటే మా బాబాయ్‌వాళ్ళు వుండేది కూడా అక్కడే ఆ విషయం చెప్పాను అతనికి

మీ బాబాయ్‌గారు ఎవరండి? అని అడిగా డాయన చెప్పాను

' అయితే మా మావయ్యగారి ఇంటికి ఎదురుగా రెండిళ్ళవతలేనండి మీ బాబాయ్‌గారిల్లు

మా బాబాయ్‌గారితో మీకు పరిచయం వుందా?



ఆ కొద్దిగా వుంది అక్కడికి వెళ్ళినప్పుడు ఒకసారైనా కలుస్తుంటాను

మీ రొక్కరే వెళ్తున్నారు కదా మీ మిసెస్ అని అగాను అతడు ఏదో చెప్పబోయాడుగానీ అంతలో నేనే అనేసాను పదిహేను రోజులముందే మీ మామయ్యగారు వచ్చి తీసుకొనివెళ్ళివుంటారు అల్లుడికి దారిఖర్చులు దండగ అవుతాయని కదండీ? మీ మగవాళ్ళు భార్యతో నే ముందుగా వెళ్ళిపోతారు మావగార్లు రమ్మంటే వీలుంటే! కానీ వాళ్ళు రమ్మన్నా వెళ్ళరు ఆఫీసులో సెలవులు అయిపోతాయని మావగార్ల ఇళ్ళల్లో రాబోయే అకేషన్స్‌కివెళ్ళేందుకు సెలవులుండవని

అయినా ఇలా అంటున్నానని ఏమీ అనుకోకండి మీ మగవాళ్ళు ఇంత అహంకారం, అధిక్యత ఫీలవుతారు ఎందుకండీ? అసలు ఆడవాళ్ళు మీకంటే ఎందులో తక్కువ?" అని అడిగి ఝాన్సీ లక్ష్మీబాయి సరోజినీ నాయుడు, లేడీ నైటింగేల్, విజయలక్ష్మి పండిట్, ఇందిరాగాంధి, మదర్ థెరీసా టొబొటో సుజికీ, నందినీ శతపథి కుముద్‌బెన్ జోషి పి టి ఉష షైనీ అబ్రహాం వలసమ్మ తదితరుల పేర్లు రిఫరెన్సులు యిస్తూ ఆవేశంగా చాలా సేపు మాట్లాడేసేను

ఆ తర్వాత అనిపించింది అంతసేపు అనవసరంగా మాట్లాడేనేమోనని అతని ముఖంలో మారుతున్న రంగుల్ని కప్పిపుచ్చుకోడానికి అతను చేస్తున్న

## స్పర్శ

అనునిత్యం ఎన్ని పనులు
మరెన్నెన్ని ఆలోచనలు
విరామ మెక్కడనుకుంటున్నావా
నిజంగా నీ గురించిన చింతనకు?
పనిలో చేతులు కలిసిన ప్రతిసారి
నీకు అంజలిస్తాయి
మదిలో ప్రతి చేతనకు
నీ స్పర్శ వుంటుంది, ప్రభూ!

గోవిందరాజు రామకృష్ణరావు

## అల్లుడుగారూ జిందాబాద్

ప్రయత్నాల్ని గమనిస్తూ, చాలాసేపు ఇంకేమీ మాట్లాడలేదు నేను

మధ్యలో ఒకసారి అన్నాను ఏమైనా అనుకున్నారా? అని

దేనికి? మీరన్నదాంట్లో నిజం వుందికదా? అన్నాడు

నిజం వుందని తెలిసి కూడా మీరు అలా యింకా అనాలని ఏవో ఆలోచనలు వచ్చాయి గానీ బాగుండదేమో అనిపించి యింకేమీ అనకుండా మిన్నకుండిపోయాను

మరో పది నిముషాల్లో రాజానగరం వచ్చేస్తుంది

రాజానగరంలో ఎవరున్నారు?

"మా కజిన్స్ వున్నారు

రేపొస్తారా రాజమండ్రి?

అవునండి

కన్పిస్తారుకదూ!?

ఒకే వీధి, దగ్గర దగ్గర ఇళ్ళు కదండీ కన్పించకుండా ఉంటానా?

రాజానగరంలో అతను దిగిపోయాడు మరో నలభై నిముషాల్లో బస్సు రాజమండ్రి చేరుకుంది ఉత్తరం రాయకుండా వెళ్ళినందుకు బాబాయి కోప్పడ్డాడు ఉత్తరం రాసివస్తే నీకోసం వచ్చేవాడినిగా అని! ఆరోజు రాత్రి ఇంట్లో అందరం చాలాసేపు మాట్లాడుకుంటూ వుండిపోవడంతో నిద్రపోవడం చాలా లేటయ్యింది ఉదయం ఎనిమిదయ్యింది నేను లేచేసరికి మరో గంటయ్యింది స్నానపానాదులు అయ్యేసరికి బాబాయ్ కూతురు లక్ష్మితో మాట్లాడుతూ కూర్చున్నాను వరండాలో లక్ష్మిది కూడా నా వయస్సే! అది ఓ పావుగంట మాట్లాడి, తర్వాత వంటగదిలోకి వెళ్ళిపోయింది నేనో పత్రిక పట్టుకొని కూర్చున్నాను తొమ్మిదిన్నర ప్రాంతంలో ఏదో రిక్షా బెల్ శబ్దం విన్పించి అటువైపు చూసాను

రిక్షాలో ఆ యువకుడు నిన్న నాతోపాటూ అనకాపల్లి నుండి రాజానగరం వరకూ ప్రయాణం




చేసిన యువకుడు అనుమానంవచ్చి వరండాలోంచి బయటకు వచ్చి అతనా కాదా అని చూసాను

ఆ యువకుడే! రిక్షా దిగుతూ కన్పించాడు మరలా లోపలకు వచ్చి కూర్చున్నాను

నిన్న బస్సులో అతనితో మాట్లాడిన మాటలు గుర్తొచ్చాయి నాకు ముక్కు, మొహం తెలియని వ్యక్తితో అలా మాట్లాడేనేమిటి? మూడ్లో ఏదో మాట్లాడేయడం, ఆ తర్వాత ఎందుకలా మాటాడేనా అని అనుకోవడం నాకు అలవాటే! మరో పావు గంటకి బాబాయి బజారు నుండి వచ్చి సంచి వంటగదిలో పెట్టి వచ్చి నా దగ్గర కూర్చున్నారు

ఏం బాబాయ్ ఆఫీసుకి సెలవు పెట్టారా? అని అన్నాను

అవునమ్మా పండక్కి రెండు రోజులు సెలవులున్నాయి మాకు మరో రెండు రోజులు సెలవుపెట్టేను నేను ఈమధ్య ఒంట్లో అంతగా బాగుండటం లేదమ్మా! అన్నారు

అవును ఉత్తరంలో రాసారుగా బాబాయ్ నాన్నగారు చెప్పమన్నారు మందులు సరిగా వాడమని

బాగానే వాడుతున్నానమ్మా అయినా మొదట్నుంచీ నా శరీరం అంతేనమ్మా ఒకరోజు బాగుంటే నాల్రోజులు బాగుండదు ఈసారి మరీ నీరసంగా ఉందమ్మా పండగెళ్ళాక డాక్టరు దగ్గరకెళ్ళి చెప్పాలి

నేను మళ్ళీ ఏదో అనబోయేంతలో బాగున్నా రాండీ? అన్న పలకరింపు విన్పించి నేనూ, బాబాయ్ గుమ్మంవైపు చూసాం

నువ్వా బాబూ రా! నిన్ననే చెప్పారు రమణయ్యగారు ఈ రోజు మీరు వస్తారని ఉత్తరం రాసారటగా?

అవునండీ ముందే రావాల్సింది పనుండి ఆలస్యం అయ్యింది" అంటూ అతను కూర్చున్నాడు

కాఫీ పట్టుకురామ్మా! అని బాబాయ్ నాకు నేను వెళ్ళబోయేంతలో ఆగమ్మా! ఈయన మధుమూర్తి అని మన వీధిలో ఉన్న రమణయ్య గారి

బాబాయ్ చెప్తున్న మాట పూర్తి కాకుండానే నేనందుకుని తెలుసు బాబాయ్ నిన్న ఈయన నేను ఒకే బస్సులో ప్రయాణం చేసాం ఈయన రాజానగరంలో దిగిపోయారు అని చెప్పి అతని వైపు పలకరింపుగా చూసాను .

అతను కూడా పలకరింపుగా నవ్వాడు బాబాయ్ అలాగా అని అతనితో నా గురించి ఏదో చెప్పడం మొదలు పెట్టడంతో నేను కాఫీకని లోపలికి వెళ్ళిపోయాను

పెన్ని చేసిన కాఫీ తీసుకొని వెళ్ళి అతనికిచ్చి కూర్చున్నాను . కాఫీ త్రాగుతుండగా బాబాయి అతని ఉద్యోగం గురించి, ఇంటి విషయాల గురించి అడిగి– నా గురించి, మా నాన్నగారి గురించి చెప్పారు అతనికి మా బాబాయికి నేనన్నా నాన్నగారన్నా ఎంతో అభిమానం అతనికి తెలిసిన ప్రతి ఒక్కరికీ మా గురించి అన్నీ పదే పదే చెప్తుంటారు కొంతసేపు కూర్చొని వెళ్ళొస్తానని చెప్పి అతను లేచాడు బాబాయి, నేను కూడా లేచాం

ఆయన నాక్కూడా చెప్పి బయటకు వెళ్ళాడు బాబాయి అతనితో పాటూ బయటికి వెళ్ళేరు నేను కుర్చీలో కూలబడి పత్రిక నందుకున్నాను

బాబాయి అతనితో అంటున్నారు ఎప్పుడు బాబూ వెళ్ళడం?" అని

వరండాలో కూర్చున్న నాకు వాళ్ళ మాటలు స్పష్టంగానే వినిపిస్తున్నాయి

మధ్యాహ్నం సింహాద్రికంది అని, మళ్ళీ బాబాయికి చెప్పి వెళ్ళిపోయాడు అతను

బాబాయి లోపలకు రాగానే అదేంటి బాబాయ్, పండక్కి అత్తవారింటికి వచ్చినతను మధ్యాహ్నమే వెళ్ళిపోవడం ఏమిటి? అని అడిగాను

బాబాయి నా ఎదురుగా కూర్చుంటూ అరె నీకు తెలీదు కదమ్మా, ఆ అబ్బాయి ఉండగానే చెప్పాల్సిందే మరిచేపోయాను అన్నారు

ఏంటి బాబాయ్? అని అడుగుతూ నేను ముందుకి వంగాను కుతూహలంగా

బాబాయి చెప్పడం మొదలు పెట్టారు

మధుమూర్తి అందరిలాంటి అల్లుడు కాదమ్మా! రమణయ్య గారికి నలుగురు కొడుకులు ఒకే ఒక్క కూతురు కొడుకుల్ని బాగానే చదివించారు ఉద్యోగరీత్యా దూరం అయిన కొడుకులు బాధ్యతల్ని పంచుకోలేం అని ఖచ్చితంగా చెప్పేసి వెళ్ళిపోయి శాశ్వతంగా దూరం అయిపోయారు రమణయ్య గారు రిటైరయ్యాక వచ్చిన డబ్బు ఉన్న అప్పుకి సరిపోయింది పెళ్ళి కెదిగిన కూతురు మాత్రం మిగిలి పోయింది ఉన్న ఇల్లు అమ్మేసైనా కూతురి పెళ్ళి చేసేద్దాం అనుకున్నంతలో, పెళ్ళి చూపులు జరుగుతున్నప్పుడే కొడుకు లొచ్చి గొడవ చేసారు ఇల్లు చెల్లెలు పెళ్ళికి అమ్మేస్తే మేం ఏమైపోతామని! పెళ్ళి చూపులకు వచ్చిన ఈ మధుమూర్తి వాళ్ళను వారించి, వాళ్ళ అనంతరం ఈ ఇల్లు మీరే తీసుకుందురు గాని అని చెప్పి ఆ అమ్మాయిని కాణీ కట్నం లేకుండా చేసుకున్నాడు అత్తమామల్ని తనతో వచ్చేయమని అన్నాడు ప్రాణం ఉన్నంత వరకూ ఈ ఇంటిలోనే ఉంటాం అనడంతో ఊరుకున్నాడు గానీ మధుమూర్తి రమణయ్య గారిని అతని భార్యని తన దగ్గరే ఉంచుకొనేవాడు ఇంటిలో ఓ రెండు గదుల్ని అద్దెకివ్వగా, రమణయ్య గారు ప్రైవేట్లు చెప్పగా వచ్చిందాంతో గుట్టుగా కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నారు ముసలి వాళ్ళు "

బాబాయి చెప్తున్న దాన్ని ఆసక్తిగా వింటున్నాను నేను

' పండక్కి కూడా బిక్కు బిక్కుమంటూ మీరిద్దరే ఉండడం ఎందుకని ప్రతి పండక్కి వచ్చి అత్తమామల్ని తీసుకు వెళ్ళి ఓ పది రోజులు ఉంచుకొని మళ్ళీ తీసుకొచ్చేస్తుంటాడు ప్రతీసారీ అతడు ముందే వచ్చి "

బాబాయి ఇంకా ఏదో చెప్తూనే ఉన్నారు అతని గురించి బస్సులో నా ప్రక్కన నేనంటున్న మాటల్ని వింటూ కూర్చున్న అతని రూపమే నా కళ్ళల్లో మెదులు తుండడంతో అవేమి నాకు విన్పించ లేదు! □

## గాలిలో నడిచే కారు

కాలిఫోర్నియాకు చెందిన మాల్టన్ బిటేలర్ అనే వో రిటైర్డ్ నేవీ కమాండర్‌గారు వో కారును రూపొందించార ఆ కారు నేలమీద గంటకు వంద కిలో మీటర్ల వేగంతో పోతుందట అసలు ఆశ్చర్య మేమిటంటే ఆయన ఆ కారుకు రెక్కలు అమర్చి కొన్ని మార్పులు గబ గబ చేసి దానిని విమానంలా గాలిలో ఎగిరేలా చేసి గంటకు రెండు వందల కిలో మీటర్ల వేగంతో పయనించేవాడట బళా యీ కారు నడిచే ఎగిరే విధానం స్థిరపరచి అలాంటి కార్లిక తయారు చేస్తే పోలా ట్రాఫిక్ ఇన్ ది స్కై!

## మేష్టారిని కొట్టిన విద్యార్థిని!

షోలాపూర్‌కు చెందిన సునిత అనే వో అమ్మడు పరీక్ష హాలులో ఎంచక్కా కాపీ కొడుతుంటే హాల్లో గస్తీ తిరుగుతూన్న మేష్టారు రవీమని ఆమెను పట్టుకుని బయటకు పంపేశాడట దీనితో కోపం వచ్చిన ఆ అమ్మడు దారికాచి, ఆయన్ని పట్టుకుని వీర బాదుడు బాదిందిట ఈ బాదుడులో ఆమెకు అమె సఖులు సహాయం చేశారట వారి కార్యక్రమం పూర్తి అయ్యాక ఆ పంతులుగారు వెళ్ళి పోలీసు రిపోర్టిచ్చారట

## నలుగురు భర్తల నారీమణి!

కేరళ మల్లపూజ అనే గ్రామానికి చెందిన గాయత్రి నంబియార్ అనే ఒక టీచరు తన జీవితం ఎవరితో పంచుకోవాలి అనే విషయం మీద వో నలుగుర్ని విడి విడిగా పరిశీలించిందట ఈ పనిలో ఆమె ఆంటోని అనే అతన్ని ప్రేమించిందట ఇబ్రహీం అనే అతని మగతనానికి శరీర సౌష్టవానికి ముగ్ధురాలయిందట గుణశేఖర్‌పిళ్ళై అనే అతని




తెలివితేటలకు అరుణ్‌చాకో అనే అతని వాక్చాతుర్యానికీ లొంగిపోయిందట ఆనక తీరుబడిగా ఆలోచించి ఆ నలుగుర్లో ఎవ్వర్నీ వొదులుకోలేక ఆ నలుగుర్నీ వొప్పించి మొన్న జులై



3వ తేదీన ఆ నలుగుర్నీ వొకే మండపంలో వివాహం చేసుకున్నది ఒకడు తక్కువ ద్రౌపదీ!

## మామను చంపిన కోడలపిల్ల

పశ్చిమబెంగాల్ బర్నిపూరు గ్రామానికి చెందిన 70 ఏళ్ల ఘురుఘోష్ అనే ఆయన బుట్ట క్రిందవున్న కోళ్లను కాస్సేపు బయటకు వదలమని కోడలుపిల్ల విభాఘోష్‌ని ఆజ్ఞాపిస్తే కోళ్లను బయటకొదిలితే వాటిని మళ్ళీ కుక్క కుక్క కుక్క కు కుక్క అంటూ పట్టుకోడం కష్టం పొమ్మందట ఆవిడ ఈ విషయం చిలికి చిలికి పెద్దదయిందట కోపోద్రేకంతో కోడలుపిల్ల ఎగిరి మామగార్నో తాపు తన్నిందట ఆ తాపు నేరుగా దొక్కలో తగిలేసరికి చెట్టంత ఘోష్‌గారు విరుచుకుపడి చనిపోయారట

## ప్రపంచ సినీ చరిత్రలో నగ్న నాయికానాయకులు!

ప్రపంచ సినీ చరిత్రలో ఆందీగెల్లర్ అనే వో తారామణి ప్రప్రథమంగా వెండితెరపై నగ్నంగా నటించి ప్రేక్షకులకు ఆశ్చర్యానందాలు కలిగించిందట కారిన్స్ నోవిల్ అనే లండన్ తార 564 సీనులలో నగ్నంగా నటించి తనకంటూ వో స్థానం సంపాదించుకుందట బ్రెగ్‌డెన్ సార్క్ అనే జర్మను నటుడు నగ్నంగా ఓ సినిమాలో నటించి పురుషులలో నగ్నంగా నటించిన తొలి నటుడుగా పేరు తెచ్చుకున్నాడట హాట్ వేవ్ అనే సినిమాలో నాయికీ నాయకులిద్దరూ దాదాపు చిత్రమంతా నగ్నంగానే నటించి, ఆ రకం కోర్కెలున్న వారికి మార్గదర్శకులయ్యారట

## లక్ష ముద్దుల నోము!

అమెరికాకు చెందిన వాల్టర్ టిరెన్స్ అనే వో మన్మదరావు ఎలాగయినా తన పేరు గిన్నెస్ బుక్‌లోకి ఎక్కాలని నిర్ణయించుకుని ఎవరూ చేయని వో పనిని ఎంచుకున్నాడట ఈ పథకం ప్రకారం అతను సాక్ష్యాదారాల కోసం కొంతమందిని తనతో తీసుకుని రోడ్డున పోయే అపరిచిత అమ్మాయిలను చుపుక్కునో ముద్దు పెట్టుకోనారంభించి, ఈ వ్రతాన్ని చక్కా పూర్తిచేసి తాను లక్షమంది ముక్కూ మొహం తెలియని అమ్మాయిలను ముద్దు పెట్టుకున్నట్టు ప్రకటించాడట ఈ కార్యక్రమంలో అతగాడు 300 చెంప దెబ్బలు 900 చెప్పు దెబ్బలు, 6000 జుట్టుపీకి కొట్టడాలు అన్నీ భరించి 416 సార్లు అరెస్టయి జైలుపాలయి ఇన్నీ భరించి చివరికి ఈ నోమును పూర్తిచేసి, గిన్నెస్ బుక్‌కు ఋబురెట్టాడట - వోరి వీడి దుంపతెగా!

## కొత్త రకం లెన్సులు!

బెర్లిన్‌లో జేన్స్ అనే వో కంపెనీవారు ధనార్జనకో పథకం వేసి తాము వో కొత్త రకం లెన్సు కనిపెట్టామని వాటితో ఎవర్నయినా పోటోలు తీస్తే ఆ పోటోలో వారు నగ్నంగా పడతారనీ ప్రకటనలిస్తే జనం విరగబడి ఆ లెన్సులు తమక్కావాలంటే తమకు కావాలని డబ్బులు గుప్పించారట ఆ డబ్బంతా పోగు చేసుకున్న ఆ కంపెనీ వారు పంపిన చిన్న పాకెట్లు విప్పి చూస్తే ఖాళీగా వుందట లోపల - ఆహా!

## అనారోగ్యం అంటే తెలీని స్త్రీ

స్కాట్లండ్ బామెరినోకు చెందిన కేథరిన్ నీల్ అనే ఆమె 101 సంవత్సరాలు బ్రతికిందట జీవిత కాలంలో ఆమె ఎన్నడూ జ్వరున చీదనే లేదట డాక్టరంటే ఆమెకు తెలీదట

## చావు తెచ్చిన సన్నని మెడ

బ్రిటన్ స్టాన్‌మోర్ నగరానికి చెందిన 58 సంవత్సరాల థామస్ కార్లెట్ భోజనానికని కూర్చుని బల్లమీద పదార్థాలూ దినపత్రిక రివాజుగా వుండే స్థలాలలో గాక స్థానాలు మారి వుండడం చూసి కోపంతో వూగిసలాడిపోతూ ఆ పని చేసిన తన అర్థాంగి పీక నొక్కేశాడట ఆవేశంలో వూపు కొంచెం ఎక్కువ అయినందువల్ల ఆమె చనిపోయిందట ఈ




విషయాన్ని కోర్టులో వాదించుకుంటూ భార్య అవిధేయత తనను రెచ్చగొట్టిందనీ ఆమె సన్నని మెడే ఆమెకు చావు తెచ్చిందనీ తన తప్పేమీ లేదని విన్నవించాడట - వోరి నీ కడుపుడకా! □

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## మహిళా పాఠకులకి మరో కొత్త శీర్షిక!

# ఈకాలం పెళ్లిళ్లు




మన సంస్కృతిలో వివాహానికి అత్యంత ప్రాముఖ్యం, ఎంతో పవిత్రత ఉన్నాయి. ప్రతి వ్యక్తి జీవితంలో పెళ్లి అన్నది అతి ముఖ్యమైన మలుపు. స్త్రీ పురుషుల జీవితాలలో అది ఒక మధురమైన దివ్యానుభూతి, నూరేళ్ల పంటగా నిలిచే పవిత్ర బంధం.

మారుతున్న నేటి సమాజంలో పెళ్లిళ్లు ఎలా జరుగుతున్నాయి? వివాహాల విషయంలో ఎలాంటి సమస్యలు ఎదురవుతున్నాయి? మొదలైన విషయాలని చర్చిస్తూ ఈ కింద పేర్కొన్న అంశాలపై లేదా వాటిలో కొన్నిటిని గురించి కానీ వ్యాసాలు రాసి పంపవచ్చును.

1. మారుతున్న సామాజిక పరిస్థితులు
2. విడాకులు పునర్ వివాహాలు
3. భార్యల సంపాదనలు ఉద్యోగాలు
4. కట్నం
5. సమిష్టి కుటుంబం
6. వివాహంలో వ్యభిచారం సెక్స్
7. కులాంతర వివాహాలు
8. వివిధ కులాలలో వివాహ వ్యవస్థ
9. మతాంతర వివాహాలు
10. ఇంకా రాబోయే మార్పులు
11. సినిమాల పత్రికల ప్రభావం
12. భర్తలని హింసించే భార్యలు

### నిబంధనలు :

- ★ రచనలు ఆలోచనలని రేకెత్తించేట్లుగా ఉండాలి.
- ★ ఆడవారి రచనలకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది
- ★ రచనతో పాటు రాసినవారి ఫొటో పంపవచ్చు
- ★ రచనలు కాగితానికి ఒక వైపే సిరా లేదా బాల్‌పెన్‌తో రాయాలి
- ★ వ్యాసాలు రెండు అర తావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది
- ★ వ్రాత ప్రతి మీద వ్యాసం రాసిన వారి పేరు పూర్తి చిరునామా ఉండాలి
- ★ ప్రతి రచనతో ఈ పేజీలో ఇచ్చిన కూపన్ జతపరచి పంపాలి కూపన్ జత పరచకుండా పంపిన వ్యాసాలు పరిశీలింపబడవు
- ★ ప్రచురించిన ప్రతి రచనకీ రు 50/- పారితోషికం ఇస్తాము
- ★ ప్రచురణకి స్వీకరించని వ్యాసాలని ఫొటోలని తిప్పి పంపగోరేవారు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరచి పంపాలి వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు
- ★ ప్రచురణకి స్వీకరించిన రచనల విషయం ఆయా రచయిత్రులకి తెలియ చేయటం జరుగుతుంది
- ★ పరిశీలనకి పంపే వ్యాసాలని 'ఈ కాలం పెళ్లిళ్లు శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం విజయవాడ-520 003 అనే చిరునామాకి పంపాలి

–సంపాదకుడు

---

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## ఈ కాలం పెళ్లిళ్లు

పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్ కోడ్

## నిత్య నూతన సీరియల్

## కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

# వేయిపడగలు

అరుండతీ దర్మారావులు ప్రొద్దెక్కి గాని లేవరు సావిత్రమ్మగారు తెల్లవారక ముందే నిద్ర మేల్కొనును దంపతులకు గదిలో గడియ వేసికొను అలవాటు లేదు ప్రతి దినము వారిద్దరు ఒకరి కౌగిళ్ళలో ఒకరుండగానే ఆమె గదిలోనికి పోయి గది ఊడ్చి తనకు గదిలో ఏమైన కావలసి ఉన్నచో తెచ్చుకొనును

ఆ నాడు గది ఊడ్చుచుండగా ఆమె కంటికి మెరసి ఆమె మొదట పామేమో అనుకొని ఆగి, నెమ్మదిగా చూచి చంద్రహారమని గ్రహించి ఇదేమో! ఇటు పారవేసిరి అని తీసి మరల కోడలి మెడలో అమర్చి తన పని తాను చూచుకొన పోయెను నెమ్మదిగా తెల్లవారి వెలుతురు గదిలోనికి వచ్చెను దర్మారావు కనులు తెరచి చూచెను అరుందతి మెడలో చంద్రహారము మెరయు చుండెను తనను నిద్రపోనిచ్చి మరల ఆమె ఆ నగ తెచ్చి దరించినది దనవాంచ ఎంత చెడ్డది! నిద్రలో అది తనకు తగిలెనేమో! దర్మారావు ప్రక్క మీద నుండి లేచిపోయెను అరుందతికి మెలకువ వచ్చెను తన

(గత సంచిక తరువాయి)

మెడలో ఏమో బరువుగా ఉండెను ఏమిటా అని చూచుకొన్నది మెడలో హార మున్నది తన పతి తెచ్చి ఆ హారము తన మెడలో వేసెను కాబోలు! ఆ హారమును ఏల ముట్టుకొనెను? ఏమో! తన మెడ బోసిగా ఉన్నదని వేసి ఉండ వచ్చును ఆమె లేచి పని చూచుకొన పోయెను

దర్మారావునకు బార్యమీద కోపము వచ్చెను ఇంటిలో ఉన్న ఆమెతో మాటలాడ వలసి వచ్చునని ఆ రోజంతయు ఆ స్నేహితుని యింట ఆ స్నేహితుని యింట గడిపెను బోజనమునకు మాత్రము వచ్చెను ఆ మెతుకులే తినెను ఇంటనున్న రెండు గడియలు అరుందతిని పల్కరించ లేదు ఆమె తాను గదిలో ఉండగా తాకినంత దగ్గరగా వచ్చెను తాను దూరముగా పోయెను బోజనము చేసి తన దారిని తాను పోయిన బర్త ఏదో పని చూచుకొన పోయెనను కొనెను గాని తన్ను పరిహరించుటకు వెళ్ళినాడని అనుకొనలేదు రోజు గడచెను దర్మారావునకు సుబ్బన్నపేట పోయిరావలెనని బుద్ధి పుట్టెను పోవుటకు రెండు రూపాయలు కావలయును ఎవరిచ్చెదరు? కొందరిని అడిగి లేదనిపించు కొనెను కొందరను జూచి అడుగుటకు మొఖము చెల్లక మానివేసెను ప్రొద్దుక్రుంకువఱకు అడిగినను అడగకున్నను మిగిలిన దొక్కడు అతనిని అడుగుటా? అడగకుండుటా? అని పట్టినది అడిగినచో అతని దగ్గర ఉన్నచో తప్పకుండ ఇచ్చును అడుగుట నీచమేమో? తన స్థితికి అతనిని అడుగ రాదేమో? నీచత ఎచ్చట?గుణహీను లయిన దనవంతులకన్న గుణవంతులయిన పేదవారే అదికులు వారే గౌరవనీయులు దర్మారా వతనితో ఎప్పుడును మాటాడనైన లేదు అతడే దర్మారావునకు రెండు మూడు సార్లు నమస్కరించెను! దర్మారా వన్నచో అతనికి చాల గౌరవము ఇంకొక మార్గము లేదు దర్మారావు చివర కతనిని అడుగుటకే నిశ్చయపరచెను దర్మారావు అతని కొట్టుదాక రెండు మారులు పోయి మరల వెనుదిరిగి వచ్చెను చీ! అతనిని అడుగుట ఏమి అసమానుని వద్ద తనకీ

ధైన్య మెందుకు? - దర్మారావు మరల పోయెను నాయరు తన దుకాణము మీద కూర్చుండెను దర్మారావును చూచి అతడు మందహాసము చేసెను దర్మారా వెప్పుడును తన దుకాణము దగ్గరకు రాడు ఏల వచ్చెనో!?

నాయరునకు ముప్పదియైదేం డ్లుండును అతడు మలయాళి అతనిది గుంటూరులో తమలపాకుల కిల్లీల దుకాణము సోడాలు కూడ అమ్ము చుండును నాయరు మొగమెప్పుడును మందహాస సుందరము ఎప్పుడును ప్రసన్న తారోచిస్సులే అతని మొగమున తాండవించును.

అతని కన్నులు నవ్వుచునే ఉండును అతడు విచార ముఖముతో ఉన్నప్పుడు అతనిని ఎవ్వరును చూడనేలేదు

నాయరు ప్రతి దినము ప్రొద్దుననే లేచును హరినామ స్మరణ చేయును తరువాత స్నానము చేసి విభూతి దాల్చి కాఫీ హోటలునకు పోయి ఒక గిన్నెడు కాఫీ త్రావి తన దుకాణము వద్దకు వచ్చును ప్రతి దిన మొక వృద్ధ బ్రాహ్మణుడు ఎనిమిది గంటలకు అతని దుకాణమునకు వచ్చును ఆయన చేతిలో ఒక కాని యిచ్చికాని అమ్మకము చేయడు పన్నెండు గంటలకు ఊరి చివర ఉన్న తన అద్దె యింటికి పోయి వండుకొని తిని కొంత విశ్రమించి మరల దుకాణమునకు వచ్చును

అతని దుకాణమందే విద్యార్థు లందరు తమలపాకుల కిల్లీలు సోడాలు కొందరు అతని వద్ద కాతా పుస్తక మున్నది ఎవడు కొనునో వాడే అందులో వ్రాసికొనును అత డొకప్పుడు గాని "యీ పద్దు వ్రాయుడు, ఇది మరచిపోయినారు అనడు చాల మంది విద్యార్థులు పద్దులు వ్రాయరు, డబ్బెగ గొట్టుదురు కూడాను- అత డెవరిని ఏమియు అనడు కొందరు డబ్బు తెచ్చి యిత్తురు అతడు పుచ్చుకొనును కొందరు పది రూపాయల దాక అప్పు చేసి, తరువాత అతని దుకాణము వద్దకే రారు అది వారి బయమే కాని అతడు వారిని డబ్బడగడు

ఇదికాక విద్యార్థు లతని వద్ద చేబదుళ్ళు తీసికొనుటయు ఇచ్చుటయు కూడ కలదు

# వేయిపడగలు

ఎవరయిన అతనిని ఏమోయి! ఇట్లంచ రు డబ్బెగ బెట్టినచో నీ కెట్లు సాగును? అని అడిగినచో నా దొక పొట్ట నాకు నెలకు అయిదు రూపాయలు చాలునండి ప్రొద్దున ఇంత అన్నము తిందును రాత్రి కొక గోదుమ రొట్టె ప్రొద్దున ఒక గిన్నెడు కాపీ నాకు చాలదా? అనును చాలమంది అతనిని పిచ్చి ముండ కొడుకను కొందరు మరి కొందరు సత్పురుషుడు అనుకొందురు

ఒకసారి ఒక కవి అతనికి ఇరువది రూపాయలదాక ఈవలసి వచ్చెను అతడు సగము డబ్బు సిగరెట్లకే యీయవలయును ఇంతలో అతడు మతాంతర వివాహము చేసికొనెను కులముచే బ్రాహ్మణుడు అతని బార్య ఆదునికురాలు అతని జీతము తినుటకు చాలలేదు సరికదా అతని ప్రాణములు కూడ చాల లేదు నాయరును ఎవరో అడిగిరి ఏమయ్యా! ఆయన డబ్బిచ్చెనా? అని నాయరు బాబు! ఆయనయే పేదవాడు ఆ వచ్చిన బార్య అతనిని తినివేయు చున్నది పాప మాయన ఏమి యిచ్చును లెండి! ఆయన కొక కొడుకు పుట్టిన నాడు డబ్బిచ్చినంత సంతోషించెదను అని అనెను

నాయఘు ప్రతి దినము సాయంకాల మయినంతనే ఆంజనేయ స్వామి గుడికి పోవును ఈలోపుగా దుకాణము మీద ఎవరుపడిన వారే కూర్చుందురు కూర్చున్న వాని నిజాయితీ మీదనే దుకాణము సాగును అతడు వచ్చి అచట కూర్చున్న వానిని అజపజ అడగడు ఇట్లయినచో బేర మెట్లు సాగును? అని నీ వనుము! ఎవరి పాపము వారిది నాకేమి? నేను యితరుల సొమ్ము తినుట లేదుకదా? నాకు పాపము లేదు అనును చిల్లర ఎచ్చటను దొరకదు నాయరు దుకాణము మీద తప్పకుండ దొరకును క్రొత్త ఊరి వారు వత్తురు ఏదో కొందురు వారి వద్ద చిల్లర ఉండదు నాయరు వద్దను దొరకదు నాయరు స్వామీ! వద్దులెండి! ఆ డబ్బు నాకు ప్రాప్తి లేదు పొండి అని నమస్కరించును వారాశ్చర్యపోయి మార్చి వారే యిత్తురు వారు నాయరూ నీకు నేనెంత యీయవలయును? అందురు నాకు జ్ఞాపకము లేదు బాబూ మీదయ వచ్చినంత యిండు వారు సరిగా ఈయవలసినంత యిత్తురు వారు కొంత తగ్గించి యిత్తురు వారు మరికొంత ఎక్కువ యిత్తురు వారిలో ఎవరెవ రెవరో బగవంతునకే తెలియును

నాయరు రాత్రి పది అయిన తరువాత దుకాణ ముంచడు అతని యింటికి పోవును కొంద రతనిని యోగాబ్యాసి అందురు కొందరు రాత్రి రెండు గంటల వరక ఏదో జపము చెసికొనును అందురు నిజ మెవరికి తెలియదు మనిసి మాత్రము వస్త్రాడుపలె ఉండును అతనికి పడిసెము పట్టినది కూడ ఎవరును ఎరుగరు

ఎవరైన నాయరూ ! పెండ్లి చేసికొన రాదా? అంచురు అతడు అమ్మో నాకు బయమండి సంసారం సాగరం దు ఖం తస్మాత్ జాగ్రత జాగ్రత అన్నారు హాయిగా బ్రతుకు చున్నాను నాకా గోల ఎందుకు స్వామి? అప్పటి నుంచి దురాశ పుట్టును దొంగవేషా లెక్కువగును ఇప్పుడు రూపాయకు పావలా లాబము చాలును అప్పుడు రూపాయకు రూపాయ లాబము కావలెనండీ అనును

నాయరు బీడీ కాల్చడు సోడా తాగడు తమలపాకులు వేయడు ఎంత చలి వేసినను చొక్కా తొడగడు

ప్రతి దినము రాత్రి ఎనిమిది గంటలకు అతని దుకాణము వద్దకు ఇద్దరు ముసలివాండ్రు వత్తురు వారు గొల్లవా దొకడు కాపొకడు గొల్లతడు వయసులో పోలీసు పని చేసెను అతనికి పది రూపాయలు పించను వచ్చును కాపునకు పని లేదు అతని అన్నగారు రంగము (రంగూన్)లో ఏదో రెండు వందల జీతము తెచ్చెడివాడట అత డితనికి నెలకు పది రూపాయలు పంపించెడి వాడు అట్లతని జీవితములో ఇరువది ఏండ్లు జరిగెను ఆ అన్న చనిపోయి యీ కాపు బ్రతుకు బయట బడెను ఇప్పు డెట్లు బ్రతుకు చున్నాడో ఎవరికినితెలియదు

ఈ యిద్దరు వచ్చి నాయరుతో వేదాంతము వేయుదురు నాయ రిద్దరికీ చుట్ట లిచ్చును వారు కాల్చుచు వేదాంతము మాట్లాడుదురు అయిపోయిన తరువాత వారిద్దరికి చెరి ఒక సోడా ఇచ్చును వారు పుక్కిలించి ఉమిసి మిగిలినది త్రావుదురు త్రాగిన తరువాత సోడా పుల్లగా ఉన్నదయ్యా! అని ఒకడు, ఇవ్వేళ నిన్నటి వలె లేదు అని ఒకడు నాయరు ఔదార్యమును వారి మార్గములో వారు బూషింతురు తరువాత వక్కపొడి యింత నమలుదురు ఇంతలో వేదాంతము చివరకు వచ్చును ఇద్దరును రాంరాం చెప్పి వెడలి పోదురు

ఎవరో ఒకరు నాయరుతో వారిని గూర్చి వెక్కిరింతురు నాయరు అయ్యా! అట్లు మన మనరాదు ఎవరిలో ఏమున్నదో! త్యాగరాజు గారు ఏమన్నారు? ఎందరో మహానుబావు లందరికిని వందనము లని అనలేదా? అనును

నాయరు తెలుగు దేశములో పది పదునేనేండ్ల నుండి ఉన్నను అతడు తెలుగు అదొక యాసగా మాట్లాడును ఒత్తులు గల చోట తేల్చియు చ లు స లు గాను దీర్ఘములు కొన్ని హ్రస్వములు గాను పలుకును అందరును అతని పలుకుబడికి నవ్వుదురు అట్లయ్యు అతడు మాటాడు చుండగా అందఱి కాకర్షకముగా ఉండును ఆ ఆకర్షణ శక్తి అతని వ్యక్తి యందున్నది గాని మాటాడుటలో లేదని కొందరు

ఎవరైన చనిపోయి వాహకులు లేనిచో నాయరు సిద్ధము అట్లు మోసిన నాడెల్ల నాయరు ఉపవాస ముండి రాత్రి నక్షత్ర దర్శన మైన తరువాత బోజనము చేయును నీ కెందుకు వచ్చినది నాయరూ! వారి తిప్పలు వారు పడరా అనుము! తప్పు తప్పు అయ్యా! అట్లు మోయుట చాల పుణ్యము మనము ఎప్పుడో చచ్చెడిదే నే నున్నాను చూడు బాబూ! రేపు చచ్చి పోయెదను నీవంటి బాబు నివంటి బాబు తీసికొనిపోయి తగుల వేయవలసినదే కదా! నేనిప్పు డిట్లు చేసినచో నా కప్పు డెవరో దొరుకుదురు లేకపోయినచో కుక్కలు నక్కలు పీకుకొని తినవలసినదే! అని సమాదానము చెప్పును

ఊరిలో కలరా చెలరేగినపుడు ప్రతిజనుడు శవములకు దూర దూరముగా పరువెత్తినపుడు నాయరు సహస్రదా ఉపయోగ పడెను చివరి కతనికి ఒక రావుబహదరయినను రాలేదు

స్కూలు పిల్లలకు కొందఱకు అతడు జీతములు కట్టునని చెప్పుదురు ఎంతవఱకు నిజమో ఎవరెరుగుదురు

దర్మారావు పోయి డబ్బడుగ వలయుననుకొన్నది యీ మనిసిని యాచ్నా మోహా వర మదిగుణే నాదమే లబ్ధకామా దర్మారావు నాయరును అదిగుణుని క్రిందనే లెక్క పెట్టెను కాని రెండేండ్ల నుండి నాయరు దర్మారావు సొమ్ము దమ్మిడి తినలేదు అతని దగ్గర ఒక తమ లపాకుల కిల్లీ కొనలేదు అతనితో ఎన్నడును మాటాడ లేదు ఏమనిపోయి అడుగును?

దర్మారావు పోయి దుకాణము వద్ద నిలు చుండెను ఏమని అడుగవలయునో తెలియ లేదు ఎవరో వచ్చుచు పోవుచుండిరి వారందరు ఉన్నపుడు అడుగుటకు అతనికి ఇష్టము లేదు చివరికి ఎవ్వరు లేకుండ పోయిరి అడుగుట కదే వేళ నాయరు అతని వంక చూచి, ఏమి కావలయు బాబూ? అనెను దర్మారావు నాలుకకు మాట రాలేదు ఏమియు అక్కఱ లేదు అని దర్మారావు వెడలి పోయెను దర్మారావు యింటికి పోయెను

ప్రొద్దు క్రుంకవచ్చు చున్నది తల్లి నాయనా! నీవును, అరుందతియు అన్నము పెట్టుకొని తినుడు నేను దేవాలయమునకు పోయి వత్తును అని ఏగెను దర్మారావు నాకు అన్నము అక్కఱ లే దని పోబోయెను అత్తగారు అదివఱకే గడప దాటి పోయెను దర్మారావు అడుగు ముందుకు వేయబో వు చుండెను వెనుక నుండి అతనిని ఎవరో

జరిగిన కథ 18 – రుక్మిణమ్మారావుగారి సాయంతో దర్మారావు కళాశాలలో చేరతాడు పుట్టినింటిలో తాను పడిన కష్టాలను అరుందతి దర్మారావుతో చెబుతుంది రంగాజమ్మగారు జబ్బుతో మరణిస్తారు రంగాజమ్మగారి గురించి ఊరిలో అందరూ గొప్పగా చెప్పుకుంటారు రామచంద్రరాజు తన కొడుకుకు రామేశ్వర శాస్త్రిరాజు అని పేరు పెడతాడు రామచంద్రరాజు సుబ్బన్నపేటలో స్థిరపడిపోతాడు అరుందతి, రతంతరులకు మంచి స్నేహం అవుతుంది రాణిగారి నుండి అందుతున్న ధన సహాయం హఠాత్తుగా ఆగిపోతుంది ధర్మారావుకి మళ్ళీ కష్టాలు మొదలవుతాయి

వెలువడింది

# బాలరంజని

ఆగస్టు, 1987
సంచిక

ముఖచిత్రం : మూషిక వాహనుడు

ఈ సంచికలో ...

## కథలు



మార్పు
దురాశ
వ్యాపారి దయ
నిజమైన సంపద
చిత్తశుద్ధి



ఇద్దరు పిసినారులు
ప్రతిభ
మారిన మనిషి
తగిన వైద్యం
చలమయ్య తెలివి



శవం చెప్పిన సాక్ష్యం
ఆలోచన
గాంధీగారి
బహుమతులు
గోమాబాయి




## సీరియల్ కథలు

భీష్మ
నత్త పాపాయి
రాజ్యకాంక్ష
అమ్మ కోసం

## పెద్ద కథ

తోక పీకుడుగాడు





## బొమ్మల కథలు

కపీష్
చిట్టిరాజు

## వ్యాసాలు

స్టాంపుకథ
టెలివిజన్
రాక్షస ఎలుక

విడిప్రతి వెల : రు. 2-50

100 పేజీలు

# వేయిపడగలు

యింటి లోనికి లాగి తలుపు వేసిరి ఇంటిలో ఉన్నది ఒక్క అరుంధతియే

అరుంధతికి పతి కోపము తెలిసినది అతని కోపమున కొక్కటే గురుతు అతడిల్లు పట్టకుండ తిరుగుటయే కోపము లేనపుడు అరుంధతి అన్నము అరుంధతి నీరు అరుంధతి నిద్ర ఈ మనిషి అరుంధతి మీద కోపము వచ్చిన గాని ఊరు పట్టడు

ఇంటిలోనికి లాగి అరుంధతి "ఎందుకయ్యా కోపము? అనెను

ధర్మారావునకు నవ్వు వచ్చి, అయ్యో ఏమిటి? అనెను

అరుం ఈ చిట్టి చిట్టి కోపా లేమిటి? నేను రంగాపురము పోయెదను మన కెవ్వరికి అక్కర లేని చంద్రహారము కావలసిన వారక్కడ ఉన్నారు ఇచ్చి వచ్చెదను

ధర్మా అక్కరలేక పోవుట ఏమిటి? రాత్రి నన్ను నిద్రపోనిచ్చి తెచ్చి మెడలో వేసికొంటివి కదా'

అరుం అబద్ధము లాడకుడు ఆడపిల్లలు పుట్టెదరు

ధర్మారావు నవ్వి అరుంధతిని చెంపమీద కొట్టెను

అరుం మీరు కదా తెచ్చి నా మెడలో వేసినది?

ధర్మా చీచీ' నేను మరల దానితో అవసరము లేదను వఱకు ఆ నగ తాకనని ప్రతిజ్ఞ చేసితిని మరల ముట్టుకొందునా?

అరుం భగవత్సాక్షిగా ఈ హారము నా మెడలోనికి మరల ఎట్లు వచ్చినదో నాకు తెలయదు మీరు వేసితిరనియే ప్రొద్దుటి నుండియు మెడలో ఉంచుకొంటిని ఇదిగో తీసి వేయుచున్నాను అని తీసి పెట్టెలో పెట్టెను

దంపతు లిద్దరు సంధి పత్రములు వ్రాసికొనిరి రాజ్యముల మధ్య సంధి షరతులు చెడినంత తొందరగా అమాయకులయిన ఆ దంపతుల మధ్య చెడవు ధర్మారావునకు ఆ సందేహము లేదు కాని హారము ఆమె మెడలోనికెట్లు వచ్చెను?

సావిత్రమ్మగారు నేయి ఎక్కడనో అప్పు తెచ్చెను ప్రక్క వారి దొడ్డిలో పొట్లకాయలు కాచి వారు రెండిచ్చి పోయిరి అవి కూర వండెను ప్రొద్దుటి అన్నమే భార్యభర్త లిద్దరు కూర్చుండి వడ్డించుకొనిరి వీథి తలుపు వేసిరి

అరుం నేను మీ నోటిలో అన్నము పెట్టునట్లు మీరు తినునట్లు' వ్రేలు మాత్రము కొరుకరాదు

ధర్మా నీవు నా ప్రాణములు మాత్రము కొరకరాదు

అరుం మీరు కవులు కాదు' మీది అదొక కత్తు

అరుంధతి ముద్ద ధర్మారావు నోటికి అందించెను అతని కన్ను దేవదాసి యిచ్చిన ఉంగరముపై పడెను ఆ పడుట అరుంధతి తెలిసి కొనెను 'ఆమె వెంటనే ఉంగరము తీసి, అన్నట్లుగా మరిచి పోయితిమి ఈ ఉంగరము అమ్మి పది రూపాయలు తేరాదా? అనెను ధర్మారావు నేను దానివంక అందుకు చూడలేదు నా చూపు దాని మీద యాదృచ్ఛికముగా పడినది దుర్మార్గురాలా' ఆ నా చూపునకు దురర్థము చేసితివి ఒకవేళ అమ్మినచో హారమైన అమ్మవచ్చు గాని ఉంగరము తాకనే రాదు అనెను ఇద్దరి ఊహలు ఒక్కసారిగా దేవదాసి మీదికి చనెను

సంపద్దారిద్ర్యములు సుఖ దుఃఖములు సంయోగవియోగములన్నియు దాటి వాయు పథమున పోవు మహాజ్యోతిస్సువలె దేవదాసి వారికి తోచెను తరువాత ఇద్దరును మాటాడకుండ భోజనము చేసిరి ఇంతలో తల్లియు వచ్చెను

రాత్రి జాము ప్రొద్దు పోయెను ధర్మారావునకు ఇంకను నిదుర పట్ట లేదు ఎవరో వచ్చి తలుపు తట్టిరి ధర్మారావు పోయి తలుపు తీసెను వచ్చినది నాయరు బాబూగారూ' మీ యిల్లు కనుగొనినాను ఆ నల్లని ఆయన మీతో తిరుగు చుండును ఆయన చెప్పినాడు ఇందాక మీరు నా దుకాణమునకు ఎందుకు వచ్చినారు? అని అత డడిగెను ధర్మారావునకు అచ్చెరు వయ్యెను అతడు ఊరకే వచ్చితిని అనెను కాదు బాబూ' ఏమైన డబ్బు కావలసియా? అని అతడు తరిమెను ఊఁ' అని ధర్మారావు నోటి నుండి అతనికి తెలియ కుండగనే వచ్చెను నాయరు ఉత్తరీయము కొంగు నుండి ఊడదీసి రెండు రూపాయలు ధర్మారావునకు ఇచ్చి బాబూ' ఇవిగో రెండు రూపాయలు ఇవ్వేళ పెట్టెలో చివరికి ఇవియే ఉన్నవి చాలునా? అనెను ధర్మారావునకు చాలునా అన్న మాట నిందించుటయో పొగడుటయో, ఆదరించుటయో, తిరస్కరించుటయో తెలియ లేదు తీవ్ర ప్రయాణము స్థిర మైనది లక్షాధికారుల బిచ్చ భగవంతునికి భావమయినది. జమీందారుల కాదరణీయుడు మహా మేధావి- అంతటి ధర్మారావును నాయరు ముందు వినయముచే గుంచించుకొని పోయిన ఒక రేణువయి పోయెను- ఇచ్చుట పుచ్చుకొనుట, ఒకటి ఉచ్ఛ్రేశవము రెండవది చెవులు వ్రేలాడుచున్న గాడిద, అడుగవలసి వచ్చువఱకు చే సాచవలసి వచ్చువఱకు జగత్ప్రభువు వామనుడైపోయెను

పరిదీనమూర్తియో విషాదమూర్తియో ఆనంద మూర్తియో అరుంధతి కౌగిట ఉన్న ధర్మారావు మసకలాడుచున్న పామువలె అయ్యెను పరమ శివునివలె అరుంధతి ఢొక్కలో కొంతసేపు చేరును హృషీకేశునివలె ఆమె ప్రాణము లొకసారి ఆకర్షించును విస్తరించిన గరుత్మంతుని రెక్కల వలె ఒక్కసారి ఆమె శరీర మంతయు తనలో ఇముడ్చుకొనును

అరుంధతికి ధర్మారావు శృంగార మొక్కొక్కనాడు ఒక్కొక్క రీతిగా దోచును అతడేదో ఒక మహారసమూర్తి అవ్యక్తముల్లై అతనియందు దాగి ఉన్న నూత్న వినూత్న భావములు వేళ కొలంది బహిర్గతము లగుచుండును ఒక విషాద భావము వచ్చి అతని బుద్ధి కృశించి పోవలయును ఆ విషాద రేఖ పోయి మఱల సహజ విస్మృతి వచ్చినపుడు మఱొక క్రొత్త వికాసము కలుగును ఈ వికాసము లన్నియు తాండవించు చోటు అరుంధతి

సావిత్రమ్మ గారు వచ్చి రాత్రి చంద్రహారము నేలమీద ఉన్నదేమే? అనెను గాఢపరిష్వంగమున ఉన్న సతీపతులు లేచి నిలుచుండిరి ఆమె, నేను తెల్లవారు వేళ ఊర్ధ్వ పోయితిని నేలమీద పడి ఉన్నది నేను తీసి నీ మెడలో మఱల వేసితిని జాగ్రత్త' అది కూడా పోయెనా, చెప్పితివా మన దశ' అనెను అరుంధతి వెనుక నుండి చీకటిలో ధర్మారావును స్పృశించెను అది తనమీది అపనింద పోయినందుకు సంతోషము అత డామెను చేయి పట్టుకొని లాగెను తల్లి మఱల హార మేమి చేసితివి? అనెను అరుంధతి పెట్టెలో పెట్టితిని' అనెను సావిత్రమ్మగారు మంచి పని చేసితివి. దొంగవానికి తాళము చేతికిచ్చినట్లు అని తన మెడలో వేసికొని పోయి పండుకొనెను తల్లిపోయి తలుపు వేసి కొనెను ధర్మారావు అరుంధతిని గరుడి త్రాచుపామును ఒడిసి పట్టినట్లు పట్టెను ఆమె కిలారుమని నవ్వెను

మరునాడు ధర్మారావు బెజవాడ పోయి సూర్యపతిని కలసి కొనెను సూర్యపతి యీ వృత్తాంత మంతయు విని సుబ్బన్న పేట పోయిరా అనెను ధర్మారావు సుబ్బన్న పేట పోయెను

ధర్మారావు సుబ్బన్న పేట వర్తమానములు తెలిసి కొనెను రాణీ గారికి మూడు నెలల నుండియు జబ్బుగా ఉండెను ప్రాణము మీదికి వచ్చినదని రంగారావు గారికి మూడు సారులు తంతి ఇచ్చిరి

దోసె పట్రా వోయ్
డబుల్ రోస్టు చేసి-

తర్వాత చెప్పలేదంటారు
మా హోటల్లో డబుల్ రోస్టు
అంటే రెండు వైపులా
మాడ్చేస్తాం



"విశ్వనాథ నాయకుడు"లో కృష్ణ, కృష్ణంరాజు, శివాజీ గణేశన్

## తాతినేని రామారావు రూపొందించే "న్యాయానికి శిక్ష"

"అన్యాయానికి గురైన ఓ మహిళ ఓ లాయర్ సహకారంతో ప్రజలను చైతన్య వంతుల్ని చేసి, అన్యాయాలను ఎలా అణచి వేస్తుందనే ఇతివృత్తం. దీని తమిళ మాతృక 'నీతిక్కి దండనై'. సూపర్ హిట్ అయింది. పొలిటికల్ సెటైర్‌గా 'ప్రతిఘటన' ఛాయల్లో నడిచే విప్లవాత్మక కథాంశమిది. జూలై 13 నుంచి 24 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. ఆగస్టు 2–16, సెప్టెంబర్ 2–10 షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు తాతినేని రామారావు. ఈయన స్వీయ దర్శకత్వంలో నిర్మించే శ్రీనాథ్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో భానుప్రియ, శ్రీవిద్య, రాజ్యలక్ష్మి, శివకృష్ణ, రఘువరన్, కోట శ్రీనివాసరావు, గొల్లపూడి మారుతీరావు, గుమ్మడి, నర్రా, రాజేష్, గిరిబాబు వేలు, వీరభద్రరావు, నారాయణమూర్తి తెరముందు, ఎం. వి. ఎస్. హరనాధరావు, వేటూరి, చక్రవర్తి, ఎం. వి. రఘు. పేకేటి రంగా, విశ్వం, రఘు, సాహుల్, కృష్ణస్వామి, బాలు, డి. బ్రహ్మానందరావు, వి. చంద్రమోహన్ తెర వెనుక కృషి చేస్తున్నారు. ఎస్. పి. శివలింగేశ్వరరావు నిర్మాణతలో ఆలపాటి రంగారావు సమర్పణ. □




## కలల అలల మంచు తెరలంత పల్చన

పొగమంచుకన్నా పల్చన, ఎగిరే ఈకకన్నా తేలిక, అదే మీరు కోరే నిశ్చింత నిస్తుందిక. డ్యూరెక్స్ ఫెదర్ లైట్ అంతఃరరాష్ట్రీయ కాండోము లిప్పుడు ఇండియాలో లభిస్తున్నాయి.

ప్రపంచానికి తెలిసిన అతి తేలికైన, సున్నితమైన సంరక్షతను తెలిసికొనడానికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము.




MAA (S) LRDF 2A TEL 85



# శతచిత్ర నటి సుమలత సమాధానాలు!

ఎన్. మాంధాత, వేములవాడ

ప్ర మూర్ఖుడికి మతిభ్రష్టుడికి తేడా ఏమిటి, సుమలతగారూ?

జ మతిభ్రష్టుడికి చికిత్స ఉంది

పోలా నవనీత కృష్ణ, ప్రొద్దుటూరు

ప్ర స్త్రీకి కన్నీళ్ళు ఆయుధం మరి పురుషుడికో

జ తెచ్చిపెట్టుకున్న నవ్వు

బి లీలావతి, తిరుపతి

ప్ర అక్కయ్యా! అనుకున్నది సాధించాలంటే అదృష్టం కూడా ఉండాలి కదూ?

జ అది ఆ అనుకున్న దాన్ని బట్టి ఉంటుందేమో?

డి పాండురంగం, విజయనగరం

ప్ర కొందరు తమ ప్రశ్నలకు జవాబులు తెలిసీ కూడా మిమ్మల్ని అడుగుతూంటారేమిటండీ?

జ చచ్చాను పొండి మీరూ అలాంటి ప్రశ్నే అడిగారూ?

వై నిర్మల, గుంతకల్లు

ప్ర అనవసరంగా ఇతరులను ఆడిపోసుకునే వారిని ఏమనాలి చెల్లాయీ?

జ అటువంటి వారి గురించి మనం ఆడిపోసుకోవడం ఎందుకు లెండి

కె సీతాదేవి, పాయకరావుపేట

ప్ర ఒక పురుషునికి ఇద్దరు భార్యలుంటే వాళ్ళు సవతులు అవుతారు మరి ఒక స్త్రీకి ఇద్దరు భర్తలుంటే వాళ్ళేమవుతారు?

జ తల్లీ! మీ పేరు గలవారు అడగవలసిన ప్రశ్నేనా ఇది?

వి కె బెనర్జీ, నాగపూర్

ప్ర భగవంతుడు కొందరు యువతులకు అందం ఇచ్చి దానితో పాటు అహంకారం కూడా ఎందుకు ఇస్తాడండి?

జ అది కొంత వరకు నయమే కొందరికి మొదటిది ఇవ్వకుండానే రెండోది ఇస్తుంటాడు

కాశీ జయవాణి, ద్రాక్షారామ

ప్ర యువతుల చేతులకు రిస్ట్ వాచ్ ఉండాలా? గాజులు ఉండడం మంచిదా?

జ గాజులు పవిత్రం రిస్ట్ వాచ్ ప్రయోజనం

## ఉత్తమ ప్రశ్న

కె. సీతాదేవి, రేచర్ల

ప్ర మీరు ఒక హీరోతో ఒక సినిమాలో చెల్లిగా, ఆ హీరోతోటే వేరే సినిమాలో ప్రియురాలిగా, భార్యగా నటించినప్పుడు ఎలా ఫీలవుతారు?

జ: నటునిబట్టికాదు నటన, పాత్రనిబట్టే నటన.

టి సంజీవి, కొవ్వూరు

ప్ర సుమలతగారూ! నేటి పరిస్థితుల దృష్ట్యా మనకు ఎలాంటి సినిమాలు అవసరమంటారు!

జ కాస్సేపు నేటి మన పరిస్థితులను మరిపింప చేసేవి

డి వెంకట్రామయ్య, చేబ్రోలు

ప్ర ఈ ప్రపంచానికి అంతమనేది ఎప్పటికైనా ఉంటుందేమో చెప్పగలరా?

జ ఆది అనేది ఉన్న దేనికైనా అంతం తప్పదు ఎప్పటికైనా

కె సాయిబాబా, బాన్సువాడా

ప్ర మీరు అనవసరమైన ప్రశ్నలకు జవాబులివ్వక పోతే ఎం?

జ అలాంటప్పుడు మీ ఈ ప్రశ్నకు కూడా జవాబు దొరికేది కాదుగా?

రజియా బేగం, గోపాలపట్నం

ప్ర అక్కయ్య గారూ! మీరు తమిళ చిత్రాలలో నటించినారా?

జ ఓ(హో(

ఎస్ హెచ్ ఎ గూడూరు

ప్ర సుమలతగారూ! మన దేశం గొప్పదా? లేక మన దేశాన్ని తెల్ల దొరల నుండి రక్షించిన మన దేశ నాయకులు గొప్పవారా?

జ మన గొప్ప దేశం కోసం త్యాగం చేసిన స్వాతంత్ర్య యోధులే గొప్పవారు

గూడపాటి రాజేంద్రప్రసాద్, దొడ్డిపట్ల

ప్ర మీరు క్రికెట్ హీరో కపిల్‌దేవ్‌ని అభిమానించుటలో ప్రధాన కారణం ఏమిటి?

జ మన క్రికెట్ రంగంలో ఫాస్ట్ బౌలర్ ఈయన బౌలింగ్‌కు వెస్ట్ ఇండీస్ బాట్స్‌మన్ కూడా బెదిరిపోతారు బాటింగ్‌లో ఇయాన్ బోథమ్‌కు సరితూగగల ననిపించుకున్న వ్యక్తి మన భారత్ జట్టులో ఇంతవరకు 300 వికెట్లు తీసుకున్న ఘనత కపిల్‌దేవ్‌దే ఈయన కెప్టెన్సీలో మనం వరల్డ్ కప్ సాధించాం రియల్లీ హి ఈస్ ది గ్రేట్ ఆల్ రౌండర్ □

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# సుమలత సమాధానాలు

ప్రశ్న

పంపినవారి పేరు

పూర్తి చిరునామా

# అభిమాన తారలపై అభిప్రాయం

ఆరు కోట్ల ప్రజలలో చంటబ్బాయి గా పుట్టాడు అతను ఎవరో తెలుసా! యింట్లో రామయ్య - వీధిలో కృష్ణయ్య పాపం! ఇతను కిరాతకుడు ఏమో అని అనుమానం వచ్చి ఖైదీ అని ముద్ర వేసి జైలులో వేసారు కాని యితను గూడచారి నెం 1 అని తెలుసుకొని విచారించి వదిలేసారు. అప్పుడు



మనసులో అనుకొన్నాడు చట్టానికి కళ్ళు లేవని మంచిగా బ్రతకాలనుకొన్నాడు గూండా రాక్షసుడు అన్నారు కాలం కలిసి రాకపోతుందా అని వూరుకున్నాడు విజయలక్ష్మి వరించింది విజేత అని తెల్పింది వరద బాధితుల కష్టాల కౌగిట్లో ముందుంటాడు వాళ్ళలోని అభిలాష ని తెల్సుకొని వాళ్ళ కోర్కెలు తీర్చాడు నిజంగా మా చిరంజీవి చిత్రరంగానికి ఎప్పటికి చిరంజీవే !!

చింతక్రింది బాస్కరరావు తెనాలి

* * *

స్వభాషా స్వదేశం కాక పరబాషా పరదేశ చిత్రంలో నటించి అందరి అభిమానాన్ని చూరగొన్న యువ అందాల నటుడు టామ్ నా అభిమాన నటుడు ఆయన పడమటి సంధ్యా రాగం చిత్రంలో నటించాడు అనే దానికన్నా జీవించాడు అంటే బాగుంటుందేమో అందుకే ఆయన ఈ చిత్రంలో నే అనేకమంది అభిమానులను పొందారు

తొలి చిత్రమైనా అనుభవమున్న నటుడిగా నటించాడు ముఖ్యంగా రామరసం బాగుందని మొత్తం త్రాగేటప్పుడు చివరలో విమానాశ్రయంలో సంధ్యా ఈ ఎల్లలంతా మనవాళ్ళే అనుకుందాం అనే సమయంలో



ముఖంలో హావభావ ప్రకటన చాలా బాగుంది.

ఈయన ఇంకా తెలుగు చక్కగా మాట్లాడటం నేర్చుకుని అనేక తెలుగు చిత్రాలలో నటించి సినీ వినీలాకాశంలో అగ్రనటుడుగా వెలుగొందాలని ఆయన అభిమానిగా ఆశిస్తున్నాను

బి శ్రీదేవి తిరుపతి

యంగ్ స్టార్ సినిమారంజని గోల్డ్ స్టార్ విజేత యువకిశోరం నందమూరి బాలకృష్ణగారంటే నాకు ఎనలేని అభిమానం

దానవీర శూర కర్ణ లో అభిమన్యుడుగా జీవించి నటించి నా అభిమానం చూరగొన్నారు సీతారామ కళ్యాణం"లో ప్రేమలో జయించి, "అనసూయమ్మ గారి అల్లుడు"లో హాస్యరసం పోషించి, "దేశోద్ధారకుడు"గా, "ముద్దుల క్రిష్ణయ్య"గా నటించి, 86వ సంవత్సరంలో విజయఢంకా మ్రోగించిన సాహస సామ్రాట్ కళాతపస్వి కె. విశ్వనాథ్ దర్శకత్వంలో నటించి, తన ఇమేజ్ దెబ్బ తినకుండా వివిధ పాత్రలలో నటించి, ప్రేక్షక



హృదయాలలో చిరస్థాయిగా నిలిచి పోవాలని అభిమానిగా నా కోరిక.

-డబ్బీరు ఉమామహేశ్వరరావ్
కట్టుబోలు (విశాఖ)

* * *

నా అభిమాన నటి అందాల నటి, నర్తకి భానుప్రియ గారి సోదరి రేఖ. తొలి చిత్రంలోనే అద్వితీయంగా నటించి డాన్సులో తన అక్క



తరువాత తానే సాటిగా ద్వితీయ చిత్రంలో మూగఎల్లగా చాలా బాగా నటించారు విడుదలైన రెండు చిత్రాలలోను ఎంతో బాగా నటించిన రేఖ భవిష్యత్తులో మంచి తార కాగలదని ఆశిస్తున్నాను భానుప్రియ లాగే మంచి పాత్రలలో నటించాలని హిందీ చిత్రాలలోకి ప్రవేశించ వద్దని అభిమానిగొనా సలహా

తారకనాగ్ గుప్త
బెండమూర్లంక (తూ గో)

* * *

తెలుగు చలనచిత్ర వినీలాకాశంలో ధృవతారగా వెలుగొందుతూ తన నటనా కౌశలంతో అఖిలాంధ్ర ప్రేక్షకుల హృదయాలను దోచుకున్న అందాల తార విజయశాంతి నా అభిమాన నటి నేటి భారతం చూసిన నాటి నుండి ఆమె అభిమాని నయ్యాను నాటి నుండి నేటి మువ్వ గోపాలుడు వరకు ఆమె నటించిన సినిమాలన్నీ చూసాను నేటి భారతం అగ్నిపర్వతం ప్రతిఘటన శ్రావణ సంధ్య చిత్రాలలో తన పాత్రలకు పూర్తి జీవం పోసి తనకు తనే సాటి అని నిరూపించుకున్న ఏకైక నటి వి



జయశాంతి.

ప్రేక్షకాభిమానులతో సూపర్ హీరోయిన్ గా ప్రశంసింపబడుతున్న విజయశాంతి గారు ఇక ముందు కూడ మంచి కథా బలం గల చిత్రాలలో పెద్ద హీరో ల సరసన మాత్రమే నటించి తనకు గల ప్రత్యేక స్థానాన్ని పదిలపరచుకొని అభిమానులను ప్రేక్షకులను ఆనందింపజేయగలరని ఆశిస్తున్నాను ప్రతిఘటన ద్వారా నంది అవార్డు పొందిన విజయశాంతి గారు జాతీయ అవార్డు పొందేందుకు కృషి చేయవల్సినదిగా నా విజ్ఞప్తి

-బి శ్రీహరిరావు
కొత్తపేట విజయనగరం

* * *

నా అభిమాన నటుడు శోభన్‌బాబు అనేక సాంఘిక చిత్రాలు అతని పాత్ర ద్వారానే విజయవంతం అయ్యాయంటే అతిశయోక్తి కాదు ఈ పాత్ర ఇతని కోసమే సృష్టించబడిందా అనిపిస్తుంది కొన్ని సినిమాలలో ఆయన నటన చూస్తుంటే ఆయనకున్న నిరాడంబరత్వం ఏ నటుడిలోను కన్పించదు రాజకీయాలకు దూరంగా వివాదాలకు అతీతంగా మానవత్వానికి ప్రతీకగా



వున్న నిర్మాతలకు మినిమమ్ గ్యారంటీ వున్న మా అందాల నటుడు శోభన్ మరిన్ని ఉత్తమ చిత్రాలలో నటించి మరెంతో మంచి వ్యక్తిగా కీర్తిప్రతిష్టలు గడించాలని నా ఆకాంక్ష

ఏ వి ఆర్ మూర్తి శ్రీకాకుళం □

# "నా కొడుకు పైసదువు సదవాలన్నప్పుడు, నేనాడ్ని సదివించగలిగినందుకు నాకెంతో సంతోసంగుంది... ఇదంతా అద్భుతమైన కొత్త ఎవసాయం, జై కిసాన్ ఎరువుల పనితనం వల్లే!"




## ఆధునిక వ్యవసాయ పద్ధతులకు జైకిసాన్ తోడైతే—బంగారు పంట

మీ భూమి నుంచి అత్యధికంగా దిగుబడి పొందాలి అంటే ఆధునిక వ్యవసాయ పద్ధతులు అనుసరించడం అతి ముఖ్యం. భూమి పట్ల అవసరమైన శ్రద్ధంతా చూపండి బదులుగా పుష్కలమైన ఫలితాలిస్తుంది మీకు.
ఉదాహరణకు: ఎల్లప్పుడూ అధిక దిగుబడినిచ్చే విత్తనాలే వాడండి. నీటి పారుదలకు ఉత్తమ నీటి యాజమాన్య పద్ధతులు జత చేయండి. సస్యరక్షణ చేకూర్చండి, కలుపు మొక్కల్ని అరికట్టండి.
ఇక బంగారు పంటకోసం ఎల్లప్పుడూ ఏ ఎరువులు వాడాలో తెలివైన రైతుకు తెలుసు. అవి జైకిసాన్—నాణ్యతకూ, పనితనానికీ నమ్మకమైన పేరు.

### జైకిసాన్ సామ్రాట్ 18 : 46 : 0

పంట ఎదిగే తొలి దశల్లో సరైన మేరకు నత్రజనినీ, అత్యధిక పాలులో ఫాస్ఫేట్ పోషణనీ అందిస్తుంది.

### జైకిసాన్ సంపూర్ణ 19 : 19 : 19

మన దేశంలో ఇటువంటి తరహా ఎరువు ఇదొక్కటే. పంటలకు అత్యధికంగా ఎన్ పి కె (నత్రజని, భాస్వరం, పొటాష్) పోషక పదార్థాలు అందిస్తుంది... ఫలితంగా మొక్కలు ఆరోగ్యంగా ఎదిగి, పుష్కలంగా దిగుబడి ఇస్తాయి.

### జైకిసాన్ యూరియా 46.4%

స్వచ్ఛమైన తెల్లని సూక్ష్మ గుళికల రూపంలో వుండే ఈ ఎరువులో నత్రజని పోషక పదార్థాలు వుంటాయి. బైయూరేట్ పాలు అతి తక్కువగా ఉంటుంది. పైపాటుగా వేయటానికీ, ఆకుల మీద చల్లటానికీ ఆదర్శవంతమైనది.

- సంతులితమైన ఎరువులు అత్యధిక దిగుబడికి హామీ.
- జువారి వారి ఉచిత భూసార పరీక్ష సేవకోసం అడగండి.










# జై కిసాన్

## ఎరువులు

తెలివైన రైతులకు సుఖసంపదల మార్గం.

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్
జైకిసాన్ భవన్, జువారినగర్, గోవా 403 726.

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు : సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణే, ఇండోర్, ఆగ్రా, ఔరంగాబాద్, జువారినగర్.

LINTAS ZUA 152 2317 TL

# భయం భయం

## డాక్టర్ సోమిరెడ్డి (పెళ్ళకూరు) జయప్రద

కారు స్పీడ్‌గా, మెత్తగా నిర్భయంగా ఆ డబల్ రోడ్డుమీద దొర్లిపోతోంది. కానీ కార్లో ముందు సీట్లో కూర్చున్న వ్యక్తుల ముఖాల్లో ఆందోళన.

"అంత స్పీడెందుకండి. కాస్త మెల్లిగా పోనివ్వండీ" ధరిత్రి భర్తతో కొద్ది విసుగ్గా, కొద్ది అర్థింపుగా అంది.

అతను రోడ్డు వైపు నుండి చూపు మరల్చలేదు. నోరెత్తలేదు. కారు వేగం తగ్గలేదు. భాస్కరుడు కూడా వేగంగా పడమట దిక్కున ఆకాశమార్గం నుండి సముద్రమార్గంలోకి ప్రయాణం చేస్తున్నాడు.

"చెప్తే వినాలి - అంత మొండితనమెందుకు? ఇంకో పది నిముషాలు లేట్‌గా వెళ్తాం! ఏం మునిగిపోతుంది?"

"ప్రొద్దుపోతే రోజులు బాగలేవు. దూర ప్రయాణం తొందరగా తెమలమని చెప్పాను. విన్నావా? అప్పుడే అరయిపోయింది గంట. ఇంకా మూడు గంటలసేపు ప్రయాణముంది".

మాట్లాడలేదు ధరిత్రి.

కొద్దిగా వేగం తగ్గించాడు గాంధీ.

"పగలు ఎండలో ప్రయాణంకంటే ఈ టైమ్‌లో కారుజర్నీ బావుంటుంది" ధరిత్రి మెల్లిగా అంది.

"నిజమే. నిజమే ధరిత్రీ. కానీ రోజులిలా వున్నాయి. పది రూపాయలున్న పర్స్ కోసం పరమ కిరాతకంగా ప్రాణాలు తీస్తున్న దారి దోపిడీ మనుష్యులు తయారయిన రోజులివి. పైగా నేనొక్కణ్ణే అయితే ఫర్వాలేదు".

ఎదురుగా లారీ స్పీడుగా వస్తోంది.

"నిజమే! ఆడ, మగ ఏముందిలే. మీరు ఏ రోజైనా ఇంటికి రావడం ఆలస్యమయితే, నా మనసు మనసులో వుండదు. సవాలక్ష అనుమానాలు". భర్తకు కాస్త దగ్గరకు జరుగుతూ అంటున్న భార్య భుజంమీద ఎడంచెయ్యి వేసి కుడిచేత్తో స్టీరింగ్ తిప్పుతున్నాడు.

"బయటకు వెళ్ళాక లక్షణంగా తిరిగి ఇంటికి వస్తామనే ధైర్యంలేని రోజులయిపోయాయి. మొన్న మావాడు కిరణ్‌లేడూ! వాడు కల్లాంలో ఒడ్లు అమ్మి స్కూటర్ తీసుకుని ఇంటికొస్తుంటే నలుగురు మనుష్యులు అటూ ఇటూ నిల్చుని కర్రలెత్తి కొట్టికాదూ! డబ్బు తీసుకెళ్ళింది."

భయంగా చూసింది ధరిత్రి.

"అప్పుడు గంట పదన్నా కాలేదు. మగవాడు ఏడు గంటలకే గూడు చేరాలంటే ప్రతిరోజూ ఎలా వీలవుతుంది?"

"మీ కెప్పుడయినా అలా తటస్థిస్తే ముందే డబ్బుతీత్తి వాళ్ళ మొహాన పారేయండి. పాడు డబ్బు పోతేపోయింది. తగలరానిచోట దెబ్బ తగిలితే ఇంకేమయినా వుందా"?

సడెన్‌గా కారు స్పీడు తగ్గిపోయింది. క్లచ్ వేసి గేర్లు మారుస్తున్నాడతను.

"ఏమైంది?" బెదిరిపోతూ అడిగింది ధరిత్రి. ఆమెకు కారెక్కడ ఆగిపోతుందోనని భయంగా వుంది.

అమ్మా నాన్నల భయం చూస్తే నవ్వుగా వుంది పదిహేడేళ్ళ అశ్వనికి. వెనకసీట్లో కూర్చుని ఇంగ్లీషు నవల చదువుకుంటున్న ఆ టీనేజ్ అబ్బాయి ఒకసారి తలెత్తి చూసి మరలా నవలలో మునిగిపోయాడు.

"ఏం లేదు. మన ప్రాణానికి ఈ స్పీడ్ బ్రేకర్స్ ఒకటి. ఎంబాసిడర్ కారు కాబట్టి సరిపోయింది. ఫియట్‌కయితే టాంక్ తగలాల్సిందే అంత అందంగా వేసాడు. వెహికల్స్ గుల్లయిపోతున్నాయి".

రోడ్డు వైపు వెనక్కు తిరిగి చూసింది ధరిత్రి.

"పైగా వాటి మొహాన తెల్లరంగు కొట్టాడా అంటే అదీలేదు. దగ్గరకొచ్చేదాకా కన్పించి చావవు. సడన్‌బ్రేకులు, వెనుక వెహికల్స్ గుద్దుకోవడాలు అసలివి స్పీడ్ బ్రేకర్సా యాక్సిడెంట్ మేకర్సా అర్థం కాదు".

"నిజమే డాడీ! మెయిన్‌గా రైల్వే లెవల్ క్రాసింగ్ దగ్గర వేస్తున్నారు స్పీడ్ బ్రేకర్స్. చూసి తీరాలి మమ్మీ చిన్న చిన్న స్పీడ్ బ్రేకర్స్ నాలుగైదు ఏడుస్తున్నాయి. గేట్ క్లోజ్ చేసే టైమ్‌కి రిక్షాలు, ఆటోస్ గేటు దాటేయాలనే ఆతృతలో స్పీడ్‌గా వెళ్ళడం వెహికల్ అటూ ఇటూ వూగి ఒకదాన్నొకటి గుద్దుకోవడం చూస్తుంటే భలే నవ్వొస్తుంది మమ్మీ."

"ఛ! నోర్మూసుకోరా! వాళ్ళూ వాళ్ళు గుద్దుకుంటుంటే నీకూ నవ్వులాటగా వుందా?"

నవ్వాడు గాంధీ.

"ఉడుకురక్తం ధరిత్రీ! అందుకే వీడింత గొడవ పెడుతున్నా స్కూటర్ కొనివ్వంది."

"ఇంటర్ పూర్తయ్యాక కూడా కొనివ్వరా" నిష్ఠూరంగా అంటున్న కొడుకు వైపు తల తిప్పి తిప్పనట్లు తిప్పి చూసి,

"ఇంటర్ కాదు నీకు పెళ్ళయ్యే దాక స్కూటర్ కొనివ్వను. మొన్న మీ ఫ్రెండ్ స్కూటర్‌లో ఎంత స్పీడ్ వెళుతున్నావ్ నువ్వు. నువ్వు ఆ రోజు కార్లో లేవు గాని ధరిత్రీ వాడిని చేజ్ చేసి ఆపి అక్కడే చీవాట్లు పెడ్దామనుకున్నాను. వెనుక వీడి ఫ్రెండ్ స్కూటర్ వెనకున్నాడులే బాగుండదని వూర్కున్నాను."

"థాంక్స్ డాడీ! కానీ యాక్సిడెంట్ అవడమనేది టైమ్. అంతే మనం ఎంత స్లోగా పోతున్నా జరిగే యాక్సిడెంట్స్ ఎలాగూ జరుగుతాయి. అవతలివాడు తాగి డ్రైవ్ చేసి కొడ్తే మనమేం చేయగలం?"

"అందుకే నీకిప్పుడే కొనివ్వనంటున్నాను. మనం జాగ్రత్తగా వుంటే కొన్ని యాక్సిడెంట్లయినా తప్పుతాయి" టర్నింగ్ దగ్గర స్లో చేసి మరలా యాక్సిలిరేటర్ నొక్కుతూ అన్నాడు గాంధీ.

అశ్వని మాట్లాడలేదు. అతనికి తల్లిదండ్రుల మీద చాల కోపంగా వుంది. స్కూటర్ కొనుక్కుని నెల్లూరు నుండి ఝూమ్ ఝూమ్ అని హార్సిలీహిల్స్‌కి నేరుగా వెళ్ళాలనే ఆరాటం యీ నాటిది కాదు ఏడో తరగతి నుండి పెరుగుతూ వస్తోంది. హార్సిలీ హిల్స్‌లో స్టడీస్ కూడా పూర్తయ్యాయి. మదనపల్లిలో కాలేజీలో చేరినా ఇంకా పోస్ట్ పోన్‌మెంటే!

"మరి పెళ్ళయ్యాక ఎలా కొనిస్తారు?" నవ్వుతూ అడిగింది. "ధరిత్రీ అప్పుడంటే కడుపులో భయం వుంటుంది. తనకేమయినా అయితే భార్య ఏమయిపోతుందోనని "చిన్నగా నవ్వుతూ అన్నాడు గాంధీ.

"మీరూ అంతేనా" చిలిపిగా చూస్తూ భార్య అనడం కంటి కొనల నుండి అతనికి కన్పిస్తూనే వుంది.

"అంతే మరి శ్రీమతి మహత్యం అలాటిది"

కవ్వింపుగా ఏదో అనబోయిన ధరిత్రి మాటలు గొంతులోనే ఆగిపోయాయి. ఆమె గుండె ఝల్లుమంది.

పది గజాల దూరంలో రోడ్డు కడ్డంగా మనిషి. గాంధీ కారు వేగం తగ్గించలేదు. క్షణంలో కారు అతని మీదుగా వెళ్ళిపోయేదే! ధరిత్రి కళ్ళు గట్టిగా మూసుకుంది. కానీ కారు అతని కెదురుగా వెళ్ళలేదు. అతను కొద్దిగా ప్రక్కకు తప్పుకున్నాడు. కారు అతని




ప్రక్కగా జారవాయింద. ధంత్రి కళ్ళు తెరిచింది. యూనిఫారమ్‌లో వున్న అతను అరుస్తున్నాడు.

"హెల్ప్... హెల్ప్"

అయినా గాంధీ కారాపలేదు.

"మీరు మరీ డాడీ పాపం జాకీ ఏధైనా అవసరమేమో!"

"నువ్వు నోరు మూసుకోరా" ధరిత్రి కసిరింది. "జాకీ యిస్తూ కూర్చుంటే ప్రొద్దుపోతుంది."

"జాకీ అయితే ఇవ్వొచ్చు ధరిత్రీ కానీ కార్లు ఆపి దోపిడీలు చేస్తున్నారు."

"అతను పోలీస్ కానిస్టేబుల్ డాడీ"

"కావచ్చు" కొద్దిగా తల తిప్పి మరలా రోడ్డు వైపుకు చూపు సారిస్తూ అన్నాడు గాంధీ.

"పోలీస్ యూనిఫారమ్‌లో వచ్చి దారి కాచి దోచుకున్న వాళ్ళ సంగతి పేపర్‌లో చదవలేదా అశ్వనీ"

"పేపర్‌లో ఏంటిలే డాడీ. జరుగుతున్నాయనుకోండి. అన్నట్టు మొన్న కొదవలూరులో జరిగిన ఘోరం తెల్సా మమ్మీ! ఆ నలుగుర్లో పారిపోయిన వాడు మా ఫ్రెండ్ స్కూటర్ కడ్డంగా తాడు పెట్టేసారట. వాళ్ళు పడిపోయాక తూములోకి తీసుకెళ్ళడం వీడు కళ్ళారా చూసాడట. ఎలాగో తప్పించుకొచ్చాడు. ఇలాటివన్నీ జరుగుతున్నాయనుకోండి కానీ క్షణ క్షణం ఇలా అనుమాన పడ్తూ భయపడ్తూ వుంటే బతికేదెట్టా"

"చాల్లెవయ్యా ఆ మోటు ధైర్యమే నాకిష్టం లేంది. రోజులు మారే వరకు కాస్త జాగ్రత్తగానే వుండాలి."

"రోజులు మారతాయంటావా?"

"మారవంటారా?" భర్త వైపు దిగులు పడ్తూ చూసింది ధరిత్రి.

ఎదురుగా లారీ వస్తోంది. కారు ముందు మరో లారీ వెళ్తోంది. ఆ లారీని క్రాస్ చెయ్యడానికి హారన్ ఇస్తున్నాడు గాంధీ.

"వద్దొద్దు. ఆపండి ఆ ఎదురు లారి వెళ్ళిపోనివ్వండి" అంటూనే వుంది.

"చాలా స్పేస్ వుంది. అంటూనే క్రాస్ చేసేసాడు గాంధీ. క్రాస్ చేసి నాలుగు గజాలు వెళ్ళారో లేదో! రోడ్డు ప్రక్కన నిల్చున్నామె హఠాత్తుగా రోడ్డులో కొచ్చేసింది. ఆమెను తప్పించను ఎడమ వైపు వెళ్తే ఆమె భయపడి వెనక్కొచ్చింది. ఆమెను తప్పించి కారు కుడివైపు కొచ్చేసరికి ఎదురుగా బస్. ధరిత్రి గట్టిగా కళ్ళు మూసుకుంది. అశ్విని గట్టిగా అరిచేసాడు.

"డాడీ!"

ఎడమ వైపు వెళ్తే ఆ మనిషి ప్రాణం, కుడివైపు వెళ్తే బస్‌ని గుద్దేయడం ఖాయం. డ్రైవర్ మేధస్సుకు పని తగిలే క్షణాలవి. గాంధీ స్టీరింగ్‌ను పూర్తిగా కుడివైపు తిప్పేసాడు. మరుక్షణంలో కారు పొలాల్లో వుండాలి ముగ్గురూ నిర్జీవులై మిగలాల్సిన టైమ్. రోడ్డు పూర్తి అంచు నుంచి ఎడమ వైపుకు తిప్పాడు. క్షణాల్లో చాలా పెద్ద యాక్సిడెంట్ తప్పింది. ఎదురు బస్ కారుని రాంగ్ సైడ్ క్రాస్ చేసి ఆగింది. కారాపాడు గాంధీ. తను వచ్చింది రాంగ్ రూట్. బస్ డ్రైవర్‌కు సంజాయిష్ చెప్పాల్సిన బాధ్యత వుంది కానీ గాంధీ వూహించినట్టు ఎవ్వరూ ఏమీ అనలేదు. కారు కడ్డంగా డాన్స్ చేసిన ఆ మనిషిని దులిపేసారు.

గాంధీ బస్ డ్రైవర్‌కు థాంక్స్ చెప్పాడు.

"మీరు తెలివిగా బస్‌ని రాంగ్ సైడ్ తిప్పారు. లేకపోతే నాకీ అవకాశం మిగిలేది కాదు.

"నేను దూరం నుండే యీ మనిషి డాన్స్ చేయడం చూసాను. మీ రూట్ గమనించి స్లో చేసి రైట్ కొచ్చాను."

"సారీ రాంగ్ రూట్ కెళ్ళడం నాకు తప్పలేదు."

"మీరు బాగ డ్రైవ్ చేసారు సార్. మేము చూస్తూ వుండగానే జరిగింది కదా! ఆ స్పీడ్‌లో చాలా బాగ కంట్రోల్ చేసారు."

చిరునవ్వు నవ్వాడు గాంధీ.

"లేచిన వేళా విశేషం మంచిది" భర్తను కళ్ళ నిండా చూసుకుంటూ గుండెల మీద చెయ్యి వేసుకుని అంది ధరిత్రి.

"అంతే కానీ డాడీ డ్రైవింగ్ నైపుణ్యం కాదంటావ్" తల్లి కంటే ముందుగా కోలుకున్న అశ్విని నవ్వుతూ అన్నాడు.

"ఏదో లేరా గండం గడిచి బయట పడ్డాం."

"అంతా టైమ్ ధరిత్రీ ఎంత మంచి డ్రైవర్సయినా ఒక్కోసారి ఏమీ చేయలేం. అదే టైమ్‌లో నా వెనుక నేను క్రాస్ చేసిన లారీ అక్కడ ఆగకుండా స్పీడ్‌గా వెనుక వచ్చుంటే అతను ఎటు వెళ్ళాలి? ఎడం వైపోస్తే బస్ కుడి వైపోస్తే కారు

# భయం.. భయం

ఎవర్నో ఒకర్ని గుద్దాల్సిందే".

"ఏదో లెండి ఇంక గుర్తు చేయకండి."

గాంధీ అయితే భార్య కోరిక ప్రకారం మరో మాట మాట్లాడ లేదు కానీ ఆ సంఘటనను మరోసారి గుర్తు చేస్తూ రెండు మూడు ఫర్లాంగుల తర్వాత లారీ ఏక్సిడెంట్, లారీ పొలం ప్రక్క నున్న కాలువలో వెల్లకిలా పడుంది. విసిరేసినట్టు కొంత దూరంలో నాలుగు శవాలు. ప్రక్కన పోలీస్, ఫ్రెష్‌గా జరిగిన యాక్సిడెంట్‌లా వుంది. కారు ఆపాడు గాంధీ.

"వద్దు పోనివ్వండీ" భయంగా అంది ధరిత్రి.

"ఒక్క నిముషం ధరిత్రీ" డోర్ ఓపెన్ చేసాడు. తండ్రి దిగడం కోసమే ఎదురు చూస్తున్నట్టు ఛెంగున దిగాడు అశ్విని.

వద్దను కుంటూనే అటు చూసింది ధరిత్రి.

ముగ్గురు మగవాళ్ళు ఒక స్త్రీ- ఇంట్లో ఎంత అపురూపంగా చూసుకునే శరీరాలివి- ఎంత అనాథలుగా ఆ మట్టిలో, ముళ్ళలో గడ్డిలో అడ్డదిడ్డంగా- ధరిత్రి మనస్సంతా దిగులుతో నిండి పోయింది. వీళ్ళ చుట్టూ అల్లుకున్న జీవితాలిక ఎలా స్థంభించి పోతాయో! వాకిట్లోకి అపరిచితులైన మగవాళ్ళొస్తే పైట కప్పుకుని లోపలి కెళ్ళే భారత స్త్రీ, చీర తొలగి పోయి ఇంత మంది మగవాళ్ళ మధ్య ఎంత వికృతంగా, ఎంత దయనీయంగా పడుందీ!

ధరిత్రి గుండె ఝల్లు మంది.

మరోలా జరిగుంటే కొన్ని క్షణాల క్రితం తనూ, తన భర్త తన బిడ్డ అనాథులుగా, శవాలుగా ఆ పొలాల మధ్య- మరి ఊహించలేక పోయింది ధరిత్రి. కానీ వద్దనుకున్నా ఆమె నవి వదలడం లేదు. తను చనిపోతే ఇంట్లో వున్న పదేళ్ళ ప్రవీణ, పన్నెండేళ్ళ మధు ఏమయిపోయే వాళ్ళు. చెట్టు కొకరు, పుట్ట కొకరుగా, ఈయనతో చెప్పాలి- యాక్సిడెంట్ జరగదని గ్యారంటీ ఏమిటి? పసివాళ్ళని కొట్టి పారేయకుండా పిల్ల లందర్నీ కూర్చో బెట్టుకుని ఏ ఆస్థులు ఎక్కడున్నాయో చెప్పమని.

గాంధీ, అశ్విని పోలీస్‌తో ఏదో మాట్లాడి వస్తున్నారు.

ఇప్పుడు సజీవంగా నడిచొస్తున్న వాళ్ళు, తను ఆ శవాల స్థితిలో వుండాల్సిన వాళ్ళన్న మాట. వాళ్ళు కూడా కొన్ని గంటల ముందు సజీవంగా వున్న వాళ్ళే కదా!

తనని గాంధీని ఒక పాడి మీద తీసు కెళ్ళేవాళ్ళు కాబోలు- పెళ్ళి పీటల మీద కల్సిన తాము జంటగా చచ్చిపోవడం అది ఎంతదృష్టం. కానీ కార్లో అశ్విని!- ఎంత చిత్రం! తాము చనిపోయాక కూడా బిడ్డలు చనిపోకూడదనే ఫీలింగ్ న్యాయానికి అదెంత అనవసరం ఆమెకు.

"డ్రైవర్, క్లీనర్ పాపం ఎవరో జంట పెళ్ళి కెళ్ళడానికి బస్ దొరకక లారీ ఎక్కారట" చెప్తూ డోర్ మూసి క్లచ్ నొక్కి కీ ఆన్‌చేసి యాక్సిలరేటర్ కొద్దిగా యిచ్చి ఫస్ట్ గేర్‌లో కెళ్ళాడు గాంధీ.

"అది వీళ్ళకేం తెల్సు?"

"ఏమో! వాళ్ళు చెప్తున్నారు."

"ఇలాంటప్పుడు కథలు చాలా అల్లుతారు. రేపు పేపర్‌లో చూస్తే తెలుస్తుంది."

"పాపం! ఈ ప్రయాణమే లేకపోయినా, బస్ దొరికున్నా వాళ్ళిద్దరూ మిగి లుండేవాళ్ళు. పసి వాళ్ళలా వున్నారు పాపం."

"ఒ. కే. లీవిట్... యిలాటి వెన్నో!"

బుక్ తెరిచాడు అశ్విని. పడమట దిక్కున ఆకాశమంతా ఎర్రటి కాంతి. సూర్యుడు ప్రయాణాన్ని మరో దిక్కుకు తిప్పుతున్న క్షణాలవి.

హిచ్‌కాక్ కలం వదిలిన అక్షరాలు ఆ మసక వెలుతురులో కన్పించడం లేదు. పుస్తకం మూసేసాడు అశ్విని.

చాలా కష్టం మీద జనాన్ని తప్పించుకుని కాళహస్తి దాటింది కారు. హెడ్ లైట్స్ ఆన్ చేసాడు గాంధీ.

"వీడిని నెల్లూరులో చేర్చేస్తే ఏం? మాటి మాటికీ ఈ మదనపల్లి ప్రయాణాలు రైలు రూట్ లేదు." జరిగిన రెండు ఇన్‌సిడెట్స్ తాలూకు ఫోభియాతో మాట్లాడుతోంది ధరిత్రి.

"ఇంకెంతలే ఒన్ ఇయర్. వూర్కే మార్చకూడదు. ప్రొఫెషనల్ కోర్సు కెళ్తే ఎలాగూ తప్పదు. లేకపోతే డిగ్రీ సర్వోదయాలో చేర్చేద్దాంలే!"

కారు సగం రోడ్డులో కొచ్చింది. నిదానంగా పోతున్నాడు గాంధీ. ఎదురుగా లారీ వాహనం. రోడ్డు మధ్యగా దేదీప్యమానంగా హెడ్ లైట్ల కాంతి. ఎదురు రోడ్డు కన్పించడం లేదు..వచ్చే డ్రైవర్ ఒక్క ఇంచి కూడా రోడ్డు దిగడం లేదు.

"డిమ్ డిప్ వాడనే వాడరు ఇడియట్స్" కారు బాగ స్లో చేసాడు గాంధీ.

లారీ భయంకరంగా రోడ్డు మధ్యగా లైట్లు ఆరకుండా వస్తూనే వుంది. మీది మీదికి వస్తోంది.

"తాగున్నాడేమో రాస్కెల్!" భయంగా చూసింది ధరిత్రి.

గాంధీని కూడా ఆ ఫోబియా వదల్లేదు. సెకండ్



గేర్‌లో కొచ్చి రోడ్డు దిగేసి కారు ఆపేసాడు ఇంజన్ మాత్రం రన్ అవుతోంది

కావాలని చేస్తున్నాడా? కారు ఆగేలా చేసి, కారు ఎదురుగా ఆపి తమని దోచుకోవడాని కొస్తున్న డెకాయిట్స్ కాదు కదా! అందరి గుండెల్లో అదే ఆలోచన

గాందీ సిద్ధంగా వున్నాడు గాందీ కాలు యాక్సిలరేటర్ మీద సర్వ సన్నాహంలో వుంది గేర్‌మీద ఓ చెయ్యి స్టీరింగ్ మీద మరో చెయ్యి క్లచ్ మీద రెండో కాలు

ఒకవేళ అదే జరిగే పరిస్థితులే వస్తే బాగా సైడ్‌కి లాక్కుని కారుని లాగేయడమే ముందేమున్నాసరే

ఆలోచన పూర్తి కాకముందే మహారాజులాగ ఒక్క అంగుళం కూడ రోడ్డు దిగకుండా డిమ్ డిప్ కొట్టి శ్రమ డ్రైవర్ చేతుల కివ్వకుండా లారీగారు దాటి వెళ్ళి పోయారు

పొగరుబోతు వెదవ ఎంత బయపెట్టాడో!

ఎలక్ట్రానిక్ రిస్ట్ వాచ్ స్విచ్ నొక్కి టైమ్ చూసాడు అశ్విని ఇంకా ఏడన్నా కాలేదు అశ్వినిలో కూడ చిన్న బయం మరలా టీనేజ్ అబిజాత్యం తను భయపడే దేమిటని?

అందుకే తల్లి వద్దందీ తిరుపతిలో ఆగిపోదాం రేప్రొద్దునే బయలు దేరితే కాలేజీ టైం కందుకుంటాడు అశ్విని అని అన్నప్పుడు–

అంత బయపడితే ఎలా మమ్మీ? అన్నాడు

నేను మరలా రేపు మద్యాహ్నానికి నెల్లూరులో వుండాలి దరిత్రీ లేకపోతే బీమాలో దిగేసి ప్రొద్దున్నే వెళ్తే స్ట్రెయిన్ కూడా తగ్గుతుంది

కానీ దరిత్రి ఒప్పుకోలేదు గాందీ కారు బీమా డీలక్స్ లాడ్జి దగ్గర ఆగింది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

ఆపీసర్స్ క్లబ్‌లో ఎంటరయిన గాందీకి కూర్చోండి విష్ చేసి మర్యాదగా కుర్చీ ఆపర్ చేసాడు పోలీస్ సూపరిండెంట్ మిష్టర్ వేణుమాదవ్

ఎ పి యస్ పియట్ మీదే ననుకుంటాను కాపీ తీసుకుంటారా?

నో థాంక్స్

చిన్నగా నవ్వాడు వేణుమాదవ్

## భయం.. భయం

మీరేమీ అనుకోకపోతే మీరు తిరుపతి వైపుగా ఈ నెల ఆరవ తేది వెళ్తున్నారు ఓ కారు చెడిపోయి మీ సహాయం అర్థించారు మీరు ఆపకుండా వెళ్ళిపోయారు అవునా?!

గాందీకి గుర్తొచ్చింది

అది మీ కారా?

అవును

అయామ్ సారీ మీ కారనుకో లేదు

అతను చిన్నగా నవ్వాడు

దట్సాల్ రైట్ కానీ మా కాళే కాకపోవచ్చు సహాయం అవసరమైన వాళ్ళకి మన చేతిలో వున్న సహాయం చేయాల్సిన డ్యూటీ ఈ దేశ పౌరుడిగా మీకు లేదా?' నవ్వుతూనే చురక వేసాడతను

గాందీ మాట్లాడ లేదు

ఆ కారులో ఓ నిండు నెలల మనిషి కాన్పుకాక కష్టపడుతుం దనుకోండి ఆ కారు మద్యలో ఆగి పోయింది ఏ వెహికల్ ఆమెను ప్రక్కనున్న హాస్పిటల్‌కు తీసుకెళ్ళే ఔదార్యం చూపించకపోతే ఆమె ఏమయి పోవాలి?

గాంది తలవంచుకున్నాడు

ఓ హార్ట్ అటాక్ పేషెంట్ నూటారు డిగ్రీల జ్వరం ముంచు కొచ్చిన మనిషో అందులో వున్నాడను కోండి ఓ పది నిముషాలు వృదా అవుతాయని మీరనుకుని వెళ్ళిపోతే వాళ్ళ ప్రాణాలే ఖర్చయి పోతాయి కదా! మీరదే రూట్‌లో వెళ్తున్నారు మీకు ఎగస్ట్రాగా పెట్రోలు ఖర్చు కాదు హాస్పిటల్‌కు తీసుకెళ్ళను ఒక్క లీటర్ పెట్రోలు తప్ప ఏమంటారు?"

తలెత్తాడు గాందీ

మీ తిరస్కారం వల్ల నేను మరో కొంతసేపు అక్కడ నిల్చిపోవాల్సి వచ్చింది దానివల్ల కొంత కష్టమే కానీ నష్టం ఏమీ లేదు కానీ మిష్టర్ గాందీ

సర్!

ఆప్‌కోర్స్ ఐకెన్ అండర్‌స్టాండ్ అందరికీ లిప్ట్ ఇమ్మని నేను చెప్పను ఓ నిముషం సేపు కారాపితే అది అత్యవసర పరిస్థితి అయితే ఇవ్వండి లేదంటే యువర్ విల్ యండ్ ప్లెజర్ మీరు ఇవ్వాల్సిన అవసరం లేదు

కానీ సర్!

మీకెంతో అవసరంగా వెళ్ళాల్సిన పని వుండి వుండొచ్చు కానీ ఓ నిముషం అంతే అత్యవసరమైన లిఫ్ట్ కాదనిపిస్తే మీ రెళ్ళి పోవచ్చు ప్లీజ్ మీరు అపెండ్ కావద్దు

థాంక్స్! బట్ మీకు నేను చెప్పక్కర లేదు కానీ మీ కెందుకో ఆ ఆలోచన రాలేదు

వేణు మాదవ్ ఆశ్చర్యంగా చూసాడు

సర్! మీరేమీ అనుకోకపోతే దారిలో నిల్చుని దీనంగా చూస్తూ చెయ్యెత్తి కారు ఆపమనగానే ఆపగలిగే ధైర్యం మీ డిపార్ట్‌మెంట్ మా కివ్వలేదు

వాట్ డు యు మీన్ మిష్టర్ గాందీ!

మీ కర్థం కావాలి సర్! నవ్వాడు గాందీ

నిశ్చింతగా రాత్రి పూట ప్రయాణం చేయలేని రోజుల్లో ఎక్కడ రోడ్డు కడ్డంగా రాళ్ళు పెట్టి ఆపుతారో! అనే బయాన్ని గుండెల్లో నిలుపుకుని ప్రయాణం చేస్తున్న ప్రయాణీకులు కారు ఆపి లిప్ట్ యివ్వగలరంటారా?

అందరూ అలాటి వాళ్ళే వుంటారా? సన్నగా నవ్వాడు వేణుమాదవ్

వుండరు నేను ఒప్పుకుంటాను కానీ ఎదురుపడే మోసగాళ్ళ వల్ల నిజాయితీపరులను కూడా అనుమానిస్తున్నట్టే– తప్పదు సార్ దారి దోపిడీ వాళ్ళను మీరు హతమార్చందే ప్రయాణీకులు రెండు విదాలుగా నష్ట పోవాల్సిందే!

అతను మాట్లాడ లేదు రెండు విదాలు అనే పదంమీద ఆలోచిస్తున్నట్టున్నాడు

మీకు లిప్ట్ యివ్వకుండా వెళ్ళిపోతున్న మా అసహాయతకు చింతించాల్సిందే ఇంకో నాలుగు గజాల దూరం వెళ్ళాక ఏమో! మా వెహికల్ ఆగిపోవచ్చు అలాంటప్పుడు సహాయం అందక అల్లాడి పోవచ్చు

వెల్ మిష్టర్ అతను నిట్టూర్చాడు

ఐ కెన్ అండర్‌స్టాండ్ యువర్ పియర్స్ కానీ వాళ్ళను నామరూపాల్లేకుండా చేయడానికి మేము ప్రయత్నిస్తున్నాం

నేను కాదనడం లేదు సర్! కానీ మీరేమీ అనుకోకపోతే అపార్థం చేసుకోకపోతే

చెప్పండి ఐ ఆల్‌వేస్ వెల్‌కం గుడ్ సజెషన్స్ సందేహించకండి మీరు చెప్పేది నేను మంచి సెన్స్‌తో తీసుకుంటాను

మీరు దారిదోపిడీ మనుషుల్ని ఎంతో శ్రమ తీసుకుని నామ రూపాలు లేకుండా చేయక్కర లేదుసర్ మద్దతు ఇచ్చేవాళ్ళున్నపుడు తప్పులు చేసే వాళ్ళకు కొదవేముంది? మీ డిపార్ట్‌మెంటులో వుండే కలుపు మొక్కల్ని ఏరేసి డిపార్ట్‌మెంటు నుండి తొలగించండి అప్పుడు దారికాచే వాళ్ళు మీకు మచ్చుకు కూడా కన్పించరు

ఆలోచనలో పడిపోయాడతను గాందీ లేచాడు అతనికి విష్ చేసి వీడ్కోలు తీసుకుని అర్థాంతరంగా కారెక్కాడు 






## ఎం బి ఆర్ భిలాయి

★ మీకు నచ్చని పని మీచేత జబర్‌దస్తీగా చేయిస్తే మీరెలా ఫీలవుతారు?

● ఇప్పటి వరకూ అలా ఎవరూ చేయించలేక పోయారు ఇకపై చేయించకలరని నేను అనుకోడంలేదు!

★ ప్రశ్నావళిలో మీరు స్వతంత్రులా? పత్రికవారి ఆంక్షలు నిరోధాలు వుంటాయా?

● ఈ విషయంలో నేను సర్వస్వతంత్రురాలిని పత్రికారంగంలోకే పెద్దమనిషి మా బాస్‌మాన్ ఇప్పటిదాకా ఏ ఆటంకాలూ -పెట్టని సంపాదకులు

## ఎన్ కె ఆర్, పర్లాకిమిడి

★ ఒకే జాతి ఒకే మతం ఇది భారతీయ సిద్ధాంతం ఇది సార్థకమయ్యే దెప్పుడు?

● జాతి - మతం మరిచి జాతీయతకే ప్రాధాన్యత యిచ్చినప్పుడు

★ మనోబలాన్ని మించిన శక్తి ఏది?

● డబ్బు!

## ఎస్ ఎం ఆర్, కాశీబుగ్గ

★ టీ కప్పులో తుపాను అంటారు దాని అర్థం ఏమిటి?

● చిన్న విషయానికి పెద్దగా దెబ్బలు టు పెంచుకోవడం అని దీని భావం

★ వరకట్నంపై మీ అభిప్రాయం?

● కక్కుర్తికి చిహ్నం అని

## ఎస్ బి, కోటబొమ్మాళి

★ అక్కా నాకు సినిమాలంటే ఎక్కువ పిచ్చి దీనికి కారణం ఏమిటి? తగ్గే మార్గంలేదా?

● ఉంది కాస్త శ్రమపడాలి మీకు సినిమాలొక్కటే వినోదం అనే అపోహ వుంది దాన్ని ముందు తరిమికొట్టండి సినిమాలు చూడడం సినిమా పాటలే వినడం సినిమా పేపర్లు చదవడం సినిమా కబుర్లే చెప్పడం నేటి యువత ధ్యేయంగా కన్పిస్తుంది ఒక్కసారి బాలమురళి గాత్రం ఏసుదాసు కచేరి చిట్టిబాబు వీణ, మంచి నాటకం (వేస్తుంటే!) లాంటివి అలవాటు చేసుకోండి సినిమా పిచ్చి అదే తగ్గిపోతుంది అయితే ఇదంత సులభంకాదు తాగేవాడికి లాగే రేపట్నుంచి అనుకోకూడదు అనుకున్న క్షణం అమలులో పెట్టి అదో వ్రతంలా చేయడం ప్రారంభించాలి! మీ తరమా? ఆలోచించుకోండి మరి

## మధు, అంబుసోలి

★ ఆడదానికి ఎంత అందం వున్నా కట్నం మాత్రం తీసుకోవడం మానరెందుకు? అలాటప్పుడు అందం ఎందుకు?

● మగవాడి పౌరుషం లేమికి చిహ్నం కట్నం అడగడం అందంగా వుంటే కాస్త తక్కువిచ్చినా పరవాలేదనీ లేకుంటే కాస్త ఎక్కువిస్తే - సరనీ అనుకుంటాడో ఏమో నాకు తెలియదు!

★ నేను నిరుద్యోగిగా వున్నప్పుడు ప్రేమించాను నా ప్రేమను అంగీకరించలేదు నాకు ఉద్యోగం దొరికిన తరువాత మళ్ళీ ప్రేమించాను అంగీకరించింది ప్రేమ స్వార్థం కోరుతుందా?

● కాదు బువ్వ కోరుతుంది

## కె కె, లక్ష్మీదేవిపల్లి

★ పొరుగింటి పుల్లకూర రుచి అంటారు ఎందుకంటారు?

● ఎందుకేమిటండీ బాబూ ఎప్పుడూ మనింటి దానికంటే పక్కింటావిడా పొరుగింటావిడా అందంగా నేర్పరిగా ఎందుకు కన్పిస్తుంది?! అలాగే ఇదీను - ఇంటి వంటకంటే పొరిగింటి పోరట రుచిగా వుంటుందేమో

## ఎస్ డి ఎమ్, ఒంగోలు

★ అశ్లీల పదజాలంతో వస్తున్న సినిమాలు వీధి పోరాటాలతో హోరెత్తి పోతున్న రాజకీయాలు మీ అభిప్రాయం?

● అవేకదా ప్రేక్షకులు కోరే ఉత్తమ కథాంశాలు!

## ఎస్ కె, కడప

★ పెళ్ళి అయిన ఆడవారిని ప్రేమిస్తే తప్పా?

● తప్పుకాదు - ఇద్దరూ పాత పెళ్ళికి స్వస్తి చెప్తే! లేకుంటే అది వ్యభిచారమే అవు గాని ప్రేమకాదు

## టి జె ఆర్, విజయవాడ

★ ప్రేమికులు చిలకాగోరింకల్లాగా దంపతులు సీతారాముల్లాగా అభివర్ణిస్తారెందుకు?

● చిలకలూ - గోరువంకలూ గొలగొలగా ముద్దు ముద్దుగా వుంటాయి సీతారాములు కష్టాలూ సుఖాలూ కలసి పంచుకున్నవాళ్ళు అందుకు

## ఎమ్ ఎస్ ఎన్, అన్నవరం

★ ఎవరినైనా సన్మానిస్తూ దుశ్శాలువతో సత్కరించారంటారు అంటే చెడ్డ శాలువ అనా అర్థం

● కాదు - జోడు శాలువలని' కాని ఒకటే కప్పుతారు ఎందుకో తెలియదు అయినా యీ శాలువా కప్పడం జెయంట్ సైజు సన్మాన పత్రాలు చదివించడం పూర్ రైటర్స్‌కి శుద్ధ దండుగ అది పెట్టుకుందుకు స్థలం లేక యిబ్బంది పడడమే గాని మరొకటికాదు మనస్సులో వున్న గౌరవాదరణలని చూపడానికి ఇంకో దారి వెతకాలి

★ సన్మానాలు యీ రోజుల్లో మామూలైపోయాయి చాలాచోట్ల డబ్బిచ్చి చేయించుకుంటున్నారని వింటున్నాం అదేం గొప్ప?

● నాకూ సన్మానం చేశారుగాని నన్నెవరూ డబ్బు అడగలేదు అంచేత డబ్బిచ్చి చేయించుకొనే సన్మానాల గురించి నాకు తెలియదు ఇక ఇవి మామూలై పోవడం అంటారా? ఏం చేస్తారు - ఇదొక్కటే చౌక!

★ మీకేమైనా బిరుదులు వున్నాయా?

● ఆ! పరమ గయ్యాళి తాటకి, మొండి, ఇత్యాదులు

## ఎ ఏ, ఎ పి, ఏలూరు

★ జీవితం జీవించడానికా? ఏదైనా సాధించడాకా?

● పిచ్చి తల్లీ ఈ రోజుల్లో బ్రతికి వుండకల్గడమే గొప్పగా సాధించడం

★ సాధించదల్చుకున్నప్పుడు - ఆత్మవంచన చేసుకునైనా అది సాధించవచ్చా?

● అది సాధనకాదు అప్పుడు 



సీరియల్



ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

సూచనప్రాయంగా తన ఉద్దేశ్యాన్ని తెలుపుతూ తండ్రికి ఉత్తరం రాసి సుదని పంపమంది రాజ్యలక్ష్మి

ఉత్తరం చేరిన వారం రోజుల్లో ఇంద్రాపూర్ వచ్చింది సుద

హాయ్ అక్కా! హవార్యూ!? అంటూ రాజ్యలక్ష్మిని చుట్టుకుంటున్న సుదను మంటగా చూశాడు చంద్రరావు

ఫైన్! అంటూ భర్త కళ్ళలో కనపడుతున్న అసూయకు నవ్వుకుంటూ తమరు కోర్టు కెళ్ళరా? అన్నది రాజ్యలక్ష్మి

ఇదిగో వెడుతున్నాగా! సుదా ప్రయాణం బాగా జరిగిందా? అన్నాడు చంద్రరావు

ప్రయాణానికి బాగేమిటి బావా! అందులో మీ ఊరికి! ఆ బస్సులో ఆ గతుకుల్లో ఎగిరెగిరి పడుతూ ఏదో నేను కాబట్టి వచ్చాను పీలింగ్స్ మార్చేసుకుంటూ అన్నది సుద

మిగతా వాళ్ళంతా బస్సు బయల్దేరంగానే దిగిపోయారా?

ఎందుకు దిగిపోతారు?

నేను కాబట్టి వచ్చాను అని నువ్వంటుంటేనూ

సరేలే! గొప్ప జోకే! వాళ్ళూ నాలాంటి వాళ్ళే అందుకనే చస్తూ బతుకుతూ అంతా అందులో నే ప్రయాణిస్తున్నారు రాజ్యలక్ష్మి సుదనే చూస్తోంది

విజయ్ దృక్పదంతో అన్నట్టు పరిశీలనగా చూస్తోంది తెల్లని శరీరచ్ఛాయ మెత్తగా సిల్కులాగా ఉన్న నల్లని ఒత్తయిన తలకట్టు అందమైన స్ట్రక్చరు చిన్న నోరు చురుకైన కళ్ళు

జరిగినకథ - 3 బ్లూ స్టార్ హోటల్ యజమాని రంగారావుకు ఎన్నో అక్రమ వ్యాపారాలుంటాయి కొత్త డి ఎస్ పి విజయ్ హోటల్‌మీద దాడి చేసి శాసనసభ్యుడు దర్మారావును, రౌడీ నాగును అరెస్టు చేస్తాడు అక్కడ అనూహ్యంగా వైజయంతి కనబడి మాయమవుతుంది చమన్‌లాల్ జూయలరీ షాప్‌లో జరిగిన దోపిడీ కేసులో విజయ్ నాగును అరెస్టు చేసి నగలు స్వాధీనం చేసుకుంటాడు నాగు తప్పించుకుని అడవిలోకి పారిపోగా వెంటాడిన విజయ్ నాగును పట్టుకోబోయేంతలో జీపు ఫెయిలయి విఫలమవుతాడు చంద్రరావు రాజ్యలక్ష్మి విజయ్‌కి సుదనిచ్చి పెళ్ళి చేయాలనుకుంటారు

చలాకీగా ఆరోగ్యంగా నిగనిగలాడుతున్న చెల్లెల్ని చూసుకుని తృప్తిగా తల పంకించింది రాజ్యలక్ష్మి విజయ్ దీన్ని కాదనడు అయినా తన జాగ్రత్తలో తానుండి ముందుగా వేసుకున్న ప్లాన్‌ని అమలు చెయ్యటమే బెటరు

చంద్రరావు వెళ్ళిపోయింది కూడా గమనించకుండా తననే తదేకంగా చూస్తున్న రాజ్యలక్ష్మిని వింతగా చూసింది సుద

ఏమిటే? కొత్త దాన్ని చూసినట్టు అలా పట్టి పట్టి చూస్తూ మధ్యలో బేష్! అన్నట్టు తల కూడా పంకిస్తున్నావు? ఏం కథ? అన్నది సుధ కళ్ళెగరేస్తూ

విజయ్ గురించీ తమ ఉద్దేశ్యం గురించి చెప్పింది రాజ్యలక్ష్మి

ఎవరూ? ఆ బుంగ మీసాలు గరగర కంఠం ఎప్పుడూ ఏదో కొంపలంటుకుపోతున్నట్టు గంభీరంగా మొహం గంటు పెట్టుకుని మాట్లాడితేనే నోటి ముత్యాలు రాలిపోతాయన్నట్టు మూతి గట్టిగా బిగించుకుని ఉంటాడు అతనే నా విజయ్ అంటే?

ఓసి ఇడియట్! ఎవరు చెప్పారే నీ కివన్నీ? ఎప్పుడు చూశావతన్ని?

అదిగో, ఆ డ్రాయరు మీద పొటోలో బిగించబడ్డ శాల్తీయేగా? గండుపిల్లి మొహం అతనూను

నోర్మూయ్! అతనెంత బావుంటాడో తెలుసా? హుందాగా గంభీరంగా ఉన్న ఆ మొహాన్ని పట్టుకుని గండుపిల్లి మొహమంటావా! రేపు చూపిస్తాను చూడు ఎలా ఉంటాడో

నవ్వటం చేతనవునా అతనికి? లేక ఎక్కడయినా నవ్వుల ట్రయినింగ్ సెంటరుందేమో వెతికి పట్టుకోవాలా

అతని విషయంలో ఇంకోసారిలా అధ్వంగా పేలావంటే తంతాను

బావ ఎదురుగా కూడా అతన్ని అలాగే పొగడుతున్నావా?

ఏం పొగిడితే?

ఊరుకుంటున్నాడా నీ పతి దేవుడు?

ఏం చేస్తారు ఊరుకోక?

పుట్టింటికి పంపేస్తానని బెదిరించలా?

అల్లాంటి బెదిరింపులకి నేను లొంగనులే

అదీ సంగతి అయినా రాగానే కాళ్ళకు నీళ్ళిచ్చి కాఫీ తాగమని గద్దం పట్టుకు బ్రతమాలి క్షేమ సమాచారాలడక్కుండా ఆ విజయ్ గురించి టకటకా నా నెత్తిన మోదేస్తున్నావేమిటి?

ఇంతకీ  ఏమిటి నీ తాపత్రయం? నేను అతన్ని చూసిన వెంటనే అతని అందచందాల కబ్బురపడిపోతూ నా అంగీకారం ప్రకటించి తీరాలి అంతేగా?

అంతే

ఎంత ఖచ్చితంగా చెపుతున్నావే! నాకూ ఒక మనసుంటుందనీ

ఉందిలే మాలావు  బోడి మనసు

ఇలాంటి బూర్జువా బావాలకు నేను తల ఒగ్గను

ఒగ్గకపోతే ఒంచి పారేస్తాను

మై గాడ్!

లేకపోతే ఏమిటి? అతన్ని కాదన్న ఆడపిల్ల పరమ మూర్ఖురాలని నా అభిప్రాయం నా చెల్లెలు అలాంటిది కాదని నాకు తెలుసు

కొట్టకు తల్లీ! ఓ సారి అతన్ని చూడనివ్వు తరవాత తీరికగా వాదించుకోవచ్చు ఈ లోపున ఏవైనా విశేషాలు చెప్పక్కా గారంగా అన్నది సుధ

ఆ మాటా ఈ మాటా చెపుతూ సంబాషణని తిరిగి తిరిగి విజయ్ మంచితనం గుణగణాలు మొదలైన వాటి మీదికే మళ్ళిస్తున్న అక్కను చూసి నవ్వుకుంది సుధ ఆమె అంతే రేపు తను అతన్ని చూసి నువ్వు చెప్పింది నిజమే నక్కా! నీ



# డి.ఎస్.పి. విజయ్

ఇష్ట ప్రకారమే కానివ్వు అనే వరకూ ఇలా లాగుతూనే ఉంటుంది

చంద్రావీ సంగతి ఎత్తకుండా సుద చదువు గురించి, వాళ్ళ వూరి విశేషాలు గురించీ మాట్లాడుతుంటే మద్య మద్య తను అడ్డుపడుతూ అతని చేత కూడా విజయ్ సంగతులే చెప్పించటానికి ప్రయత్నిస్తోంది రాజ్యలక్ష్మి

అబ్బా! నిద్రొస్తూందక్కా నాకు అంటూ విసుగ్గా ఆవలిస్తున్న సుదని చూసి సరే పడుకో రేపు మాట్లాడుకుందాం అన్నదామె

తెల్లారి ఏడు లోపలే విజయ్‌కి ఫోన్ చేసి అతన్ని తమ ఇంటి కాహ్వానించింది రాజ్యలక్ష్మి

సారీ! ఒక కేసు విషయంలో బిజీగా ఉన్నాను ఈ రోజు కుదరదు అన్నాడు విజయ్

ఎప్పుడు వీలవుతుంది? నిరుత్సాహంగా అడిగింది రాజ్యలక్ష్మి

ఇంకా నాలుగయిదు రోజుల తరవాతయితే చెప్పగలను

ఓహ్! రేపు కూడా కుదరదా!

సారీ అండీ! నాలుగు రోజుల దాకా అస్సలు కుదరదు సండే రావటానికి ప్రయత్నిస్తాను మర్యాదగా అన్నాడు విజయ్

సరే! ఆ రోజు ఉదయం మళ్ళీ ఫోన్ చేస్తాను

అలాగే

అతనికి ఆదివారం దాకా తీరదట నిస్పృహగా అన్నది రాజ్యలక్ష్మి

పోన్లే! ఆదివారమే రానియ్యి ఇప్పుడేం మునిగిపోయింది? అన్నది సుద

నీ మొహం! నా ఆదుర్దా నీ కర్థం కాదు

ఆమె ఆరాటం చూస్తుంటే నవ్వొస్తోంది సుదకి ఇంకా రెచ్చగొట్టాలని పిస్తోంది

అయినా అదేం మనిషక్కా!? అలాంటి వాడిని కట్టుకుని నేనేం సుఖపడతాను? అన్నానికి రండీ అంటే ఆదివారం దాకా ఆగు అంటాడేమో! విచారాన్నభినయిస్తూ అన్నది సుద

నీ కసలు బొత్తిగా బయం లేకుండా పోతోందే! అమ్మ మరీ గారం చేస్తున్నట్టుంది రేపు అతని ఎదురుగా కూడా ఇలాగే సీమ టపాకాయలా పేలు చెపుతా నీ పని బెదిరింపుగా అన్నది రాజ్యలక్ష్మి

విజయ్ చెప్పిన ఆదివారం వచ్చింది

రాజ్యలక్ష్మి అతనికి ఫోన్ చేసింది మళ్ళీ ఏం అడ్డు పుల్ల పెడతాడోనని అనుమానంగా ఉందామెకు

ఒస్తాలెండి అన్నాడు విజయ్

ఆమె మొహం వికసించింది




అతనొస్తానన్నాడు అంటూ ఏమేం ఒండుదామే? అని చెల్లెల్ని సలహా అడిగింది

ఏమో! నీకే తెలియాలి అతనేం తింటాడో నువ్వే మొండుతావో అన్నది సుద

ఒక వేపుడు ఒక ముద్దకూర టమేటా పప్పు ములక్కాడ సాంబారు అప్పడాలు ఆవకాయ పెరుగు ఇవికాక పులిహోర వడ సేమ్యా పరవాన్నం చేస్తాను ఏం? అన్నది రాజ్యలక్ష్మి

అతనిది కడుపా బానా?! ఇన్ని ఐటమ్సా! మహానుబావుడు రోజు రోజంతా కూర్చుని ఇవన్నీ లాగిస్తుంటాడా? తిన్నాడంటే యమా తిండి తింటాడు కాబోలు! మళ్ళీ వారం రోజుల్దాకా దిగుల్లేకుండా అన్నది సుద

నువ్వతన్ని లాగే మాట మాటకీ ఎద్దేవా చేశావంటే చంపుతాను

ఊరికే మర్యాద కోసం చేస్తాం గానీ ఇవన్నీ అతను తింటాడనా? అసలతను తిండి చాలా సింపుల్‌గా తింటాడు

మరయితే నువ్వు కూడా సింపుల్‌గానే చెయ్యరాదూ?

ఏం బావుంటుంది? అతను తినడని సరిగ్గా మొక్కుబడిగా తినేవే రెండు చేసి ఊరుకుంటామా?

ఊరుకుందాం

నీకు తెలీదు నువ్వూరుకో

అది కాదక్కా

ఆ పార్మాలిటీస్ నీ కర్థం కావు గానీ బెండకాయలు చక్రాల్లా తరుగు బంగాళా దుంపలు కడుక్కురా కొబ్బరి తురుము మినప్పప్పు నువ్వు గాలించి పనిపిల్లకివ్వు అది రుబ్బుతుంది దానికి సరిగ్గా గాలించటం రాదు

పప్పు గ్రైండర్లో పడేస్తే పోలా? అది రుబ్బుట మెందుకు? అరగంట పడుతుందా పనికి ఈ లోపున ఇంకో పది పన్లు చేయించొచ్చు దాని చేత

గ్రైండర్లో వేస్తే బాగోదు అన్నట్టు ఫిల్టర్లో డికాషన్ వెయ్యి అతను రాగానే ముందు కాఫీ ఇద్దాం

ఏంటో పెద్ద అతనేదో వి ఐ పి లాగా! పెళ్ళి కొడుకనగానే అనవసరంగా' ఇంత ప్రిపరెన్సిచ్చి నెత్తినెక్కించుకుంటారు దాంతో వాడు నెత్తినెక్కి కూర్చుని గొంతానమ్మ లాగా స్కూటర్ కావాలి ఫ్రిజ్ కావాలి అంటూ అడ్డమైన కోరికలూ కోరుతూ ఉంటాడు అసలు పాల్ట మనలోనే ఉంది

అది కాదక్కడ పాయింటు ఇలా నానాహంగామా చేస్తూ ముందుగానే వాడి చుట్టూ ఉచ్చులు బిగిస్తామన్నమాట అందులో ఇరుక్కుని ఊపిరాడక యస్ అనేస్తాడని ఆశ అన్నాడు చంద్రావు

మీ పాయింట్లకో నమస్కారం గానీ మీరు దానికి మద్దతివ్వబోకండి ఇంకా పేట్రేగిపోతుందది అని విసుక్కుంటూ హైరాన పడిపోతూ వంటింటిని కదనరంగంగా మార్చేసి చేతులతో పాటు నోరు కూడా ఉపయోగిస్తూ వీరవిహారం చేస్తున్న రాజ్యలక్ష్మిని చూస్తుంటే నవ్వొస్తోంది సుదకి సరదాగా కూడా ఉంది

మొత్తానికి అన్నీ పూర్తి చేసేసరికి పన్నెండు దాటింది

ఇదేమిటతనింకా రాలేదు? మీరోసారి ఫోన్ చెయ్యండి మళ్ళీ అని చంద్రావుకు పురమాయించి నువ్వెళ్ళి మొహం కడుక్కురా! జిడ్డోడుతోంది అతనొచ్చేసరికి కాస్త ఫ్రెష్‌గా ఉండు అన్నది రాజ్యలక్ష్మి సుదతో

స్నానం చేసి సన్నని పూలున్న ఆర్గండీ చీర కట్టుకొచ్చిన సుదను అసంతృప్తిగా చూస్తూ నాది కాశ్మీర్ సిల్కు చీర కట్టుకోవే ఆ చీరేమిటి? పాత చీరలా ఉంది చంద్రహారం వేసుకో అన్నది రాజ్యలక్ష్మి

తల్లీ! నీ చీరలకీ నగలకీ ఓ దణ్ణం నా సింగారాన్ని మాత్రం నువ్వు నిర్దేశించకు అన్నది సుద ఖచ్చితంగా

అలాగే బావుంది సింపుల్‌గా అవన్నీ సింగారించుకుంటే ఇదేదో పెళ్ళి చూపుల వ్యవహారమని అతను ముందే పసి కడతాడు అన్నాడు చంద్రావు

మరే అసలే అతను పోలీస్

వాసనతోనే అన్నీ పసి కడతాడు అంటున్న సుద అక్కగారు ఉరిమి ఛూడటంతో టక్కున నోరు మూసుకుంది పన్నెండున్నర కొచ్చాడు విజయ్

అంతా డ్రాయింగ్ రూంలో కూర్చున్నారు పరిచయ కార్యక్రమాలు

పూర్తయాక ఏం చదువుతున్నారు? అన్నాడు విజయ్

బి ఏ ఫైనలియర్ అన్నది సుద

ఏం గ్రూప్?

సి యి సి

ఇంకేం అడగాలో తోచలేదు విజయ్‌కి చంద్రరావుతో మాటల్లో పడిపోయాడు

రాజ్యలక్ష్మి కల్పించుకుని సుదను కళ్ళతో ప్రోత్సహిస్తూ సంబాషణను ఇటు తిప్పటానికి ప్రయత్నించసాగింది ఇదంతా ఏదో గూడుపురాణీలా ఉందనుకుంటాడెమో అని అనుమానంగా ఉంది సుదకి

విజయ్ క్యాజువల్‌గా నాలుగు మాటలు మాట్లాడాడు తనతో సంబాషణను పెంచాలనే తహతహ అతనికి లేదు అక్క ఊహించినట్లు తన అందానికతను చిత్తయిపోలేదు తన ప్రత్యేకత నతను గుర్తించలేదు రాజ్యలక్ష్మీ చంద్రరావులతో మాట్లాడినట్లే తనతోనూ మాట్లాడుతున్నాడు ఆ మాట కొస్తే వాళ్ళతోనే ఎక్కువగా మాట్లాడుతున్నాడు ఇదంతా సుదకు అర్ధమవుతూనే వుంది

అతని నిర్లక్ష్యం ఆమెకు ఆకర్షణీయంగా ఉంది నిజంగానే అతను బావున్నాడు!

కానీ అతను బహుశా అంత తేలికగా తనను పెళ్ళి చేసుకోటానికి సుముఖత చూపించకపోవచ్చు అనిపిస్తోంది సుదకు

విజయ్ ప్రవర్తన ఆమెలో అహానికి తగిలి పట్టుదలను పెంచుతోంది ఎలాగైనా అతన్ని గెలుచుకోవాలనిపిస్తోంది

అతని డిపార్ట్‌మెంటు విషయాలు కేసులు మొదలైన వాటి గురించి అడిగి సంబాషణలో ఇంట్రస్ట్ తేవాలని ప్రయత్నించిందామె

ఆ ప్రయత్నం పలించింది

ఆ ప్రసంగం వచ్చేసరికి అతనిలో ఉన్న స్తబ్దత సంకోచం వదిలిపోయాయి ఫ్రీగా మాట్లాడసాగాడు కొత్త బెరుకు తగ్గటంతో సుద కూడా చురుగ్గా అనేక విషయాల గురించి ప్రశ్నించి అతనితో మాట్లాడిస్తోంది ఉండీ ఉండీ జోక్స్ వేసి అతన్ని నవ్విస్తోంది

చెల్లెలి తెలివితేటలు ఇప్పుడు బాగా నచ్చాయి రాజ్యలక్ష్మికి

బోజనాల దగ్గర విజయ్ చాలా తక్కువగా తినటం చూసి అదేమిటలా తింటున్నారు? మీరు తప్పనిసరిగా ప్రతి ఐటమ్‌నూ టేస్ట్ చేసి తీరాల్సిందే మా అక్క మీ కోసం రాత్రి నుంచీ మొదలెట్టి వండిందివన్నీ విజయ్ పళ్ళెంలో పులిహోర వేస్తూ అన్నది సుద

రాత్రి నుంచీ మొదలెట్టారా! ఆశ్చర్యంగా చూశాడు విజయ్ అప్పటికే చంద్రరావు కొన్ని పదార్థాలను ముక్కు దగ్గర పెట్టుకోటం చూసి అలాంటి బయాలొద్దులే బావా! రాత్రి నుంచీ అంటే నా ఉద్దేశ్యం అది కాదు రేపేం చెయ్యాలి అని ఆలోచించటం ఎలా చెయ్యాలి అని చర్చించటం లాంటి ప్రాతమిక చర్యలన్నీ రాత్రి నుంచే మొదలెట్టింది అక్క అన్నది సుద

అమ్మో! బ్రతికించారు మీరిద్దరూ కలిసి ఇవన్నీ రాత్రే చేసి మూతెట్టారేమోనని హడిలిపోయాను అన్నాడు చంద్రరావు

జోక్ బావుంది' అని నవ్వబోతున్న విజయ్ ఆగిపోయి అవునూ నేను బోజనానికొస్తున్నానని ఈ రోజు ఉదయం కదా చెప్పాను? మీరు రాత్రి నుంచే ఎలా ఆలోచిస్తున్నారు? అన్నాడు

అదీ! అలా అడుగు పొద్దుట్నుంచీ పేత్రేగిపోతున్నా రిద్దరూ అన్నది రాజ్యలక్ష్మి

ఛ! ఇంత ఘోరంగా ఫెయిలవుతాననుకోలేదు సుమా! అయినా ఇలాంటి లా పాయింట్లు లాగాల్సింది మా బావ-కదా? ఆ డ్యూటీ మీరెందుకు చేశారు? అని దబాయించబోయింది సుధ

ఇలాంటి పాయింట్లు పోలీసాఫీసర్లే లేవదీస్తారు లాయర్లు కేసొస్తేనే ఎలర్ట్‌గా అవుతారు పోలీసాఫీసర్లెప్పుడూ ఎలర్ట్‌గానే ఉంటారు అన్నాడు విజయ్

గొప్పే అన్నట్లు పెదాలు పక్కకు సాగదీసి ముడిచిన సుద ఉక్రోషాని కంతా నవ్వేశారు



## కార్టూనిస్టులకు సూచనలు !

- ★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి
- ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్ధవంతంగా వుండాలి !
- ★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి
- ★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు
- ★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- ★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి
- ★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి కాపీ కార్టూన్‌లు పంపరాదు

## డి. ఎస్. పి. విజయ్

సాయంత్రం సినిమాకెడదాం ఫస్ట్‌షోకి అన్నది రాజ్యలక్ష్మి

నాకు వీలవదండీ! పనుంది అన్నాడు విజయ్

ఆదివారమేగా?

మాకేం ఆదివారం? ఆదివారాలు పండగలు అంటూ ప్రత్యేకమైన విశ్రాంతి దినాలుండవు మాకు

వీలవదా?

ఏమీ అనుకోకండి ఈ పూటయినా మీరు నొచ్చుకుంటారని వచ్చాను గానీ నిజానికి ఒక్కక్షణం కూడా తీరిక లేదు నాకు మరి నేనింక వస్తాను అంటూ లేచాడు విజయ్

మళ్ళీ ఎప్పుడు దర్శనం? అన్నది రాజ్యలక్ష్మి

ఎప్పుడో ఇలాగే ఉల్కలాగా రాలి పడుతుంటాను

ఉల్కలా మీ అంతట మీరేం రాలిపడలేదివ్వాళ అన్నది సుద

ఓడిపోయాన్లెండి ఇందాకటి గెలుపుకీ ఈ ఓటమికీ చెల్లు అన్నాడు విజయ్ నవ్వుతూ

సుద ఇంకా కొన్ని రోజులుంటుంది అది వెళ్ళే లోపల సప్లయ్ కెనాల్ అవతలున్న తోటల్లోకి పిక్నిక్ కెడదాం సరదాగా బావుంటుంది ఇంత క్రితం చూశారా? అన్నది రాజ్యలక్ష్మి

లేదు అన్నాడతను

అక్కడున్న చారిత్రక శిథిలాలు చూడవలసినవి శివాలయం చాలా అద్భుతంగా ఉంటుంది ఇవన్నీ ఆ తోటల పక్కనే ఉన్నాయి

అయితే ఈ సారి ఆదివార మెడదామా? ఉత్సాహంగా అన్నది సుద

చెప్పాగా, ఆదివారాల ప్రత్యేకత మాకు లేదని అన్నాడు విజయ్

మరెప్పుడెడదాం?

వీలయినప్పుడు తప్పకుండా వెడదాం

నే వెళ్ళే లోపల వీలవుతుందా?

అవాలనే కోరుకుందాం

నేను ప్రతి ఉదయం ఫోన్ చెయ్యనా?

మైగాడ్! ఎందుకు?!

ఆ రోజు వీలుగా ఉందేమో కనుక్కోటానికి

ఆ పని మాత్రం చెయ్యకండి నాకు గిల్టీగా ఉంటుంది పొద్దున్నే ఫోన్ వేపు చూడాలంటే బయమేస్తుంది

మరెలా?

నేనే చెపుతాను

మర్చిపోను ఇహ వస్తాను అంటూ వెళ్ళిపోయాడు విజయ్

"ఎలా ఉన్నాడు? నీకు నచ్చాడా?" ఆతృతగా అడిగింది రాజ్యలక్ష్మి.

"మనిషి బావున్నాడు. కానీ... భయమేస్తోంది" కొంటెగా అన్నది సుధ.

"భయమెందుకు?!"

"ఎప్పుడు పలకరించినా "డ్యూటీ డ్యూటీ" అంటూ ప్రాణాలు తోడేస్తాడేమో! తిండీనిద్రా అచ్చటా ముచ్చటా ఏం లేకుండా రాయిలా పడుండే మనిషిని కట్టుకుని ఏం సుఖపడగలనూ అని

అతని జాబ్ అలాంటిది

పోన్లెద్దూ! ఇంకో జాబ్‌లో ఉన్న వాణ్ని చేసుకుంటాన్లే

నీకిదంతా తమాషాగా ఉందా? డి ఎస్ పి విజయ్ అంటే ఎంత హోదా ఎంత దర్జా ఆదర్శవాదీ కట్నకానుకల కోసం డిమాండ్ చేసేవాడు కాదు గనక ఆశపడుతున్నాం ఇంత ప్రయత్నం చేస్తున్నాం

ఇంకో జాబ్‌లో ఉన్న వాళ్ళు మాత్రం ఇరవై నాలుగ్గంటలూ పెళ్ళాన్ని కావలించుక్కూచుంటారని గ్యారంటీ ఏమయినా ఉన్నదా?

మనసులో ఆ బావం ఉండాలి గానీ ఉద్యోగాన్ని బట్టి రాదది ప్రాక్టికల్‌గా ఆలోచించటం నేర్చుకో

పొద్దస్తమానం నీ కొంగు పట్టుకు తిరిగితే అది మాత్రం ఎలర్జీ కాదూ? నిజంగా విజయ్ లాంటి వాడు దొరకటమే అదృష్టం

బాబోయ్ ఇహ ఆ పక్కా నేనూర్కో తమాషా కంటుంటే నువ్వింత సీరియస్‌గా తీసుకుంటా వెందుకూ? అన్నది సుద

పైకి అలా అంటోంది గానీ మనసులో ఆమెకూ విజయ్ పట్ల ఆకర్షణగానే ఉంది అతను తన అందాన్ని గుర్తించ లేదనీ దుగ్ధ కూడా ఉంది అతన్నెలాగయినా ఆకర్షించాలనే పట్టుదలా ఉంది

అతనిష్టమేమిటో తెలియనియ్యి ముందు అన్నది బింకంగా

నీ సంగతి చెప్పరాదూ? తరవాత అతని విషయం ఆలోచిద్దాం అన్నది రాజ్యలక్ష్మి

నా కిష్టమే

సరే! ఇంకోసారి కూడా మనం కలుసుకున్నాక అతన్ని అడుగుతాను

నీ ఇష్టం

* * * *

అత నొప్పుకుంటాడంటారా? ఆ రాత్రి చంద్రరావు నడిగింది రాజ్యలక్ష్మి సందేహంగా

చెప్పలేం ఒప్పుకోవచ్చు ఒప్పుకోకపోవచ్చు అతనంత తేలికగా బయట పడడు ఆ మాత్రం కంట్రోల్ అతని మనసు మీద అతనికుంది అయినా అతని విషయంలో వ్యవహారం సూటిగా సెటిల్ చేసుకుంటేనే మంచిదనిపిస్తోంది అన్నాడు చంద్రరావు

పిక్నిక్ కెళ్ళొచ్చాక నేనే అడుగుతా నతన్ని

అదే మంచి పద్ధతి అన్నాడు చంద్రరావు (ఇంకా ఉంది)




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**యం జగన్మోహనరెడ్డి, కోవెలకుంట**

మతిమరపు జ్ఞాపకశక్తి తక్కువ

జ ఉదయం సాయంత్రం బైద్యనాద్ బ్రెన్ టాబ్‌లెట్ 1 మాత్ర బైద్యనాద్ బ్రాహ్మబటి 1 మాత్ర బుద్ధవర్ధన్ 1 మాత్ర పాలతో సేవించండి తలనూనెగా బైద్యనాద్ బ్రాహ్మి తేల్ ఉపయోగించండి

**గ్రంధి లక్ష్మీసుజాత, ఇనుగంటివారిపేట, పి జ్యోతిశ్రీ, ఖమ్మం**

ప్ర తలలో చుండ్రు వెంట్రుకలు రాలిపోవడం బైద్యనాద్ సురక్తా స్ట్రాంగు ఉదయం సాయంత్రం లోనికి సేవించాలి తలనూనెగా మహాభృంగరాజ తేల్ ఉపయోగించండి

**గ్రంధి రవి, జె సీతారామమ్మ సీతానగరం**

ప్ర శరీరం బిరుసుగా ఉండును ముఖము మీద మొటిమలు అవి నల్లని మచ్చలుగా అవును

జ బైద్యనాద్ సురక్తా స్ట్రాంగ్‌లోనికి ఉదయం సాయంత్రం సేవించండి బైద్యనాద్ తువరక తేల్ (చాల్‌మొగారా) పైపూతగా రాయండి

**వి సుధ, పెదనందిపాడు**

ప్ర తలనొప్పి మాడు నొప్పి తల వెంట్రుకలు రాలటం

జ బైద్యనాద్ శిరఃశూలాది వజ్రరస 1 మాత్ర బైద్యనాద్ లఘుసూత శేఖర రస 2 మాత్రల చొప్పున ఉదయం సాయంత్రం మంచినీళ్లతో 30 రోజులు వాడండి తలనూనెగా మహాభృంగరాజ తేల్ ఉపయోగించండి

**బి శ్రీహరి, పెనుగొండ**

ప్ర వ్యాయామం చేస్తూ ఉన్నాను లావు కావడంలేదు

జ వ్యాయామం కొంచెం తగ్గించండి బలమయిన ఆహారము తీసుకోండి బైద్యనాద్ చ్యవనప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో సేవించండి

**బి విశ్వనాధరావు, హైదరాబాద్**

ప్ర నెర్వికల్ స్పొండిలైటిస్ చాలా మందులు వాడాను గుణములేదు

జ బైద్యనాద్ వాత చింతామణి త్రిశూల్ బైద్యనాద్ రాస్నాది గుగ్గులు బైద్యనాద్ మహారాస్నాది కాడాతో సేవించండి బైద్యనాద్ మహా నారాయణ తేల్ బైద్యనాద్ రుమా ఆయిల్ కలిపి మర్దన చేసి చూడండి

**యమ్ విజయలక్ష్మి, పిడుగురాళ్ల**

ప్ర వైట్ డిశ్చార్జి సంతానం లేదు పురుషులకు స్పెరమ్ కౌంటు పెరుగుటకు

జ వైట్ డిశ్చార్జ్‌కు బైద్యనాద్ లూకోనిల్ 2 మాత్రలు బైద్యనాద్ సుందరీకల్ప పొర్చు 2 చెంచాల మందుతో ఉదయం సాయంత్రం లోనికి వాడండి మగవారికి బైద్యనాద్ విటా ఎక్స్ 1 మాత్ర బైద్యనాద్ స్వర్ణ మకరధ్వజ 1 మాత్ర బైద్యనాద్ చ్యవనప్రాశ స్పెషల్‌తో లోపలకు వాడండి

**ఎ మోహనరెడ్డి**

ప్ర ఓ బి వ్యాదితో బాపడుతున్నాను

జ బైద్యనాద్ మహాలక్ష్మీవిలాస రసం బైద్యనాద్ స్వర్ణమాలినీ బసంత ఉదయం సాయంత్రం లోనికి వాడండి చ్యవనప్రాశతో వాడితే చాలా మంచిది తేలికగా జీర్ణమయ్యే పదార్ధములు మంచివి

**బి రవి, అదోని**

ప్ర వరిబీజముకు ఔషదం

జ బైద్యనాద్ వృద్ధి బాదికబటి 2 మాత్రలు బైద్యనాద్ నిత్యానందరస 1 మాత్ర చొప్పున ఉదయం సాయంత్రం బైద్యనాద్ మహారాస్నాది కాడాతో సేవించండి

**ఎ రమాదేవి (40 సం), గొల్లపూడి (విజయవాడ)**

ప్ర వ్రాస్తున్నప్పుడు కొద్ది సేపటికే నెప్పి పుట్టుచున్నది

జ బైద్యనాద్ విటా ఎక్స్ ఉదయం సాయంత్రం ఒక్కొక్క మాత్ర చొప్పున బైద్యనాద్ సుందరీకల్ప పొర్చుతో వాడండి రాత్రి పడుకోపోయేటప్పుడు ఒకసారి బైద్యనాద్ చ్యవనప్రాశ స్పెషల్ పాలతో సేవించండి మరియు బైద్యనాద్ మహామాష తేల్ అరిచేతులకు, వేళ్ళకు మాలీష్ చేయండి

**వై ప్రకాశరావు, రాజమండ్రి**

ప్ర మూలశంఖ ఫిషర్స్

జ బైద్యనాద్ పైరాయిడ్స్ 1టాబిలెట్, బైద్యనాధ కంకాయనబటి (అర్శస్సు) 1 మాత్ర ఉదయం, సాయంత్రం బైద్యనాద్ అబయారిష్టతో వాడి చూడండి

**యన్ మాధవరావు, తుని**

ప్ర ఉదయం కడుపు నొప్పితో లేవటం

జ రాత్రిపూట తక్కువ తింటే మంచిది బైద్యనాద్ శూలాంతకబటి 1 మాత్ర బైద్యనాద్ లఘుసూతశేఖర 2 మాత్రలు చొప్పున రోజుకు రెండుసార్లు బోజనం తరువాత బైద్యనాద్ ద్రాక్షారిష్టతో లోనికి సేవించండి

**వక్కలంక రామకృష్ణరావు, విజయనగరం**

ప్ర నాలికమంట ఉప్పు కారం తినలేను

జ మలబద్ధకము లేకుండా చూసుకోండి బైద్యనాధ్ సూతశేఖర రస 1 మాత్ర బైద్యనాద్‌లఘు సూతశేఖరరస 2 మాత్రలు బైద్యనాద్ సురక్తా స్ట్రాంగుతో రోజుకు రెండు సార్లు లోనికి సేవించండి

**కె వెంకటేశ్వర్లు, కరిమ్‌నగర్**

ప్ర తీసుకొనే ఆహారం పచ్చగా నీలం రంగులో వాంతి అవుతుంది కడుపు ఉబ్బరము

జ మలబద్ధకము లేకుండా చూసుకోండి పులుపు ఉప్పు కారము దూమపానం అల్కహాలు మొదలగునవి నిషేదము బైద్యనాద్ అమ్లపిత్తాంతక యోగ్ టాబ్‌లెట్సు 2 మాత్రలు బైద్యనాద్ సూతశేఖర రస 2 మాత్రలు బైద్యనాద్ సురక్తా స్ట్రాంగుతో ఉదయం సాయంత్రం రోజుకు రెండుసార్లు వాడండి

**కె త్రివాంజిబాబు, విజయవాడ**

ప్ర అరికాళ్లు అరి చేతులు చెమట తగ్గాలంటే -

జ బైద్యనాద్ చ్యవనప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో సేవించండి బోజనం తరువాత బైద్యనాద్ దశమూలారిష్టతో రోజు రెండుసార్లు వాడాలి □

**కూపన్**

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాధ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న : ..........................................................

..........................................................

..........................................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :




# అరుణకిరణం

కె.శ్రీదేవి

ఆ ఇంట్లో వాళ్ళు ముగ్గురు ప్రతి ఒక్కరికి, తక్కిన ఇద్దరూ ఆరో ప్రాణం విస్తారమైన విజ్ఞాన జ్యోతి లాటి ఆ వృద్ధురాలికి ఆ కొడుకు కోడలు అంటే వల్లమాలిన అబిమానం గంగానది లాంటి గాంబీర్యం గల ఆ కొడుక్కి జన్మ నిచ్చిన తల్లన్నా బ్రతుకిచ్చిన బార్యన్నా అంతులేని ఆపేక్ష చక్కదనాల చుక్క చందమామ రెక్కలాటి ఆ కోడలికి జీవిత మిచ్చిన బర్తన్నా ఆత్మీయత నిచ్చిన అత్తన్నా అపరిమిత మైన అబిమానం

అందులో ఏ ఒక్కరూ కూడా తక్కిన ఇద్దరి మనసుకి నొప్పి కల్గితే బరించలేరు ఇలా రాగ బావ యుక్తమైన రస రమ్య గీతంలా సాగిపోతున్న వారి సంసారంలో ఒక్కటే లోపం

బుడి బుడి నడకలతో ముసి ముసి నవ్వులతో, అల్లరల్లరిగా మురిపించే పాప ఇంకా అవతరించ లేదా ఇంట్లో ఆ తరుణం కోసం ఎదురు చూసి ఎదురు చూసి ఇక ఎదురు చూడదల్చుకో లేదా ముగ్గురు

ఒక శుబముహూర్తాన ఒక మంచి అనుభవము మంచి హస్త వాసి వున్న డాక్టరమ్మ దగ్గరకు తీసుకెళ్ళారు ఆ ఇద్దరూ కోడల్ని

డాక్టరమ్మ అన్ని టెస్టులు యదావిదిగా జరిపించి రేపు రమ్మంది ఇంక ఒక టెస్టుంది ఆశల అంబారి ఎక్కి వచ్చిన ఆ కోడలికి ఆ టెస్టు కూడా జరిపించి చెప్ప లేక చెప్పలేక చెప్పింది డాక్టరమ్మ మర్నాడు

వెరీ సారీ! నీకింక పిల్లలు కలగరమ్మా అని తను విన్నది పొరపాటేమో అని ఆ పిల్ల మళ్ళీ అడిగింది, డాక్టరమ్మని కాని మళ్ళీ అదే జవాబు వినాల్సి వచ్చింది కళ్ళు బైర్లు గమ్మాయి ఆ నిజాన్ని జీర్ణించుకో లేక పోయింది అయినా తెప్పరిల్లింది డాక్టర్ కారణం చెపుతుంటే ఇహ విన బుద్ధికాలేదా కోమలికి

నాకు పిల్లలు లేరనే బాదేం లేదు కాని డాక్టర్! దయచేసి మా వారితోనూ వారి తల్లితోనూ నాకు చెప్పిన మాట చెప్పకండి వాళ్ళిద్దరూ చాలా సున్నిత హృదయులు వారి సంగతి మీకు తెలీదు వాళ్ళు ఈ చేదు నిజాన్ని విని బరించలేరు ఏమందులో వాడండి త్వరలో నే కాన్పు వస్తుంది అని చెప్పండి లేక పోతే వాళ్ళిద్దరూ లోలోపల కుమిలిపోతారు అంది చేతులు రెండూ జోడించి

ఏమిటీ పిల్ల మనస్తత్వం పిల్లలు పుట్టరనే బెంగకన్నా బర్త, అత్తగారూ ఎక్కడ నిరుత్సాహపడి నీరసించి పోతారో అని ఆదుర్దా పడిపోతోంది అనుకుని ఆలోచిస్తూ పక్క గదిలోకి వెళ్ళింది చేతులు కడుక్కునేందుకు డాక్టరమ్మ

అక్కడ అత్తగారు నిరీక్షిస్తోంది డాక్టర్ నోటంట వచ్చే మాటకోసం అప్పుడు డాక్టరమ్మ చెప్పింది మీ కోడలికి సంతానం కలుగదమ్మా ఎందుకంటే మాట పూర్తి కాకుండానే ఆతల్లి చటుక్కున డాక్టరుగారి రెండు చేతులూ పట్టుకుని

పిల్లల్లేక పోతే పీడా పోయింది గాని ఈ మాట మాత్రం నా కోడలుతో కొడుకుతో అనకండేం వాళ్ళు అసలే పసి వాళ్ళు ఒకరి కన్న ఒకరు

ఈ మాట విని వాళ్ళిద్దరు మంచం పట్టినా ఆశ్చర్యం లేదు నేనైతే మొండి దాన్ని ఎన్నైనా భరించ గల్ను నా పిల్లాడు వేలెడంతుండగా వాళ్ల నాన్న కన్ను మూశారు అష్ట కష్టాలు పడి తల్లీ తండ్రీ నేనే అయి వాణ్ణి పెంచి పెద్ద చేశాను చదువు సంధ్య చెప్పించి ఓ ఇంటి వాణ్ణి చేశాను

నేనైతే చాలా మొండిదాన్ని ఒండదాన్ని కష్టాల్లో

ఆరితేరిన పటాన్ని వాళ్ళింకా పసివాళ్ళు దేనికీ తట్టుకోలేరు దయచేసి ఈ నిప్పులాంటి నిజాన్ని వాళ్ళకి చెప్పకండి డాక్టర్ అని కన్నీళ్ళతో అర్థించిందా తల్లి డాక్టర్ కన్సల్టింగ్ రూంలో కొచ్చింది అక్కడ తను చెప్పే రిజల్ట్సు కోసం నిరీక్షిస్తున్నాడా కొడుకు ఆ హాల్లో అతను తప్ప ఇంకెవరూ లేరు అప్పటికే అంతా వెళ్ళిపోయారు

డాక్టర్ చెప్పిన మాట విన్నాక అయోమయ సముద్రంలో అట్టడుగున పడిపోయి నట్టయింది అతనికి అక్కడ నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది అది భయంకరమైన నిశ్శబ్దం మనిషిని పిచ్చివాణ్ణి చేసే నిశ్శబ్దం గుండెలను పిండి గుబులు పుట్టించే నిశ్శబ్దం అనుభవించే వాళ్ళకే గాని అన్యులకు తెలీదు బలవంతాన గొంతు పెగల్చుకొని అన్నాడు అతను ఈ అగ్నిశిఖ లాటి నిజాన్ని విని నేను మగాణ్ణి కనుక ఎలాగో తట్టుకోగలను డాక్టర్! నా భార్య, నా తల్లి ఇది వింటే ఏమై పోతారో అని నా మనసు తల్లడిల్లి పోతోందండీ ఈ మాట వాళ్ళిద్దరికి చెప్పకండి డాక్టర్ ఇదే మిమ్మల్ని నేను కోరేది అన్నాడు ఎటో చూస్తూ అతను ఇది వరలా అయితే వాళ్ళని ఆశ పిశాచంలా తరిమింది ఇప్పుడు మనసంతా కాటుక లాటి చీకటి వ్యాపించింది! అయినా చలించకుండా మేరు నగ ంలా నిలబడిన అతని చెంతకు వాళ్ళిద్దరు వచ్చి చేరారు ఎవరి నోటంటా ఏ విధమైన మాటా స్రావటం లేదు వాళ్ళు ముగ్గురు సామాన్యులు కాదు మాన్యులు అనుకుంది డాక్టరమ్మ వాళ్ళ ముగ్గుర్ని చూస్తే ముచ్చటేసింది డాక్టరమ్మకు ఒకరిని మించిన మంచి మనసు ఒకరిది ఆ నిశ్శబ్దాన్ని బద్దలు కొడుతూ వాళ్ళ ముగ్గురి కేసి చూసింది డాక్టరమ్మ

మంచి గందంలాటి మీ మనసు చూస్తుంటే నాకొకటడగాలని వుంది నాకో హెల్ప్ చేస్తారా?

చెప్పండి డాక్టర్!' అన్నాడు అతను ఈ లోకంలో కొచ్చి

మేమా! మీకా హెల్ప్! అంది తల్లి జీవం లేనట్టు నవ్వి

తప్పక చేస్తామండి అంది ఆశల అంచుల నిల్చిన ఆ సుందరి

అసలు ఇలాటి వాళ్ళు ఉంటారా అనుకుంది డాక్టర్

నా చెల్లెలు 3 నెల్ల పాపని నా దగ్గర ఒదిలి స్టేట్స్‌కి వెళ్ళి పోయింది ఒక్క ఏడాది పాటు దాన్ని మీ బిడ్డలా పెంచగలరా? సిస్టర్ పాపనిలా తీసుకురా! అంది గులాబి రంగు ఫ్రాక్ లేసుకుని తెల్ల గులాబిలా నిద్రిస్తున్న పాపని పొత్తిళ్ళలో తీసుకు వచ్చింది నర్సు ఆశ ఆమె చేత దోసిలి స్పష్టించింది ఉత్తుంగ తరంగంలా ఉప్పెనలా ఉధృతంగా ఉరికొచ్చే ఆనందోత్సాహాలతో రెండు చేతులూ జాపి పాప నందుకుంది కోడలు వీళ్ళు పాపని మళ్ళీ ఇమ్మని అడక్కపోతే బాగుండుననుకుంది

పాప నర్సు చేతిలో వెల్లకిలా పడుకుని వుంది వెన్నెల కుప్ప పోసినట్టు

పాపని చూస్తే అతనికి కూడా ముద్దొచ్చి ఈ పాప సొంతమై పోకూడదా అనుకుని పాప పేరేంటి మేడమ్! అన్నాడు

ఇంకా పేరేం లేదు మీ ఇష్టం అంది

కంపల్సరీ ఏం లేదు సుమండీ మీ కిష్టం లేకపోతే

దేవత వరమిస్తుంటే వద్దనే అవివేకి ఉంటాడా డాక్టర్? వెల్లి విరిసిన ఆనందంతో అన్నాడు అతను

థేంక్సండి! నా ప్రోబ్లం సాల్వ్ చేశారు అంది డాక్టర్

థేంక్స్ మేమే చెప్పాలండి నిజానికి అంది కోడలు

నేనప్పుడప్పుడు వచ్చి చూస్తూంటాలెండి అంది డాక్టర్

అగ్నిగుండంలో చందనంలా అనిపిస్తోంది వాళ్ళకి పాపని చూస్తుంటే

స్వచ్ఛ జలపూర్ణ కలశం లాటి ఆ కుటుంబం వెనక్కి తిరిగి కృతజ్ఞతలు చెపుతూ వెళ్ళిపోతూంటే ఒక మంచి పని చేసిన తృప్తితో మనసంతా నిండిపోయి అటే చూస్తూ అలాగే నిలబడి పోయింది డాక్టర్ అంతేగాని నిన్ననే ఆ పాపని అనాథాశ్రమం నుంచి తెచ్చినట్టు వాళ్ళకు చెప్పలేదు డాక్టరమ్మ □

## ఇ·వేమన·పద్యాలు




సూక్ష్మరూప మెఱిగి సుఖమును బొందక
శాస్త్ర మెఱిగి చెడిన చందముగను
చావు పుట్టుకగని చదువేల చదువరో
విశ్వదాభిరామ వినురవేమ

# ప్రేమసాగరమథనం

## డాక్టర్ కొత్త రవీంద్రబాబు



సీరియల్

(గత సంచిక తరువాయి)

ఆరుముగం కబురంపాడని తెలియగానే విజయరాఘవన్ మద్రాసు వచ్చాడు సరాసరి ఆఫీసుకు వెళ్ళి ఆరుముగాన్ని కలుసుకున్నాడు

వణక్కం ఆరుముగంసార్

వణక్కం! పిలవగానే వచ్చావే!

చేసిన మేలు మర్చిపోను సారు! నార్త్ ఆర్కాట్‌జిల్లాలో ఇంకా నా రాడికల్ గ్రూప్ బతికి వుందంటే అందుకు మీ సహాయమే కారణం!

వేటకుక్కల్లా వెంటాడే పోలీసుల వత్తిడి కొంత తగ్గించి వూపిరిపీల్చుకునే వీలు కల్గించారు!

చేసిన మేలు మరువని వాళ్ళనుచూస్తే నాకు సంతోషం! నీతో చిన్న పనిపడింది!

చెప్పండి సార్!"

దీప్ ఎంటర్ ప్రైజెస్ అని టూవీలర్స్ కంపెనీ వుంది ఆకంపెనీ యజమాని సందీప్ యిప్పుడు మద్రాసులోనే ఎక్కడో వున్నాడు అతనెక్కడ వున్నది ఆచూకీ తెలుసుకుని సఫా చెయ్యాలి అతని కజిన్ విలాసిని అనే అమ్మాయి వున్నది ఆ అమ్మాయిని భద్రంగా తెచ్చి నాకప్పగించాలి!

ఇదిగో కర్చులకు డబ్బు! అంటూ లక్షరూపాయలు వున్న జిప్‌బాగ్ అతనికందించాడు ఆరుముగం

బాగ్ అందుకుంటూ సందీప్ ఎలా వుంటాడు? ఎక్కడ వుంటాడు? అని అడిగాడు విజయరాఘవన్

సందీప్ ఫోటో వున్న పత్రిక యిస్తూ ఇదిగో! నీకు కావలసిన వివరాలన్నీ యీ కాగితంలో వున్నాయి! అని యిచ్చాడు ఆరుముగం సందీప్ విలాసిని కట్టుబట్టలతో సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఫస్ట్ క్లాస్ కూపేలో మద్రాసు వచ్చిన తారీఖు సమయం అందులో వున్నాయి విలాసిని ఫోటోలూ వున్నాయి

సందీప్ విలాసినిల వయసు రూపురేఖలు కట్టుకున్న బట్టలు, వివరంగా రాసి వున్నాయందులో

ఆరుముగం కింగ్‌కాంగ్ చేత ఆవివరాలన్నీ రాయించాడు!

వస్తాను సార్! పని పూర్తి చేసుకుని మీదగ్గరకు వస్తాను! అన్నాడు విజయరాఘవన్

* * * * * * * * * *

ట్రిమ్‌గా డ్రెస్ చేసుకుని కళ్ళకు గాగుల్స్ పెట్టుకుని బయల్దేరాడు విజయరాఘవన్!

సెంట్రల్ స్టేషన్‌కు చేరువలో ఏదయినా రెడీమేడ్ బట్టల షాపు వుందేమోనని చూడసాగాడతను త్వరలోనే అతని ప్రయత్నం ఫలించింది స్టేషన్‌కు అరమైలు దూరంలోనే రెడీమేడ్ గార్‌మెంట్స్ షాపు కనపడింది

రీవిగా షాపులోకి నడుచుకుంటూ వెళ్ళాడు కౌంటర్ దగ్గరకు విజయరాఘవన్

యారు షాప్ వోనర్? దర్పంగా అడిగాడు విజయరాఘవన్

నాను! అంటూ ముందుకు వచ్చాడు పరమ శివ అయ్యర్ తెల్లలుంగీ, అరచేతుల ముతక చొక్కా ముఖాన విభూదిరేఖలు – ఏం కావాలి నీకు అన్నట్టు చూసాడు అతను విజయరాఘవన్‌వంక

జేబులోంచి కార్డ్ తీసి చూపాడు విజయన్ సి బి సి ఐ డి అని వుంది అందులో కార్డ్ చూడగానే అయ్యర్ ముఖంలో వినయం విధేయత అణకువ చోటు చేసుకున్నాయి

సందీప్ ఫోటో పేపర్ కటింగ్ చూపి ఇతను ఒక రాడికల్ గ్రూపు లీడరు! ప్రభుత్వం ఇతన్ని పట్టుకున్న వాళ్ళకు లక్షబహుమానం యిస్తుంది! ఈమధ్య యితను మీ షాపుకు వచ్చాడని ఇన్‌ఫర్‌మేషన్ వచ్చింది అన్నాడు విజయరాఘవన్ అణచుకుందామన్నా అతని గొంతులో అధారిటీ తగ్గలేదు!

అయ్యర్ శరీరంలో వణకు ముఖంలో ఆందోళన చూసి చిరునవ్వుతో ఇతను రొంబ డేంజరస్ తిన్న యింటి వాసాలు లెక్కడతాడు పర్చేజ్ చేసిన షాపు యజమాని యిల్లు లూటీ చేసి భయంకరంగా మర్డర్ చేస్తాడు! అన్నాడు విజయరాఘవన్

అయ్యర్ ఎలానో గొంతు పెకలించుకుని వీడుదా! మొన్నీమధ్య వచ్చి పాంటులు షర్టులు, నైలాన్ చీరెలు రెడీమేడ్ జాకెట్టు తీసుకు వెళ్ళిండు! అని చెప్పి గడగడ వణకిపోసాగాడు

ఎక్కడకు వెళ్ళాడతను?

చూడలేదు సార్! ఆ! దొరస్వామి టాక్సీలో వెళ్ళాడతను! ఎమ్ ఎస్ ఎక్స్ 1111 నంబరు!

వస్తా! ఈ సంగతి యారికీ సెప్పకు! అంటూ వెళ్ళాడు విజయరాఘవన్

* * * * * * * * * *

సెంట్రల్ స్టేషన్ ముందు టాక్సీ డ్రైవర్లు కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు స్టేషన్‌కు ఆసమయంలో వచ్చే రైలేమీ లేక పోవటంతో కుంపటి కాఫీ అతని దగ్గర సింగిల్ కాఫీ చప్పరిస్తూ కూర్చున్నారు

అరే దొరస్వామీ! నీకు బాడుగ వచ్చిందిరా అన్నారెవరో! తాగుతున్న

జరిగినకథ - 11 మద్రాసు చేరిన సందీప్, విలాసినిల కోసం కింగ్‌కాంగ్ ముఠా, నాగరాజు ముఠా టైగర్ ముఠా ఎవరి ప్రయోజనాల కోసం వాళ్ళు తీవ్రంగా వేట మొదలుపెడతారు తమ కోసం అన్ని ముఠాలూ పొంచి ఉండగా విలాసిని, సందీప్‌లు ఒక స్నేహితుని ఇంట్లో బస చేస్తారు షీలాను కలుసుకున్న నాగరాజు విలాసిని అక్కడికి రాలేదని తెలుసుకుంటాడు కింగ్‌కాంగ్ తన వేటలో భాగంగా ఆర్ముగంను సహాయం కోరతాడు

సింగల్ కాఫీ గుటుక్కున మింగి పరిగెత్తాడు దొరస్వామి

ట్రిమ్‌గా డ్రెసప్ అయివున్న విజయరాఘవన్‌ను చూడగానే దొరస్వామి ముఖం వికసించింది

కారులో కూర్చుంటూ పోనీయ్ అన్నాడు విజయరాఘవన్ వేలితో కుడివైపు రోడ్డు చూపుతూ.

టాక్సీ కదిలి కొంత దూరం పోంగానే దొరస్వామీ! నువ్వు గజదొంగలను టాక్సీలో జేరవేస్తావని మా పోలీస్ డిపార్ట్‌మెంట్‌కు తెలిసి పోయింది అన్నాడు శాంపిగా!



# ప్రేమసాగర మథనం

తన టాక్సీలో ఎక్కింది పోలీసాపీసరు అని తెలియగానే దొరస్వామి కంగుతిన్నాడు

దీప్ పొటో న్యూస్ పేపర్ కటింగ్ అతని ముందుంచుతూ ఇతను నీ టాక్సీలో కొద్ది రోజుల క్రితం ప్రయాణం చేసాడు అన్నాడు విజయరాఘవన్

సందీప్‌ను గుర్తు పట్టిన చాయలు దొరస్వామి ముఖంలో కనపడగానే ఇతన్ని పట్టి యిచ్చిన వాళ్ళకు పదివేలు బహుమానం యిస్తారు డిపార్ట్‌మెంట్ వాళ్ళు' అన్నాడు

సార్' ఇతను యీ మధ్య వో రోజు సెంట్రల్ స్టేషన్ దగ్గర నాటాక్సీ ఎక్కి పరమశివయ్యార్ రెడీమేడ్ షాపు దగ్గర ఆగి దుస్తులు కొనుక్కుని మరలా స్టేషన్ కెళ్ళాడు ఇరవై నిముషాల్లో తిరిగి వొక అమ్మాయితో పాటు వచ్చాడు బేరం ఆడకుండా టాక్సీ పేర్ టిప్ యిచ్చాడని ఆయన్ను నేనే మళ్ళీ ఎదురొచ్చి నా టాక్సీ దగ్గరకు తీసుకుని వెళ్ళాను'

అతన్ని ఎక్కడకు తీసుకుని వెళ్ళావో సరిగా అక్కడకు టాక్సీ పోనీయ్'

దొరస్వామి టాక్సీ మాంబళంలోని అప్సామర్ ఎపార్ట్‌మెంట్సు దగ్గర ఆగింది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

దీప్‌కు డిల్లీ పోన్ చేసి తల్లికి తను క్షేమంగా వున్నానన్న విషయం తెలియజేద్దామని పించింది తీరా పోన్ రిసీవర్ చేతిలోకి తీసుకోగానే ఇంటికి పోన్‌చేస్తే మమ్మీ వెంటనే తిరిగి రమ్మంటుంది' ప్రస్తుత పరిస్థితులలో వెంటనే యింటికి వెళ్ళడం సాధ్యంగాదు విలూకి డాడీ అంటే వున్న ద్వేషం పోనిదే ఆమెను యింటికి తీసుకు వెళ్ళటం సాధ్యంగాదు' అనుకున్నాడతను

అందుకే డిల్లీ ఆపీస్ నంబర్ డయల్ చేసాడతను

హలో' మేనేజర్ మల్‌హోత్రా గొంతు వినగానే

మల్‌హోత్రా జీ' నేను దీప్‌ను మాట్లాడుతున్నాను

సందీప్‌సాబ్' క్షేమమేనా'

క్షేమమే' మమ్మీ బాగున్నారా?

బాగున్నారు' మీరింకా తిరిగి రాలేదని ఆందోళన పడుతున్నారు

త్వరలో తిరిగి వస్తానని మమ్మీకి చెప్పండి డాడీ కోర్కె ప్రకారం ఆయన అస్థికలు దక్షిణదేశపు నదులలో కలపి వద్దామని దక్షిణదేశం టూర్ చేస్తున్నాను మమ్మీని వర్రీ అవద్దని చెప్పండి'

అలాగే'

విశేషాలేం లేవుగా మల్‌హోత్రాసాబ్'




ఏం లేవు' అంతా మామూలుగా జరిగి పోతున్నది మీ కోసం రోజు విజయవాడ నుండి పోన్ వస్తున్నది మీతో మాట్లాడి మన కంపెనీ ఏజెన్సీ తీసుకోవాలని వున్నదట'

అలాగా' నేను డిల్లీ వచ్చాక మాట్లాడతాను లెండి పోన్ చేసే అతనెవరు?

అతన్ని గూర్చి వివరాలడిగితే చెప్పటంలేదు మీతో స్వయంగా మాట్లాడాలంటున్నాడు'

వుంటాను మల్‌హోత్రాసాబ్'

రాంరాం' జీతేరహోసందీప్ సాబ్'

పోన్ పెట్టెయ్య గానే దీప్ ఆలోచనలో పడ్డాడు రోజూ తనకోసం విజయవాడ నుండి పోన్ చేస్తున్నదెవరో?

హోటల్‌రూంలో తాను సూట్‌కేస్ వదలి వచ్చినట్లు గుర్తొచ్చిందతనికి కోటి గాని టైగర్‌గాని తన సూట్‌కేస్ చూడలేదుగదా?

అనుమాన నివృత్తికి విజయవాడ పోన్ చేద్దామనుకొన్నాడు దీప్

జ్యోతి హోటల్ సర్వర్ శివకన్న తనకు అప్పులు విజయవాడలో లేరని గుర్తొచ్చిందతనికి జ్యోతి హోటల్‌కు డయల్ చేసి

శివని పిలుస్తారా? అన్నాడు దీప్

శివ హోటల్‌కు రావటం లేదు' ఎవరో అతన్ని తుక్కుతుక్కుగా చితకబాదారు' కాలి ఎముకలు విరిగి గవర్నమెంట్ హాస్పటల్‌లో జేరాడు

శివకేం ప్రమాదం లేదుగదా' ఆదుర్దాగా అడిగాడు దీప్

ప్రమాదం లేదనే అన్నారు డాక్టర్ రంగనాద్' మీరెవరు? ఎక్కడ నుండి మాట్లాడు తున్నారు?

సమాదానం చెప్పకుండా పోన్ పెట్టేసాడు దీప్ శివను ఎవరో చితక బాదారు' డిల్లీ ఆపీస్‌కు రోజూ విజయవాడ నుండి పోన్ వస్తున్నది' రెండు వార్తలూవిన్నాక తను ఎవరో తన ప్రత్యర్థులకు తెలిసి పోయిందని అర్థం అయింది దీప్‌కు

ఎపార్ట్‌మెంట్ దోర్‌కిందుగా హిందూపేపర్ నెట్టాడు పేపర్ బోయ్ యదాలాపంగాపేపర్ తీసి చూచాడు సందీప్

దీప్ ఎంటర్ ప్రైజెస్ ఎడ్వర్ టయిజ్‌మెంట్ చూడంగానే అతని మనసు ఆందోళనతో నిండి పోయింది తానెవరో ప్రత్యర్థులకు తెలియటమే గాక తన పొటో పేపర్లో ప్రత్యక్షంగా కనపడుతున్నది' ఇంతకంటె విపత్కర మైన పరిస్థితి మరొకటుండదు

దీప్ యిలా మనసులో మదన పడుతున్న సమయంలో విలాసిని ఉబుసుపోక షీలా నంబర్ డయల్ చేసింది

హలో షీలా' బాగున్నావా?

హలో విలూ' ఎప్పుడొచ్చావ్' నీకంటె ముందు రాణీ నాగరాజు వచ్చి నీ కోసం అడిగారు'

నేను' నేను యిప్పుడే వచ్చాను'

ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నావ్' నువ్వు మీ మేనమామ కొడుకుతో మద్రాస్ వచ్చేసావని చెప్పింది రాణి

ఆ' నిర్ఘాంత పోయింది విలాసిని అంతలోనే చలమయ్యతో దీప్ తన మేనమామ కొడుకు అని చెప్పిన విషయం గుర్తొచ్చి"పరాచికాని కని చెప్పిన అబద్ధం ఎంత దూరం ప్రయాణం చేసింది అనుకుంది మనసులో

విలూ' నీకోసం నాగరాజు అతని మనుషులు మీ నాన్న పంపిన మనుష్యులు మద్రాసంతా గాలిస్తున్నారని చెప్పింది రాణి

మాయింటి చుట్టూ రౌడీలున్నారు నువ్వుగాని యిటుకేసి వస్తే ప్రమాదంలో చిక్కుకుంటావు'

అలాగా' సరే షీలా' పరిస్థితులు బాగుపడ్డపుడు కలుసుకుందాం' అంటూ పోన్‌పెట్టేసింది విలాసిని

విలూ! ఎవరో శివను చితకబాదారు' కాలు విరిగి హాస్పటల్‌లో జేరాడతను' నే నెవరో కూడా మీ వాళ్ళకు ఆచూకీ తెలిసి పోయింది అని చెప్పాడు దీప్ విలాసినితో

నాగరాజు అతను పంపిన మనుష్యులు నాన్న పంపిన మనుష్యులు మనకోసం మద్రాసంతా గాలిస్తున్నారని రాణి షీలాతో చెప్పిందట'



# పన్ను చెల్లింపుదార్లకు శుభవార్త!

## 1987 జాతీయ పొదుపు పథకం

### కొత్త పథకం ముఖ్య లక్షణాలు



- పొదుపు ఖాతాలు నిర్వహించే పోస్టాఫీసుల ద్వారా ఈ క్రొత్త పొదుపు పథకం అమలు చేయబడుతుంది.
- వ్యక్తులు, హిందూ అవిభక్త కుటుంబాలు మాత్రమే ఈ ఖాతాను ప్రారంభించడానికి అనుమతించబడుతుంది. ఒక వ్యక్తి ఒక ఖాతాను మాత్రమే ప్రారంభించాల్సి వుంటుంది.
- ఈ ఖాతాలో సంవత్సరం లోపల జమచేసే నిల్వలలో 50% సొమ్ము వరకు, 20 వేల రూపాయల పరిమితి వరకు ఆదాయం పన్ను మినహాయింపుకు అర్హత లభిస్తుంది. ఆదాయం పన్ను చట్టం 80 (సి) సెక్షన్ ప్రకారం 40 వేల రూపాయల వరకు పన్ను మినహాయింపుకు ఈ మినహాయింపు అదనంగా చేర్చబడుతుంది.
- సంవత్సరంలో విత్‌డ్రాయల్ చేసుకున్న సొమ్ములో 50% సొమ్ము ఆదాయం పన్ను లెక్కింపులోకి చేర్చబడుతుంది.
- వంద రూపాయల గుణకాలతో నెలకు ఒకసారి మాత్రమే ఖాతాలో సొమ్ము జమ చేయడానికి అనుమతించ బడుతుంది. జమకూడా సాలుకు 20 వేల రూపాయల పరిమితి వరకే వుంటుంది.
- ఈ పథకాన్ని సులభంగా అమలు చెయ్యడం కోసం మూడు సంవత్సరాల వరకు విత్‌డ్రాయల్స్‌పై ఏ విధమైన పరిమితి లేదు.
- సంవత్సరంలో ఒక విత్‌డ్రాయల్ చేసుకోడానికి అనుమతించబడుతుంది.
- 1987-88 సంవత్సరానికి ఈ ఖాతాలో జమ చేసిన సొమ్ముపైద 9% వడ్డీ లభిస్తుంది.
- ఈ ఖాతాలో జమ చేసే సొమ్ముపైద లభించే వడ్డీ ఆదాయం పన్ను లెక్కింపులోకి రాదు. ఆ వడ్డీ ఖాతాదార్లకు కూడా చెల్లించబడదు. సంవత్సరాంతంలో గుణించబడి, ఆ మరుసటి సంవత్సరం మొదటిరోజున అసలు సొమ్ములో కలుపబడుతుంది.
- ఖాతాలో సొమ్మును విత్‌డ్రాయల్ చేసుకున్నప్పుడు 50% సొమ్ముకు ఏవిధంగా పన్ను చెల్లించబడుతుందో, అదే విధంగా విత్‌డ్రాయల్ చేసుకున్న సొమ్ము మీద లభించిన వడ్డీలో కూడా50% పన్ను చెల్లించాల్సి వుంటుంది.
- జమచేసే సొమ్ముపైద పూర్తి నెలలకు వడ్డీ గుణించబడుతుంది. అనగా ప్రతి నెలాఖరు వరకూ జమ అయిన సొమ్మును ఆ మరుసటి నెల ప్రారంభంలో నిల్వవున్న సొమ్ముగా భావించి దానికి గుణించబడుతుంది.
- ఈ పొదుపు ఖాతాలోని నిల్వలపైద సంపద పన్ను పూర్తిగా మినహాయించబడుతుంది. ఈ మినహాయింపుకు పరిమితి లేదు.
- ఈ పథకంలో ఖాతాదారు మరణించిన పక్షంలో అతని ఖాతా రద్దు చేయబడుతుంది. అయితే అతని వారసులు ఆ సొమ్మును విత్‌డ్రా చేసుకునే టప్పుడు 50% సొమ్ముకు పన్ను చెల్లించాల్సి వుంటుంది.
- ప్రతి సంవత్సరం ఆయా ఖాతాదార్లకు ఒక ఫోలియో సెట్టుతో పాటు పాసు పుస్తకం కూడా సరఫరా చేయబడుతుంది. ఇది ఖాతాదారునికి శాశ్వత రికార్డుగా వుంటుంది. దీనికి అదనంగా పోస్టాఫీసు వారు ఖాతా దారునికి అతను సంవత్సరంలో చేసిన డిపాజిట్లు, విత్‌డ్రాయల్స్ గూర్చిన సర్టిఫికెట్లను కూడా ఇస్తారు.

వివరాలకు :
మీ సమీపంలోని పోస్టాఫీసులోనైనా, కలెక్టరు కార్యాలయంలోని తాసిల్దార్ని, లేదా జాతీయ పొదుపు సంస్థ జిల్లా పొదుపు అధికారిని కానీ, ఈ సంస్థ ఏజంట్లను సంప్రదించండి.



కమీషనర్,
చిన్న మొత్తాల పొదుపు సంస్థ
తిలక్ రోడ్, అబిడ్స్, హైదరాబాదు
ఫోను: 232939, 231468



తెలుగు సమాచారం

# ప్రేమసాగర మథనం

'అలాగయితే మనం మద్రాసువిడిచి వెళ్ళటం మంచిది' అంటూ కిటికీ లోంచి కిందకు చూచాడు దీప్! అఫ్సాఘర్ ఎపార్ట్‌మెంట్స్ ముందు కార్లు ఆగివున్నాయి కొంచెం దూరంగా వొక టాక్సీ వచ్చి ఆగడం అందులోంచి డ్రైవర్, ట్రిమ్‌గా డ్రెసప్పయి గాగుల్స్ పెట్టుకున్న తను దిగటం చూచాడు దీప్

నున్నగా మెరిసే టాక్సీడ్రైవర్ బట్టతల ఎండలో మెరుస్తున్నది! అక్షణాన గుర్తొచ్చింది ఆ డ్రైవర్ టాక్సీలోనే విలూ తనూ యిక్కడికొచ్చినట్లు

దీప్ శరీరంలోని ఎడ్రినల్ గ్రంథులు విపరీతంగా పని చేయసాగాయి!

టాక్సీ డ్రయివర్ అప్సా ఘర్ ఎపార్ట్ మెంట్లువంక చూపిస్తూ గాగుల్స్ పెట్టుకున్న అతనితో ఏదో చెప్పటం కనబడింది

విలూ! బిక్విక్! మనకోసం ఎవరో స్నేహితులు వస్తున్నారు మళ్ళీ కట్టుబట్టలతో పరిగెత్తాలి! అంటు అపార్ట్‌మెంట్ డోర్ తెరిచి బయటకు పరిగెత్తాడు దీప్ డోర్ ముందు మెట్లున్నాయి మెట్ల మధ్య లిఫ్ట్ వుంది లిఫ్ట్ పైకి వస్తున్న చప్పుడు వినగానే విలూ! కమాన్! అంటూ విలాసిని చేయిపుచ్చుకుని మెట్ల మీదుగా కిందకు పరిగెత్త సాగాడు

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

విజయరాఘవన్ లిఫ్ట్ దగ్గర ఘూర్కా అతనికి దీప్ ఫొటో చూపి ఇతను పేరు మోసిన గజదొంగ! మీ అపార్ట్‌మెంట్స్‌లో దాక్కున్నాడని ఆ చూకీ వచ్చింది! అన్నాడు

ఘూర్కా ఫొటో చూసి గుర్తుపట్టి ఇతను కొద్ది రోజుల క్రితం లిఫ్ట్‌లో అయిదో అంతస్థుకి వెళ్ళాడు మళ్ళీ తిరిగి రావటం నేను చూడలేదు అన్నాడు

ఘూర్కాకు సి బి సి ఐ డి ఐడెంటి టీ కార్డు చూపుతూ పద! అతను వున్న ఎపార్ట్‌మెంట్ దగ్గరకు తీసుకుని వెళ్ళు! అన్నాడు విజయరాఘవన్

లిఫ్ట్‌ను అయిదో అంతస్తులో ఆపి ఘూర్కా విజయరాఘవన్‌ను ఠాకూర్ దాస్ ఎపార్ట్‌మెంట్‌లోకి తీసుకు వెళ్ళాడు!

వోరగా వేసి వున్న తలుపు తెరచుకుని అపార్ట్‌మెంట్ అంతా గాలించి ఎవరూ కనపడక పోయేసరికి నిరుత్సాహంగా వెనుదిరుగబోయాడు విజయ రాఘవన్

గాస్‌స్టవ్ మీద పెనం – పెనం మీద చపాతి మాడిపోతూ వాసన కొడుతున్న దృశ్యం కనపడగానే విజయరాఘవన్ కళ్ళు మిలమిల మెరిసాయి

టార్గెట్ చేరుకున్నాను! కొంచెం ఆలస్యం అయిందంతే! అనుకుంటూ చప్పున బాల్కనీ మీదకు వెళ్ళి కిందకు తొంగి చూసాడు

హడావిడిగా ఒక యువజంట అంబాసిడర్ కారెక్కి వెళ్ళిపోవటం వాళ్ళు వెళ్ళిన నిముషానికి దొరస్వామి టాక్సీ అంబాసడర్ కారు వెంటపడి వెళ్ళటం గమనించి పదివేలు బహుమతి పొందాలని దొరస్వామి ట్రాఫిక్ రూల్సు కూడా పాటించడు! అనుకుంటూ కిందకు దిగి వచ్చాడు




★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

దీప్ విలాసినిని తీసుకుని అప్సాఘర్ ఎపార్ట్‌మెంట్స్ మెట్లగుండా కిందకు దిగాక ఏం చేయాలో తోచలేదు ఒకక్షణం

దూరంగా దొరస్వామిని చూడగానే అతన్ని తప్పించుకోవాలంటే ఎదురుగా పార్క్ చేసి వున్న కార్లలో ఒక దానిలో ఎక్కి పారి పోవటం వినా మార్గం లేదని అర్థం అయింది!

రావిలూ! అంటూ ఎదురుగా వున్న అంబాసిడర్ కారు డ్రైవింగ్ వీల్ ముందు కూర్చున్నాడు విలాసిని వచ్చి ముందు సీటులో కూర్చోగానే కారు స్టార్టు చేసి దూసుకు పోయాడు

పర్లాంగు దూరం పోయాక మెయిన్ రోడ్‌న స్పీడుగా పోతూ రేర్‌వ్యూ మిర్రర్‌లో చూచాడు దీప్!

కారును వెంబడిస్తూ వస్తున్నది బట్టతల అతని టాక్సీ! ఆ టాక్సీ నంబరు 1111 గుర్తొచ్చింది దీప్‌కు అసంకల్ప ప్రతీకార చర్యగా ఏక్సిలేటర్ నొక్కాడు దీప్! తుపాకీ గుండులా దూసుకు పోయింది కారు

మద్రాస్ సిటీ రోడ్లు తెలియని తను టాక్సీ డ్రైవర్‌ను తప్పించుకోవటం కష్టమని గ్రహించి మరింత స్పీడ్‌గా కారు పోనివ్వసాగాడు దీప్ అలా ఎంత దూరం పోయాడో అతనికి గమనం లేక పోయింది వీలున్నంత త్వరలో కారు వదలి వేయాలని దీప్ అనుకున్నాడు ఇండియా టూరిస్ట్ డెవలప్ మెంట్ కార్పొరేషన్ ఆఫీస్ బోర్డు కనపడ్డాక కారును రెండు పర్లాంగులు పోనిచ్చి మెయిన్ రోడ్ పక్కసందులో ఆపి విలాసినిని వెంటరమ్మని సైగ చేసి వెనక్కు వచ్చినదిశగా చక చకనడువ సాగాడు

మహాబలిపురం అని రాసి వున్న ఐ టి డి సి బస్ పక్కన వున్న కౌంటర్ దగ్గరకు వెళ్ళి మహాబలిపురం రెండు టికెట్లు కొని బస్ ఎక్కాడు దీప్!

దీప్ విలాసిని బస్‌లో ఎక్కేసరికి బస్ దాదాపుగా నిండివున్నది వెనకసీటుల్లో మధ్యన ఖాళీవుంటే వెళ్ళి కూర్చున్నారిద్దరూ! అదీ వొకందుకు మంచిదే అనుకున్నాడు దీప్

కిటికీ పక్కన కూర్చున్నట్లయితే రోడ్ మీద వెళ్ళే వాళ్ళ కళ్ళ పడుతాను! ఇక్కడ వుంటేనే సేఫ్ అనుకుంటూ యదాలాపంగా బయటకు చూసాడు శరవేగంతో దూసుకు వెళ్తున్న దొరస్వామి టాక్సీని గుర్తుపట్టాడు తను!

ప్రస్తుతానికి తప్పుకున్నాం! అనుకుంటూ నిట్టూర్చాడు దీప్

మరునిముషంలోనే బస్ బయల్దేరింది! గైడ్ టూర్ విశేషాలు చెబుతూ వుంటే బస్ వేగంగా ముందుకు పోసాగింది

విలాసిని, దీప్ కనబడలేదని మనసులో కించిత్ ఆందోళనగా వున్న నాగరాజు రాణి కనపడక పోయేసరికి నిప్పు తొక్కిన కోతిలా కోటి మీద చీటికి మాటికి విరుచుకు పడసాగాడు!

ఏమీ పాలుపోని కోటి కాలుగాలిన పిల్లిలా రోడ్ల వెంట తిరుగుతూ హోటళ్ళు లాడ్జిలు గాలించినవే మరలా గాలిస్తూ హడావిడిపడి పోసాగాడు విజయవాడలో అతనికి ప్రతి సందు గొంది తెలుసు! రౌడీలు వాళ్ళ బలహీనతలు తెలుసు! ఒక్క టైగర్ తప్ప అతన్ని ఎదుర్కొనే వాళ్ళు ఎవరూ లేరక్కడ! కాని మద్రాసు వచ్చే సరికి అతనికి ఏ రోడ్డు ఎటు వెళుతుందో తెలియదు! వచ్చీ రాని అరవంలో మాట్లాడితే తగిన రెస్పాన్స్ రావటం లేదు! విజయవాడలో అయితే పొద్దుగుంకే సరికి ఒక చుక్క మందేసుకుని చమ్కీ దగ్గరకెళ్ళేవాడు! చమ్కీ అతని వంట్లో ప్రతి కీలును మర్దన చేసి సేదదీర్చేది! మద్రాసులో ఆ అవకాశమూ లేదు!

టాక్సీలో తిరిగే దానికన్న సిటీ బస్‌లలో తిరిగితే విలాసిని దీప్, రాణిలలో ఎవరయినా కనబడతారేమోననే ఆశతో సిటీబస్‌లో తిరుగటం మొదలెట్టాడు సిటీబస్‌లో కిటికీ లోంచి తొంగి చూస్తూ బజార్లు గాలించటం మొదలెట్టాడు కోటి.

సిటీబస్ లోంచి అలా తొంగి చూస్తూ వుంటే పక్కన వెళ్తున్న బస్ ఒకటి ఆగి పోయింది ట్రాఫిక్ జామ్ వలన! యదాలాపంగా బస్ లోపలకు తొంగిచూసాడుకోటి!

# రచయిత జవాబులు



ఆర్ వి రవిప్రసాద్ విజయవాడ

ప్ర రైటర్స్ పాఠకుల కోసం రాస్తారా? లేక సమకాలీన సమస్యలను విశ్లేషిస్తూ రాస్తారా?

జ రెండు రకాల రచనలు వస్తున్నాయి సమకాలీన సమస్యలను పాఠకులు చదివే రీతిలో రచనలు చేయటంలోనే రచయిత నేర్పు వ్యక్తం అవుతుంది

పొయిని ఉమాదేవి సత్తుపల్లి

ప్ర రచయిత గొప్పవాడా? రచన గొప్పదా?

జ రచయిత కొద్ది కాలం మాత్రమే జీవించి వుంటాడు మంచి రచన చిరకాలం జీవించి ప్రజలను ప్రభావితం చేస్తుంది

గరిగ నర్సయ్య

ప్ర ఈనాటినవలలు ప్రజలకు ఏ విధంగా వుపయోగపడుతున్నాయి?

జ కనీసం కాలక్షేపానికి, మనసులోని బాధలు మరిచి అలరింపజేయటానికి సమాజంలో ఎదురవుతున్న సమస్యలపై దృష్టి సారింప జేయటానికి పాఠకుని మనసును రంజింప జేయడమే రచనల వుద్దేశం అని మామ్ అన్నాడు

డి మనోహర్, రాయగడ్ (ఒరిస్సా)

ప్ర సందీప్ 8లక్షలు డిపాజిట్ చేస్తుంటే మానేజరు ఎందుకు ప్రశ్నించలేదు?

జ దొంగ నోట్లని అనుమానం వుంటే తప్ప బాంకు మానేజర్లు సాధారణంగా డబ్బెక్కడిదని డిపాజిటర్లను ప్రశ్నించరు! అనుమానం వుంటే డిపాజిట్ చేసి చూడండి .

కె అనిల్‌కుమార్, సింగపేట నెల్లూరు

ప్ర ప్రేమసాగర మథనం ఆసక్తికరంగా ఉత్సాహంగా వుంది

జ థాంక్యూ!

డి ఉమాపతి, సింగనమల

ప్ర జంటలను చిలకాగోరింకలంటారు

జ కవి సమయం (అంటారు అలాంటి వాటిని)

వి బాలాజి, గొర్లగుంటి, తిరుపతి

ప్ర మీరు కాజాహనిత గారడిగిన ఉత్తమ ప్రశ్నకిచ్చిన జవాబు బాగుంది ఉత్తమ ప్రశ్నకే ఉత్తమ జవాబుంటుందా?

జ ప్రశ్నని బట్టి జవాబు

సయ్యద్ బొకారి, పత్తికొండ

ప్ర మీ నవల చాలా ఆకర్షించినది వెరీ ఫైన్

జ థాంక్యూ!

### ఉత్తమ ప్రశ్న

పి వి సుబ్బారాయుడు, హైదరాబాదు

ప్ర సమాజాన్ని మార్చే శక్తి సాహిత్యానికున్నదా?

జ తిక్కన, పాల్కురికి సోమనాథుడు, వేమన, గురజాడ, కృష్ణదేవరాయలు - సమాజాన్ని పురోగామి పథంలో నడిపించిన రచయితలలో కొందరు - ఒక సిరా చుక్క లక్ష మెదళ్ల కదలికకు కారణమవుతుంది

జె రాధ, ప్రొద్దుటూరు

ప్ర నేటి నవలలు సంఘంపై మార్పు తెస్తున్నాయా?

జ రచనల ప్రభావం సంఘం పైన సంఘం ప్రభావం రచనలపైన వుంటుంది - కొంతవరకు

ఎం బేబీ కళ్యాణి, బెండమూర్లంక

ప్ర మీ పత్రిక నవల అణిముత్యం! తక్కువ వ్యవధిలో యిన్ని నవలలు రాశారంటే ఆశ్చర్యంగా వుంది మీకు కరాటే వచ్చా?

జ మృత్యు రవళి పుస్తకం కోసం కరాటే గురించి చాలా పుస్తకాలు చదివాను కరాటే ప్రవీణులతో మాట్లాడాను!

ఎస్ అబ్దుల్ రఫి, కడప

ప్ర మీ సీరియల్ వాస్తవానికి దగ్గరగా వుంది పత్రిక కోసం ఎదురు చూస్తున్నాము

జ థాంక్యూ!

టి శశిధరకుమార్ తిరువూరు

ప్ర జిమ్మిక్స్‌తో నవలలు అమ్ముడయ్యేలా అతి తెలివి ప్రదర్శిస్తున్న రచయితలపై మీ అభిప్రాయం ఏమిటి?

జ పై మెరుగులు ఎక్కువ కాలం నిలబడవు! తాత్కాలికానందం కల్గిస్తాయి

పి ఏ సాయిప్రసాద్, కర్నూలు

ప్ర విజయవంతమయిన మీ నవలలేమైనా వున్నాయా?

జ నా నవలలన్నీ యింతవరకు పాఠకాదరణ పొందాయి

గోడవర్తి హరిప్రసాదరాజు, బోధన్

ప్ర సుశ్రుత నర్సింగ్‌హోంలో హీరోగా రవి పాత్రకు నిజ జీవితంలో మీ పాత్రకు ఏమయినా అవినాభావ సంబంధం వుందా?

జ కొంతవరకు వున్నది

బా ఏడుకొండలు, నందివెలుగు

ప్ర నేటి సమాజంలో వాస్తవిక విరుద్ధమైన థీమ్స్ వున్నవి అందువలన రేపటి సమాజం ఏమవుతుంది?

జ వేచి చూద్దాం

పి నాగరంజని చిలికలూరిపేట

ప్ర ప్రేమసాగర మదనం మమ్మల్నెంతో ఆకట్టుకుంది

జ థాంక్యూ!

బి ఏ శ్రీనివాసరావు నందివెలుగు

ప్ర రచనల వలన సమాజం ఉద్ధరించ బడుతుందా?

జ ఒకోసారి (అరుదుగా)

మాధవీస్వాతి హైదరాబాద్

ప్ర పట్టుదల లేని మనిషి తన అపజయానికి యితరులను నిందిస్తాడు

జ ఆడలేక మద్దెల ఓడు అన్నట్లు

ప్ర కథల నుంచి జీవితాలు పుట్టుకొస్తాయా? లేక జీవితాల్లో నుంచి కథలు పుట్టుకొస్తాయా?

జ వాస్తవం కల్పనకంటే అమోఘమన్న సూక్తి మీకు జవాబిస్తుంది ☐

---

అకస్మాత్తుగా కోటి గుండె దడదడ కొట్టుకోసాగింది పక్కనున్న బస్‌లోని వెనక సీటులో దీప్ విలాసిని కూర్చుని ఏదో కబుర్లు చెప్పుకుంటున్నారు!

మీకోసం నేను యిన్ని అవస్థలు పడుతుంటే మీరిద్దరూ తాపీగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారా! వుండండి! అబ్బాయిగారి పీక పిసికి అమ్మాయిగార్నెట్టుకెళ్ళి నాగరాజు ముందుంచితే బహుమానం లకారాల్లోనే వుంటుంది అనుకుంటూ హడావిడిగా సీటులోంచి లేచి అడ్డంగా నిలబడ్డ మనుష్యులను తొక్కుకుంటూ ఆపండి ఆపండి బస్ ఆపండి అంటూ ముందుకు తోసుకుపోసాగాడు

మాటల్ని బట్టి అతను తెలుగు వాడని తెలుసుకున్న కండక్టర్ కొంచెం చులకనగా

రొంబ హడావిడి సేస్తుండవ్! స్టాపు ఇల్లే! అంటూ అరుస్తున్నా వినకుండా అతన్ని నెట్టుకుని వాకిట్లోంచి కిందకు దూకాడు కోటి వెనక నుంచి వస్తున్న ఎక్స్ మోపెడ్ డ్రైవర్ మీద పడిపోయిన కోటి, మోపెడ్, మోపెడ్ డ్రైవరూ రోడ్డు కడ్డంగాపడి ట్రాఫిక్ జామ్ అయిపోయింది మోపెడ్ డ్రైవరులేచి యాందియ్యా! యాంది? అంటూ కోపంగా కోటి దిశగా నడిచాడు అతనివంక తిరిగి చూడకుండా విలాసిని దీప్ వున్న బస్ దిశగా పరిగెత్తాడుకోటి! కాని అప్పటికే ఆ బస్ కనుచూపుదూరం దాటి పోయింది!

(ఇంకా ఉంది)

'ఉత్తరాలు' శీర్షికకి రాసే వారు

తమ పేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.



# వారఫలం

**14-8-1987 శుక్రవారం మొదలు 20-8-1987 గురువారం వరకు**

★ **మేషం** స్థిరాస్తి పెంపొందుతుంది మాటకు విలువ పెరుగుతుంది దరిదాపులలో మేలు చేకూరుతుందని ఆనందం మీకో మిత్రులకో, రాజకీయంగా మేలు జరిగిందని సంబరపడుతున్నారుగా! మంచిది స్త్రీలకు వృత్తిపరంగా చికాకులు రాకుండా చూచుకోండి

★ **వృషభం** అధికాదాయం, ఆనందం, వ్యాపార లాభం, స్థితియందు పెంపు ముఖ్యులను కలిసికోవటం దూరబారాల ప్రయాణం క్రొత్త ఉద్యోగాలందు స్థిరంగా ఉండటం నూతన వృత్తియందు వికాసం చెప్పదగిన విషయాలు స్త్రీలకు సర్వరంగాలలో వికాస మున్నది ఆదాయ మున్నది

★ **మిథునం** మాటకు విలువ పెరుగుట గమనార్హం వృత్తి యందు పెంపు లభించుట గమనింపదగిన అంశం అనుకూల మిత్రులు చేరుతారు గ్రహిస్తారుగా! వృత్తియందు పూర్వపు రోజులకన్నా వికాసవంతమైన రోజులే స్త్రీలకు దూరబారాల నుండి మిత్రులో, బంధువులో వారాంతంలో యింటికి రానున్నారు

★ **కర్కాటకం** ఇంట శుభం జరుగవచ్చు ఎక్కడ ఎదురు చూచారో ఆ ప్రాంతాన్నుండి పైకం అందవచ్చు ఈ వారం రాజకీయపు ఆలోచనలు తగవు మాటకువిలువ పెరగటం గమనింపదగిన అంశం ఆదాయానికి లోటు లేదు స్త్రీలకు వృత్తి, ఉద్యోగాలు లాభదాయకాలే దనలబ్ధి యున్నది

★ **సింహం** విచిత్ర వ్యక్తుల సంబంధం ఉంటుంది పది మందిలో పేరు ప్రతిష్ఠలు రాబోతాయి ఉద్యోగంలో ప్రమోషన్ ఆశింపవచ్చు రాజకీయంగా అంత మేలు గాదు, ఊరకుండుటయే శ్రేష్ఠం స్త్రీలకు ఆదాయం, ఆనందం, వృత్తి యందు మేలు

★ **కన్య** ఎవరేమనుకొన్నా మీరు కదల వద్దు, ఉలక వద్దు ఆరోగ్య లోపం ఉంటుంది కాన ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది బంధువులతో గాని కులం వారితో గాని తొందర అతిశయిస్తుంది నూతన ప్రయత్నాలు పలవంతమే స్త్రీలకు ప్రభుత్వోద్యోగులతో పరిచయం, స్వల్పాదాయం

★ **తుల** అభీష్టం నెరవేరిందిగా! శని మేలు చేసాడుగా! రాజకీయంగా మేలు జరిగిందిగా! తమాషాలతో అషామాషీగా కాలయాపనం చేయకండి క్రొత్త ఉద్యోగానికి యత్నిస్తున్నారా? ఎందుకు? వచ్చేది ఎలాగ రానున్నది స్త్రీలకు వాహన సౌకర్యం, దనలబ్ధి

★ **వృశ్చికం** ఇప్పట్లో మేలు జరుగదు రాజకీయంగా మేలుగాదు వృదా శ్రమకు గురికాకండి ఉద్యోగరీత్యా మేలు జరుగనున్నది ఆలోచనలతో వ్యవహరించటం న్యాయం అనుకూల వార్త వింటారు కొందరకు వాహన లాభమున్నది, గ్రహించారుగా! స్త్రీలకు విద్యావంతుల, దనవంతుల సహాయం చేకూరుతుంది

★ **ధనుస్సు** అనుకూలం గల సమయం నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది వృత్తి యందు పెంపు చేకూరుట చెప్పదగిన విషయం రాజకీయంగా మేలే, వ్యర్థపు టాలోచనలతో కాలం వ్యర్థం చేయకండి స్త్రీలకు మంచి ఆలోచనలకు, అనుభవానికి యిది సమయం, శుభం కూడ జరుగనున్నది, గ్రహిస్తారుగా!

★ **మకరం** అధికారమందువృద్ధి ఆదాయం అంతో యింతో పెరిగిందిగా! రాజకీయాలందు ప్రగతి సాధించారుగా విద్యా విషయంగా పెంపు చేకూరిందిగా! విద్యావేత్తలను కలిసి కొన్నారుగా! లాభించిందిగా స్త్రీలకు సర్వ విధాలా మేలే కళారంగాన మేలే ఆదాయ మున్నది

★ **కుంభం** సులభంగా అనేక పనులు నెరవేరుతాయి అలక్ష్యంగా ఒక కార్యం చేసి యిబ్బంది పడుతారు బంధువుల వలన కొంత వత్తిడి తగుల వచ్చు రాజకీయాలందు నిన్న మొన్న మేలు సాధించారుగా! చాలదా? ఇక ఉబలాటం అనవసరం స్త్రీలకు మాటకు విలువ, చక్కని ఆదాయం, ఉద్యోగమందు పెంపు

★ **మీనం** రాజకీయ వ్యవహారాలు దూరంగా ఉంచండి ప్రయాస పడినది చాలు ఏమి సాధించామని మీరే అనుకొంటారు వృత్తి యందు మేలున్నది చేసే వ్యాపారాన్ని హాయిగా చూచుకొండి చాలు స్త్రీలకు అనుకొనని విధంగా ఆదాయం, సుఖశాంతులు, వృత్తిపరంగా మేలున్నది రాజకీయంగా అనుకూలం

విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## తండ్రి నిరాదరణ సవతి తల్లి ఛీత్కారం

ఆనందరావు ఆ రోజు తిరుగని చోటులేదు అప్పుకోసం కాదు తన బిడ్డ మోహన్ కనిపించటం లేదని వెతికి వెతికి ఒక్కసారి నీరసంగా ఒక చెట్టు క్రింద కళ్ళు మూసుకుని పడుకున్నారు మసక మసగ్గా మోహన్ రూపం కనిపించ సాగింది నాన్నా నన్ను కొట్టకండి అంటూ

ఆనందరావు బార్య మోహన్ పుటకలోనే ఈ లోకం వదలిపోయింది



ఆనందరావు మళ్లా పెళ్లి చేసుకున్నాడు అతనికి బార్యఅయితే కాగలిగింది కానీ మోహన్‌కి తల్లి కాలేకపోయింది లీల లీలకు కూడా పిల్లలు పుట్టటంతో మోహన్‌ని అసలు చూడడం మానేశారు ఆనందరావు దంపతులు ఆకలికి అలమటించి మాతృ ప్రేమకోసం అల్లాడిపోయింది పసిమనస్సు మొదట్లో చిల్లర దొంగతనాలు ప్రారంబించి 10 ఏండ్లు వయస్సుకే జేబుదొంగలా తయారయ్యాడు ప్రతి రోజూ బయటకు వెళ్లటం జేబులు కత్తిరించటం తినటం ఇదీ అతని దినచర్య తండ్రి నిరాదరణ సవతి తల్లి ఛీత్కరింపుల్లతో పెరిగిన మోహన్ సంఘానికే చీడ పురుగులా తయారవసాగేడు తన అసమర్ధత మూలకంగానే మోహన్ అలా తయారయ్యాడని ఈ రోజు జ్ఞానోదయమయ్యింది ఆనందరావుకి తన ఆఫీసరు పర్సుకొట్టి పారిపోతున్న మోహన్ను గట్టిగా పట్టుకుని మొఖం చూసేసరికి తన రక్తం పంచుకొని బిడ్డ ఇలా తయారయ్యేడే అంటూ కొట్టారు తండ్రి కనిపించేసరికి, అందునా దెబ్బలు తగలంగానే పారిపోయేడు మోహన్ మోహను అలా అవటానికి కారణం ఎవరు? నూటికి నూరుపాళ్ళు తల్లిదండ్రులే ఉలిక్కిపడి లేచిన ఆనందరావుకి దూరంగా పడుకొని వున్న మోహను కనిపించాడు ప్రేమగా దగ్గరకు తీసుకుని నాలాంటి వాళ్ల వల్ల మీ గాతలు మిగిలిపోతున్నాయి బాబూ! అంటూ హృదయానికి హత్తుకున్నాడు ఆనందరావు ఇక మీదట జాగ్రత్తగా పెంచాలి పిల్లల్ని అనుకున్నాడు దృడంగా

-కె శ్యామలాకృష్ణ, బాపట్ల

★ ★ ★

## బాలల శత్రువు పేదరికం

సాదారణంగా పిల్లల అలవాట్లు, ప్రవర్తన ఆలోచనలు ప్రపంచాన్ని అర్థం చేసుకొనే తీరు తెన్నులన్నీ వారు పెరిగిన వారిని పెంచిన పరిసరాలు, పరిస్థితులపై ఆదారపడి వుంటాయి విరజాజుల్లా విచ్చుకొంటున్న బాలల, రేపటి వారికి వెలుగు చూపాల్సిన బాలల జీవితాలెన్నో అందకారమయమై పోవడానికి పిల్లలు ప్రక్కదారులు పట్టి చెడిపోవటానికి కూడా అనేక కారణాలున్నాయి తల్లిదండ్రుల నుండి ఎదురయ్యే బాధలు బరించలేక స్కూలంటే బయం చేత క్లాసులకు పోకుండా ఎగ్గొడుతూ పెద్దలను ఘబ్యపెట్టి ఎక్కడెక్కడో తిరుగుతుంటారు నేడు విడుదలవుతున్న అశ్లీల చిత్రాల వాల్‌పోస్టర్లు, చిత్రాలు పిల్లలపై చెడు ప్రబావం చూపిస్తాయి చీట్ల పేకలు సిగరెట్లు ఇలాంటి ఇంకెన్నో ఆకర్షించి ఇంట్లో డబ్బు దొంగతనాలు మొదలు పెడుతుంటారు

నవ్వుతూ త్రుళ్ళుతూ చీకూచింత లేక గడపాల్సిన బాల్యం ఎంతో మందికి కష్టాలు, కన్నీళ్ళతో మొదలవుతుంది ఎక్కడి కక్కడ ఫ్యాక్టరీలలో, వర్కుషాప్స్‌లో రైల్వేస్టేషన్, బస్‌స్టాండ్, చిన్న చిన్న క్యాంటీన్లలో ఈ దేశపు బాల్యం రెక్కలు ముక్కలు చేసుకొంటూ దర్శనమిస్తుంది పల్లెల్లో పశువులు కాస్తూ, కలుపులు తీస్తూ పేద తట్టలు మోస్తూ పసి పిల్లలు కన్పడుతూనే ఉంటారు

పేద ధనిక వ్యత్యాసం లేకుండా భూగోళమంతా విస్తరించిన దుర్భర దృశ్యాలివి తల్లిదండ్రులు పిల్లల చేత పని చేయించటానికి అసలు కారణం దారిద్ర్యమే

దుర్భర దారిద్ర్యం నడుమ పెరిగే పిల్లలు మానసికంగా శారీరకంగా అనేక వ్యాదులకు గురవుతారు పెద్దలు తిండి గింజల కోసం పగలంతా చాకిరీ చేసి వచ్చి, అలసి సొలసి రాత్రంతా నిద్ర తీసి మళ్ళీ ఏ చీకటితోనో లేచి పగలు పన్లోకెళుతుంటారు అలాంటప్పుడు వారికి, తమ పిల్లలు ఏం చేస్తుందీ తింటున్నదీ ఎక్కడెక్కడ తిరుగుతుందీ తెలియడానికి అస్కారం లేదు ఒక వేళ తెలిసినా వారి పోషణకు ఆర్థిక పరిస్థితులు సహకరించవు పేదరికం బాలల పాలిట శత్రువై వారి బావి జీవితాన్ని బాదామయం చేస్తున్నది




అంతే కాకుండా క్రిక్కిరిసిన ప్రాంతాలలో పెరగడం వల్ల కుటుంబ జీవితంలోని అస్థిరత వల్ల పిల్లలు చాల మంది మానసిక రుగ్మతలకు గురవుతున్నారు

ఈ దురవస్థకు బాధ్యత ఏ ఒక్కరిదో కాదు అసలు లోపం మన సామాజిక వ్యవస్థ నిర్మాణంలో ఉంది కనుక సాంఘిక వ్యవస్థలో మార్పులు తేవడానికి కృషి చేసి బాలల సంక్షేమానికి తమ వంతు బాద్యతను నిర్వర్తించాలి బిడ్డల జీవితాలను బావి పౌరులుగా తీర్చి దిద్దడం అవసరం పువ్వుల్లా వికసించాల్సిన జీవితాలను చెడు అలవాట్లకు దూరగా ఉంచి వారి స్వయం కృషితో జీవితాన్ని గడపడానికి వృత్తి శిక్షణ నిచ్చే సంస్థలు ఎక్కువగా స్థాపించాలి పని గంటలు తగ్గించి వారి జీవితాలను క్రమబద్ధం చేయడం ద్వారా పిల్లల్లో చదువుకునే ఆసక్తిని పెంచొచ్చు -డి ప్రసన్నకుమారి, బోడపాడు, (గుంటూరు) □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్‌కోడ్

# మట్టిగాజులు

## కుమారి ఎ.వి. శేషారత్నం

ఫ్యాన్ గాలికి తెల్లకాగితాలు రెప రెపలాడుతున్నాయి–

కథ మొదలుపెట్టబోతున్నాను ఇంతలో – రెండు చిట్టి చేతులు నా కళ్ల ముందు ఆడుతూ నించున్నాయి

నరిసి!

'ఏంటి సంగతి పనయిపోయిందా ?' అన్నాను నవ్వుతూ

చెవుల పిల్లిలా తలూపింది నరిసి

'శ్రీలత గాజులు అమ్మగారు నాకిచ్చేసారు– బంగారు రంగులో బాగున్నాయి కదండీ'–మళ్లీ రెండు చేతుల్ని నా కళ్లముందాడించింది నరిసి

'చాలా బాగున్నాయి బిందూ!'

'బిందూ' అనేసరికి నరిసి మొహం ఒక్క క్షణం వెలిగింది

'మీ రొక్కరే నన్నలా పిలుస్తున్నారు మా అమ్మగారు, అయ్యగారు అళ్ల పిల్లలు నరిసి' అనే పిలుస్తున్నారు' నరిసి మొహం చిన్నబోయింది మళ్లీ

తన పేరెందుకో నచ్చలేదుట నరిసికి శ్రీలత, శుబ, చిట్టిబాబు లాంటి గొప్పవాళ్ల పిల్లల పేర్లతో పోల్చి చూసుకుని ఓ రోజు పరిగెత్తుకుంటూ వచ్చింది నరిసి

'టీచర్‌గారూ! మీరు నాకెలాగైనా అందమైన పేరు పెట్టాలి '

'నీ పేరుకేమైంది నరిసీ! చక్కగా ఉంది'

వీధిలో పిల్లలంతా నరిసీ బురిసీ కరిసీ అంటూ వెక్కిరిస్తున్నారు టీచర్‌గారూ! మా అయ్యకి పేరెట్టడం రాదులెండి మా అక్కకి సుబ్బి, నాకు నరిసి, మా అన్నకి అంజి– అన్ని ఇలాటి పేర్లే పెట్టాడు మీ రెలాగైనా నా పేరు మార్చేయండి '

నాకు నవ్వొచ్చింది

నరిసి మొదట్నుంచీ నాకో పెద్ద పజిల్

నేనీ ఊరికి కొత్తగా ట్రాన్స్‌ఫరయి ఈ ఇంట్లో దిగిన కొత్తలో మా యింట్లోకి పరుగెత్తుకొచ్చింది నరిసి

పచ్చగా కళ కళ్లాడుతున్న ఆ ఎనిమిదేళ్ల పిల్లని చూసి పనిపిల్ల అనుకోలేదు నేను

సబినస్పెక్టర్ గారింట్లో పని చేస్తోంది నరిసి మూడేళ్ల క్రితం వాళ్లమ్మ తీసుకొచ్చి పూర్తిగా వీళ్ల యింట్లో పనికి అప్పజెప్పేసిందట సబినస్పెక్టర్‌గారి భార్య కూడ చాల మంచిది ఈ పిల్లచేత పని చేయించుకుంటున్నా తన పిల్లలతో సమానంగా అన్ని పెడుతుంది మరీ చిరిగిపోయిన బట్టలు కాకుండా వాళ్ల రెండో పాపకి పొట్టి అయిన మంచి బట్టలు నరిసికిచ్చేదావిడ

'మీకేం భయంలేదు టీచర్‌గారూ!! నేనున్నానుగా మీకెప్పుడవసరమయినా నన్ను పిలవండి నా పేరు నరిసి అదిగో ఆ పచ్చ మేడలో ఉంటాను మీరు పెద్ద బళ్లో టీచర్‌గారటగా పచ్చమేడ ఓనర్‌లా– గలగలా సెలయేరులా పలుకుతున్న ఆ పిల్ల మొహం నిర్మలంగా తేటగా ఉంది నరిసి రాకతో నిజంగానే నా ఒంటరితనం దూరమైంది

అంట్లు తోముతుంటే చూస్తే తప్ప ఆ పిల్లని పని మనిషనుకోవడం కష్టం కడిగిన ముత్యంలా ఉండేది ఎప్పుడూ

అంత మంది పిల్లలకి చదూ చెప్తారుకదా! నాకూ నాలుగక్షరాలు చెప్పకూడదా టీచర్‌గారూ!'

ఒక రోజు రపీమని అడిగేసింది

నాక్కాస్త ఆశ్చర్యం కలిగింది ఆ ఈడు పిల్లలకి చదువుమీద కంటే ఆటలమీదే ధ్యాస ఎక్కువ స్కూల్లో చూస్తుంటానుకదా! ఎంతో డబ్బు ఖర్చుపెట్టి శ్రమపడి పిల్లల్ని స్కూలుకి పంపే తల్లిదండ్రుల కళ్లలో కోటి ఆశలు కాని వయసు ప్రబావమో అన్ని అమరిన అలుసుదనమోగాని నాలుగక్షరాలు అంటే పిల్లలు తక్కువే

కాని నరిసి శ్రద్ధ చూస్తే ముచ్చటేసేది మధ్యాహ్నం సబినస్పెక్టరుగారి భార్య విశ్రాంతి సమయంలో నే దానికి తీరిక చిక్కేది నాకది స్కూలు సమయం అందుకని శని, ఆదివారాలు ఎలాగో ఒక గంట తీరిక చేసుకుని పలక బలపంతో హాజరయిపోయేది శ్రద్ధగా చెప్పిన ప్రతి మాటా నేర్చుకొని అప్పుడే ఒకటో తరగతి పుస్తకం పూర్తి చేసేసింది చాల చురుకైన పిల్ల

'ఒక్కసారిగా నీకు చదువు మీద మోజెందుకు పుట్టిందే బిందూ!

అంటే అమ్మగారి పిల్లల్లా పెద్ద బేగ్, కేరేజితో స్కూలుకెళ్తే బాగుంటుంది కదూ? కాదు కాదు బాగ్గా చదువుకుని పెద్దయ్యాక మీలా మంచి ఉద్యోగం చేసుకుని బ్రతకొచ్చుని అరిందాలా అంది– చిన్న మెరుపు–

'నీ ఉద్యోగానికేం బ్రహ్మాండంగా ఉంది–' అన్నాను నవ్వుతూ–

తలాడించింది నెమ్మదిగా–

తను పని చేసే ఇంటిని ఎప్పుడూ కించపరిచి మాట్లాడే అలవాటులేదు నరిసికి, దానిలో ఎక్కువ నచ్చిన గుణం నాకు అదే కొందరు పని పిల్లలు ఇక్కడ మాటలక్కడ అక్కడ మాటలిక్కడ చెప్పి పబ్బం గడిపేసుకుంటారు కాని నరిసి దానికి పూర్తిగా వ్యతిరేకం

మా అమ్మగారు నన్నెంతో బాగా అళ్ల పిల్లలతో సమానంగా చూస్తారండి' అనేది ఎప్పుడూ

శ్రీలత వాడిన వస్తువులు సెకండ్‌హాండ్‌గా నరిసికే వచ్చేవి వెంటనే వాటిని వేసుకుని నాకు చూపించేది అసలే అందమైన పిల్లేమో ఆ బట్టల్లో నిజంగా మరింత మెరిసిపోయేది నరిసి

'నీకు మీ అమ్మ నాన్నలని చూడాలనిపించదా బిందూ?'– అడక్కూడదనుకుంటూనే అడిగాను ఓ రోజు

'మా అమ్మకి తీరదు నెలకోసారి అయ్య చూసి పోతున్నాడు కదండీ!!

–నరిసి మాటల్లో ఎక్కడో చిన్న అసంతృప్తి

'అయినా ఇక్కడ అమ్మగారు నాకేం లోటు చేస్తారండి చక్కగా కమ్మని కూరలతో బోజనం ఫ్రిజ్‌లో చల్లని నీళ్లు, మంచి బట్టలు ' కళ్ల మీద పడుతున్న జుట్టు పైకి తోసుకుంది

నిజమేననిపించింది నాకు

నరిసి ఇంటికెళ్తే ఏముంటుంది? ఎటు చూసినా దరిద్రం

'మా అమ్మ చేతులు అంట్లు తోమి తోమి కాయలు కాసేసాయండి నీళ్లు మోస్తూనే వుంటుంది ఎప్పుడూ ఎవరికేం కావాలన్నా అళ్లందరికీ దుకాణాలకెళ్లి సరుకులు మోసి పెడుతుందండి!'

నరిసి తల్లి పాచిపని చేసుకుని బ్రతుకుతోందని అర్థమైంది ఒకసారి తీలగా నరిసి కళ్లలో తడి–

'మా నాన్న తాగొచ్చి మా అమ్మని చావగొడతాడండి మా అమ్మ ఏసిగెత్తిపోయిందండి మా అన్నకి ఎంత చదివినా చదువు రాడం లేదండీ అక్కడ మా యింట్లో రాత్రి దాచిన

అన్నం పొద్దుటే పిల్లలందరికీ పెట్టి మా అమ్మ అసలు ఏం తినదండి నేను చూడండి పోతురాజులా అన్నీ ఎలా తినేస్తున్నానో

ఒక రోజు కాకరకాయ కూర వండుతుంటే వచ్చింది ఆ పిల్ల మొహం చూసి ఆ కూర నరిసికి చాలా యిష్టమని గ్రహించాను— ఇవాళ మీ బేబీ అయ్యగారొస్తారని వండుతున్నారుకదూ!'

'తింటావా బిందూ!!

''వద్దండీ మా అమ్మగారు ఏమైనా అనుకుంటారు

ఈ పిల్ల భావం నాకర్థమై జాలేసింది తేలిగ్గా నవ్వుతూ 'అవునులే ఇంతకంటే ఖరీదైన కూరలే వండి పెడతారు కదూ మీ అమ్మగారు?' అన్నాను

'మరేనండీ!! ఎంత ఖరీదైన కూరలైనా ఆళ్ల పిల్లల కిష్టమైనవే చేస్తారు కదండీ అవినాకూ ఇష్టమే లెండి—

వయస్సుకి మించిన జ్ఞానం ఉంది నరిసికి

తల్లీ తండ్రీ దగ్గర ఏ గంజినీళ్ళు తాగి, చింకి బట్టలు వేసుకున్నా ఆడుతూ పాడుతూ తిరగాల్సిన పిల్ల—దరిద్రం కారణంగా నా అన్నవాళ్ళకి దూరంగా ఇంత చిన్న వయస్సులో పని చేసుకు బ్రతుకుతోంది అయినా పైకి అసంతృప్తిని ఎప్పుడు ప్రకటించదు నరిసి పేదరికం ఆ పిల్లకిలేని పెద్దరికాన్ని అంటగట్టింది

నరిసి గలగలా నవ్వినా— నా కెప్పుడూ నా భావుకత్వం వల్లనో ఏమో ఎప్పుడూ అందులో జీవం లోపించినట్టనిపించేది

కాని నిన్న సాయంత్రం—

నేను డాబామీద చల్లగాలి కోసం పచార్లు చేస్తూంటే ఆయాసపడుతూ మెట్లెక్కి వచ్చింది నరిసి

ఆ పిల్ల మొహంలో ఎన్నడూ నే చూడని ఉత్సాహం ఉరకలు వేస్తోంది

రెండు చేతుల నిండా మట్టిగాజులు గలగల్లాడిస్తూ గంతులేస్తూ వచ్చింది

'టీచర్‌గారూ!! ఈ గాజులు మా నాన్న నా కోసం కొని తెచ్చాడండీ! ఈ గౌను మా అమ్మ పంపిందండీ? కారప్పూస కూడా తెచ్చాడు

నాకేదో స్ఫురించింది

సబిన్స్పెక్టర్‌గారి పిల్లల గాజులు గౌన్లు ఇంతకంటె అందమైనవి వేసుకున్నప్పటికీ నరిసి మొహం ఇంత కళకళ్లాడుతూ ఎప్పుడూ లేదు

చౌక చీటీ గుడ్డతో కుట్టించిన ఆ గౌను—

రంగుల మట్టిగాజులు - కారప్పూస పొట్లం— తండ్రి తెచ్చిన ఆ గాజులు గౌను ఆ పిల్ల స్వంతంగా భావించింది ఎంతో అపురూపమైన ఆనందం ఆ పసి ముఖంలో —

అన్నట్టు మా నాన్నని మీకు చూపించాలనుకుని వచ్చానండీ! మీరు చదువు చెప్తున్నారంటే మా నాన్న ఎందుకో కళ్ళమ్మట నీళ్ళెట్టుకుని— బాగా సదువుకో తల్లీ' అన్నాడండి మా నాన్న ఇప్పుడు తాగడండి అదిగో నాన్న మలుపు తిరిగి పోతున్నాడండి యీడు నెలలదాకా మళ్ళీ రాడటండీ మాటి మాటికి వస్తే కూలి డబ్బులు పోతాయికదండీ!!'



ధర్మపథం

# నాగరకత




పల్లెలలో ఉండే వారికంటె నగరాల్లో ఉండేవారికి ప్రపంచ జ్ఞానం ఎక్కువగా ఉండడం సహజం ఒక గ్రామీణుడైన బాలుడు కొత్తగా పట్నానికి వెళ్ళి అక్కడి మేడలను చూచి, ఇదేమిటి? ఇంటిమీద ఇల్లు ఎక్కి ఉన్నదే!' అని అందరికీ నవ్వు కలిగించాడని వినోదంగా చెప్పుకుంటారు ఈ నాగరకత క్రమంగా వేష భాషలని సూచించేదిగా మారిపోయింది పురుషుల మాదిరిగా స్త్రీలు కూడా ఉద్యోగాలకు వెళుతూ ఉండడం సర్వ సాధారణంగా కానవస్తున్నది నేటి కాలపు వాతావరణ దృష్ట్యా వారు- వివాహానంతరం పెద్ద కుటుంబం నుంచి విడిపోయి వేరుగా ఉండడానికే ఇష్టపడతారు దంపతు లిద్దరూ ఉద్యోగాలకు వెళ్ళితే ఇంట్లో పిల్లలను చూసుకునేవారు ఉండనందున అందుకు వేరే ఏర్పాటు చెయ్యవలసి వుంటుంది

పిల్లలు కొంత పెద్ద వాళ్ళయాక వాళ్ళను హాస్టల్సులో ఉంచవలసి వస్తుంది ఎప్పుడో చుట్టం చూపుగా వాళ్ళు ఇళ్ళకు రావడం, తిరిగి వెళ్ళి పోవడం జరుగుతూ ఉంటుంది ఇందువల్ల తలిదండ్రుల

ప్రేమకు వారు దూరమయి పోతారు ఈ నాగరకత మూలంగా దగ్గరగా ఉండవలసిన వారు దూరమై పోతారు

పూర్వం, కుటుంబం సమష్టిగా ఉండడం వల్ల పరస్పరం ప్రేమాభిమానాలు వుండేవి పరస్పర సహకార భావం ఉండేది కుటుంబంలోని అందరూ తలొక పనీ చేసుకోవడం వల్ల ఎవ్వరికీ శ్రమ అనిపించేది కాదు స్త్రీలకు గృహకృత్యాలతో నే కాలం గడిచి పోయేది పిల్లలకు ఏమయినా అనారోగ్యం కలిగితే వారే తగిన చికిత్సలు చేసేవారు కాని ప్రతీదానికి డాక్టరు వద్దకు పరుగెత్తేవారు కాదు మగవారిలో కొందరు ఉద్యోగం చేస్తున్నా, సమీప స్థలాల్లోనే పని చేసి, రాత్రికి ఇల్లు చేరుకునే వారు ఇంటికి వచ్చిన కోడలిని కన్న కూతురు వలెనే చూచుకోవడం, ఆ అమ్మాయికి వినయ విధేయతలు, పెద్దల పట్ల గౌరవం ఏర్పడేవి అప్పటివారు పది మంది ఉన్న కుటుంబంలోనే పిల్ల నివ్వాలని కుతూహల పడేవారు కాని, ఇప్పటి వారివలె ఇరస్తూ, పరస్తూలేని కుటుంబాన్ని వెతికేవారు కారు

నాగరకత వల్ల అలక్ష్యబావం పెచ్చు పెరిగినట్లు కానవస్తున్నది వివాహం కాగానే, వచ్చిన అమ్మాయి వేరింటి కాపరానికే ప్రయత్నిస్తుంది, తనకు స్వాతంత్ర్యం కోరుతూ స్వాతంత్ర్యం కోరదగినదేకాని, అది పెద్దలను ధిక్కరించే రీతిలో ఉండ కూడదు తన భర్తను పెంచి, పెద్ద చేసి, చదువు చెప్పించి, వృద్ధికి తెచ్చిన తలిదండ్రులకు దూరం చేసే ధోరణి మాత్రం తగదు స్వార్థంతో, వారిని గమనించక పోవడం సాధారణంగా కానవస్తున్నది

నాగరకత జ్ఞానానికీ, ఉదార భావాలకూ, సహకారానికి ప్రతీక వాటితో దానికి సంబంధం లేనప్పుడు ఆ నాగరకత నేతి బీరకాయ వంటిదే అవుతుంది

– బులుసు వేంకట రమణయ్య

---

నా చేయి పట్టుకుని పిట్టగోడ దగ్గరకి తీసికెళ్ళింది మలుపు తిరగబోతున్న ఆ వ్యక్తి ముఖం నాకు స్పష్టంగా కనిపించింది ఆ కర్రకాలు!!

కడుపులో పేగులు ఎవరో మెలితిప్పుతున్న బాధ- ఆ వ్యక్తి రాజయ్య!

నేనింతకు ముందు పని చేసిన స్కూలు దగ్గర అడుక్కుంటూంటాడు చాల మంచివాడు నాకీ వూరు ట్రాన్స్‌ఫరయ్యే అర్నెల్లు ముందు ఆ స్కూలు దగ్గరకి చేరాడు

గుడిసె కాలిపోయి పెళ్ళాం బిడ్డలు మాడి మసై పోయారట మంటల్లో దూకిన ఇతని కాలు తీసెయ్యవలసి వచ్చిందట

అక్కడున్నన్నాళ్ళూ వారానికోసారి రేకుడబ్బా తీసుకొచ్చేవాడు అందులో అన్నీ చిల్లర డబ్బులు

అమ్మగారూ!! ఒకప్పుడు నేను బాగా బతికిన వోడ్నండి తాగి ఇల్లూ ఒళ్ళూ గుల్ల చేసుకున్నాను

## మట్టి గాజులు

ఇప్పుడు అడుక్కు తిని బతకాల్సి వస్తోంది ఈ కుంటికాలు మడిసికి ఎవరు పనిస్తారండి నా పెళ్ళాం బిడ్డలు ఇల్లుకాలి చచ్చిపోయారండి!!

ఒక్క సిన్న బిడ్డని ఆళ్ళమ్మ దూరం ఊళ్ళో గొప్పోళ్ళ ఇంట్లో పనికెట్టిందండి ఈ డబ్బులన్నీ దానికోసం కూడబెడుతున్నానండి మిగిలిన ఆ నలుసుని ఇక్కడికి తెచ్చేసుకుందామని ఉన్నా అడుక్కుతినే సవుటు సన్నాసిని దానికేటి ఎట్టగలను?? అక్కడ రాణిలా బతుకుతోందండీ! దాని పెళ్ళికి కాసిని డబ్బుల్ను పోగవుతేసాలు ఇవి దాచిపెట్టండి అమ్మగారూ! ఏడ్చి రాగాలు పెడుతుందని తల్లి అప్ప అన్న సచ్చిపోయినట్టు సెప్పలేదమ్మా నా బిడ్డకి

'టీచర్‌గారూ మా అయ్యని చూసారా??'

నరిసి మాటతో ఈ లోకంలోకి వచ్చిపడ్డాను

ఆ పసి ముఖంలో ఎప్పుడూ లేనంత ఆనందం

తండ్రిని చూసిన సంబరమా??

శ్రీలత ఇచ్చిన బంగారు గాజులకంటే ఇవి ఎక్కువ బాగున్నాయి కదూ టీచర్‌గారూ! అయ్య తెచ్చాడు'

అపురూపంగా మట్టిగాజుల్ని చూసుకుంటున్న నరిసిని చూసి నాకో సత్యం స్ఫురించింది- చాల ఆలస్యంగా-

ఫ్రిజ్‌లో ఐస్ నీళ్ళకి లేని రుచి మట్టి కుండలోని తియ్యని నీళ్ళకి ఉంది

'బిందూ – అన్నాను ఆ పిల్లని దగ్గరకు తీసుకుని చేతులు ముద్దు పెట్టుకుంటూ- నరిసిలో మా బేబీ ముఖం కన్పించింది

నా మనసులో మట్టి గాజులు'- కథ మహావేగంగా రూపుదిద్దుకుంటోంది ☐

# దూరదర్శనం



లత

## రథచక్ర

పాపం కొడుకు చదువు కోసం వక్కలు వలిచే పనిచేస్తుంది- కాని ఆ వ్యాపారి ఇరవయ్యేళ్ళ కొడుకుగా ఆ అందవికారపు తల్లి మీద మనసుపడి బలాత్కారం చేయబోతాడు- కత్తి తీసి బెదిరించి వాడిని వెళ్ళగొడుతుంది వక్కల వ్యవహారం చూస్తే కన్నడ నవలలాగానే ఉంది

*　　*　　*　　*　　*

మధ్య ప్రదేశ్ పర్వతీయగానం అని వినిపించారు ఏదో బాగానే ఉంది కాని క్లాసికల్ ఇన్స్ట్రుమెంట్స్ వినిపిస్తున్నాయి మురళి పర్వతీయుల వాద్యమే అయినా అందులో శాస్త్రీయ సంగీతం వినిపిస్తోంది

## ప్రథమ ప్రతిశృతి

ఆశాపూర్ణాదేవి వ్రాసిన బెంగాలీ నవల ఆధారంగా నాటిక – ఆశాపూర్ణా దేవి జ్ఞానపీఠ అవార్డు విజేత కాని ఆవిడ నవల ఒకటి కూడా నేను చదివాను చాలా సామాన్యంగా ఉంది మరి చూద్దాం ఈ ప్రథమ ప్రతిశృతిని- నిత్యానందపురంలో రామకాళీచటర్జీ వైద్యుడు- అతని భార్య భువనేశ్వరి ఇంకా మోక్షదా రాసబిహారి శారదా ఆకుటుంబంలో ఉన్నారు శారద గర్భవతి అవటంవల్ల ఇంకో చిన్న కొడుకూ సత్యవతి అనే ముద్దుల కూతురూ ఉన్నారు ఇదీ పాత్రల పరిచయం- సత్యవతి చదవటం మహాపాపంగా భావించే ఆకుటుంబంలో ఆ పిల్ల చదువు రివల్యూషన్ తెచ్చింది స్త్రీ విద్య ఆశాపూర్ణాదేవి చిన్న తనంలో అంత సమస్యగా ఉండేదేమో నేటి కాలానికి అది పాతకథ అయినా బాగానే ఉన్నట్లుంది- మొదటి భాగంలోనే చాలా పాత్రలు వచ్చినయి అందులో ముఖ్యంగా ఇద్దరు వితంతువులూ వేపచెట్టు మీద సంభాషణా ఉన్నాయి బెంగాలీ నవలలోనే కాదు జీవితంలో కూడా వేపలది ముఖ్య పాత్ర మనం తెండి గురించి అంతగా మాట్లాడం

## కాబూలీ వాలా

బెంగాలీ సినిమా చూపించారు ఈ మధ్య బెంగాలీ అర్థంకానివి చూసీ చూసీ చాలా విసుగేసిన జనానికి గురుదేవుడు ఠాగూర్ వ్రాసిన కాబూలీ వాలా కథ బాగా చూపించడం వల్ల మేలు హృదయం స్పందించి ఉండాలి నేను అలాగే పొందినాను కాబూలీ వాలా వేసిన అతను ఎంత గొప్పగా నటించాడో చెప్పలేం చాలా రోజులకి విప్లవం సెల్ఫ్ చెత్త లేని బెంగాలీ సినిమా చూశాం అన్నట్లు వేషం కూడా లేదు

*　　*　　*　　*　　*

ఈమధ్య నాట్యకళలంటే కూడా అసహ్యం పుట్టింది అలాంటిది ఒంటికి మంచిది కాదని కాబోలు మాధవీ ముదల్ ఒడిసీ నృత్యం చూపించారు ఏమి నాట్యం? చివరి అయిటం మోక్షం మరీ బాగుంది – మహానటి మాధవీ ముదల్ మన ఆంధ్రా ఆడపిల్లలు చేసే నాట్యాలు చూసి ఆ కళ అంటే విసుగు కలిగిన నాకు నాట్య కళమీద తిరిగి గౌరవం కలిగించిందావిడ

## కబీరు

కబీరు ఇల్లు కాల్పించారు మున్షీలాటి కొందరు ఆ శిథిల గృహంలోకి ఒక ఆడపిల్ల వచ్చింది భార్య అనుకున్నాను కాని ఆ అమ్మాయి ఎవరో అభిమానిస్తే అక్కడకి తీసుకు పోయి కడుపు తాను ఈ తరవ చూస్తూ ఎవరు ధర్మి ఎవరు అధర్మి లాంటివి కొన్ని చివరకు ఎవరో నీ పేరేమిటి? అంటారు కబురు అంటాడు ఈ నాటకం గాని కబీరు వేసినతను గాని రక్తి కట్టటం లేదు ఇంతవరకూ గొప్ప తత్వవేత్త గా కాని జ్ఞానిగా కాని రామ భక్తుడుగా కూడా కనిపించ లేదు ఏదో బ్రహ్మంగారి తత్వాలు లాటివి అంటున్నాడు

## విశ్వనాథ నాయకుడు

నాటిక రచన వెంకటప్పయ్య – దర్శకత్వం గోవింద చౌదరి – చారిత్రాత్మక నాటకం అవటం వల్ల చక్కగా రక్తి కట్టినది రాయల సేనాధిపతి నాగమనాయకుడి కుమారుడే విశ్వనాథ నాయకుడు ఆయన గురించి చరిత్రలో ఒకటి రెండు విభేదాలున్నాయి మామూలే ఇతడు తెలుగు వాడని కాదనికు కృష్ణదేవరాయల చివర కాలంలో అహమదుషా అళియరామరాజా – మిగిలిన బావమరది అయిన ఒక గజపతి పోరెమైన కుట్ర వేశారు ఈ గజపతి ఎన్ టి ఆర్ లాగా నటించాలని ప్రయత్నించాడు

అన్నగారు గొప్ప నటులన్నది నిర్వివాదాంశం- ఆయన్ని అనుకరించాలని అనుకోవటం ఆత్మహత్యా సదృశం అలాగే ఆ పక్క నున్న మంత్రి లింగమూర్తి గారిని అనుకరించాడు మహా విజయం బాగుంది

## కాలాజల్ – ఉగని

రోషన్ పెద వాడవుతాడు పెళ్ళి అవుతుంది ఆ పెళ్ళిలో ఆచారాలూ హాస్యాలూ పెళ్ళి కొడుక్కి కోపం రావటాలూ అన్నీ మన ఆచారాలే మొత్తం మీద చాలా వక్కని నాటిక ఉగని గొప్ప రచయిత లాగానే కనపడుతున్నాడు. □



'కబీర్'లో అనంగ్ దేశాయి, అమిత్‌పాండే.

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones Business : 61247, 61248, 75569 Editorial : 75667

# హైదరాబాదు నోట్‌బుక్

## ఆచార్య వి. రామచంద్ర :

చిత్తూరు జిల్లాలో కుశస్థలీనది అనే అందమయిన ఏరు పారుతుంది దాని వంపులు వయ్యారపు నడకలు, ఇసుకమేటలు దానిని దాటడానికి అక్కడ వేసిన చిన్న చిన్న బాటలు ఎవరికైనా మనసులో గాఢంగా నాటుకుని కవిత పాట మరిపిస్తుంది ఆ నదీ తీరంలో నే ఉంది నేలటూరు అనే పల్లెటూరు నేలటూరును తలచుకొగానే నాకు మహా విద్వాంసులు నేలటూరి రామదాసయ్యం గారు, నేలటూరి భక్తవత్సలం అయ్యంగారు మహాదాతలు, నిరతాన్న దాతలు అయిన నేలటూరి శ్రీనివాసాచార్యులు, నేలటూరి రామానుజాచార్యులు మొదలయిన మహాపురుషులు జ్ఞాపకం వస్తారు వీరంతా నేలటూరు నుంచి నెల్లూరుకు వెళ్లినవారు ఆలాటి నేలటూరి వాస్తవ్యులు కవులు, దర్శనిరతులు కావడం సహజం ఆ వూరిలో నే జన్మించారు మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్యడాక్టర్ వి రామచంద్ర ఆయన ప్రకృతి సౌందర్య ప్రీతిని ప్రేరేపించిన తమ ఊరిని, ఊరి నదిని ఇలా స్మరించారు

'మిలమిలలాడు నీ ఇసుక మేటలపై శయనించి మింటిపై
వెలిగెడి చుక్కలన్ గనులు విచ్చుక చూచి సుఖించు బోగముల్
తలపున బారి నా హృదయ దర్పణమందొక కోటి చిత్రముల్
తళుకు తళుక్కునన్ మెరసి త్రవ్వుచు నున్నవి నాటిగాడలన్

రామచంద్ర తండ్రి శ్రీ కొండమనీడు తల్లి శ్రీమతి మునెమ్మ శ్రీ కొండమనీడుకు మంచి నాటకానుభవం వుంది ఆ అనుభవ పలం కుమారునికీ దక్కింది శ్రీరామచంద్ర స్వగ్రామంలో ని ప్రాథమిక పాఠశాలలో మూడవ తరగతిలో వుండగా ఊరి పురోహితులు శ్రీ వేదాచలం అయ్యవారు బడికి వచ్చి కఠినమైన సంస్కృత పదాలూ సమాసాలూ నల్లబల్లమీద వ్రాసి విద్యార్థులను చదవమనేవారట అన్న శ్రీ మునికృష్ణయ్య ఆ వేదాచలం అయ్యవారి దగ్గరే అమరకోశం నీతిశాస్త్రం మొదలైనవిచదివేవారు మేనమామకు మంచి సాహిత్యాభిరుచి వుండేది ఈ కారణాలవల్ల శ్రీ రామచంద్రకు చిన్ననాటి నుంచే సాహిత్యాభిరుచి నాటకాభిరుచి కలిగాయి అప్పటి పద్ధతి ప్రకారం అమరం నీతిశాస్త్రం రామాయణం మొదలైన వాటిలో రోజూ కొన్ని శ్లోకాలు ప్రొద్దునే అప్పజెప్పాలి బడిలో సుమతి శతకం కాని కృష్ణ శతకం కాని బాలరామాయణం కాని పూర్తిగా చదవాలి తరువాతనే మామూలు చదువు ప్రారంభమవుతుంది ఈ పద్ధతిలో ప్రాథమిక విద్య కొనసాగింది రామచంద్రకు పిదప ఆయన 1949లో మద్రాసులో ముత్యాలపేట హైస్కూలులో 6వ తరగతిలో చేరి హైస్కూలు చదువు ముగించి పచ్చయప్ప కళాశాలలో ఇంటర్ చదివి విశ్వవిద్యాలయ ప్రథములుగా వచ్చారు తర్వాత విశాఖపట్నం వెళ్లి తెలుగు ఆనర్సులో చేరి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయారు హైస్కూలులో ఉండగానే పద్య రచన ప్రారంభించారు సుగంధి అనేది ఆయన తొలి పద్య రచన "ఏటా వక్తృత్వ వ్యాస రచన, పద్య రచనల స్పర్ధల్లో ప్రథమ బహుమతులు పొందే నన్ను మెడిసన్‌లో చేర్పించాలని మా అన్నగారిఇష్టం కాని నేను భాషా సాహిత్యాభిరుచితో తెలుగు ఆనర్సులో చేరాను అన్నారు నాతో ఆయన ఇంటరులో ఉండగా ఇంగ్లీషులో బ్లాంక్‌వర్సులో కొంత సాధన చేశారు అయాంబిక్‌పెంటా మీటర్‌లో వరూధినీ ప్రవరాఖ్యం ఆంగ్లంలోకి తర్జుమా చేశారు హైస్కూలు స్థాయి నుంచే నాటకాలాడారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎర్రాప్రెగడ రచనలపై పరిశోధన జరిపి డాక్టరేట్ పొందారు పిదప యు జి సి పెలో షిప్పులో డాక్టరేట్ అనంతర పరిశోధన జరిపి సిద్ధాంత వ్యాసం వ్రాశారు తిక్కన విరాటోద్యోగాలను , మూలంగా పోల్చి పరిశీలించడమే ఆ సిద్ధాంత వ్యాస విషయం 1969లో అప్పటికి శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం అనంతపురం పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్‌లో



లెక్చరర్‌గా చేరారు అక్కడ వారి ప్రవచన పరిశోధనలే కాక సాంస్కృతిక కార్యకలాపాలలో ఎక్కువగా పాల్గొన్నారు కొన్ని నాటికలు రచించి విద్యార్థులతో ఆడించారు అనంతపురంలో ని లలిత కళాపరిషత్తు కృష్ణ కళా మందిర్ మొదలైన సంస్థలు నిర్వహించిన వివిధ సాహిత్య సాంస్కృతిక కలాపాలలో ఉపన్యాసకులుగా అధ్యక్షులుగా అనంతపురంలో పద్మశ్రీ పైడి లక్ష్మయ్యగారి వంటి ప్రముఖులతో పరిచయం కలిగింది ఈ విధంగా రాయలసీమ అంతటా పర్యటించి వేల సాహిత్య సాంస్కృతిక ఉపన్యాసాలిచ్చారు 1984లో ఆంధ్ర గ్రాస్తావతరణ వార్షికోత్సవంలో కవి సన్మానం పొందారు 1976లో అనంతపురం వదలి మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో రీడరుగా చేరారు 1985 ఏప్రిల్‌లో

ఆ శాఖలో ఆచార్య పదవి పొంది 1987 జూలై నుంచి ఆ శాఖకు అధ్యక్షులయారు స్వవృత్తిని ప్రేమించి ఉద్యోగ ధర్మాలను త్రికరణశుద్ధితో నెరవేర్చడం మంచిని పెంచుతూ మంచిగా బ్రతకడం ఆయన లక్ష్యం పదవే పరమార్థం అనుకోకుండా జీవితాన్ని సాహిత్య సేవలో సార్థకం చేసుకోవాలన్నది ఆదర్శం కనుకనే ఆయన తాము రచించిన శ్రీ వేంకటేశ్వర శతకంలో -

కాలము త్రాచుపాము వలె గాచె నదెప్పుడు కాటు వైచునో
తెలదు చచ్చులోపల నెదే నొక పుణ్య మొనర్తుమన్న నీ
యాలరి చిత్తమా యిహ సు ఖావిలమై తిరుగంగ బారు నిం
కేలవి బుణ్య వర్తనుడ నేనగుదున్ బ్రభు వేంకటేశ్వరా'

అని ఆవేదన చెందారు శ్రీరామచంద్రకు రచనలు చేయడంలో గల శ్రద్ధ వాటి ప్రచురణలో లేదు కొందరి స్వభావమది వేగిరింపనదియు, విషమవౌను అని మాగవేస్తారు నా కవిత వినండి, నా రచనలు చదవండి అని స్వయంగా నేర శిష్య ఆప్తవర్గం ద్వారానో ప్రచారం చేసుకోరు అందుకే ఆయన -

దవనపు రెమ్మతో వలపు దారులు త్రొక్కిన కైతసేసి, నా
కవనము జూడరే యనుచు గర్వులకుం బరికింప నిచ్చి, మీ
శ్రవణము లిచ్చి దీని విన రండని పల్కులు యన్నమంట, నా
కవమతి యద్ది, నాకయిన హర్షమె నా కవనమ్ము నెచ్చెలీ'

అని ప్రకరణాంతరంలో అన్నారు కనుక ప్రచురించినవి వ్యాసాలు వేంకటేశ్వర శతకం, అశ్రు తర్పణం వంటి కొన్ని మాత్రమే డాక్టరేట్ సిద్ధాంత వ్యాసం, డాక్టరేట్ అనంతర సిద్ధాంత వ్యాసం, సుదాలహరి, ప్రగతి బుక్కులు జానపద గేయాలు (పీఠికతో) కళాభిరామము (వీడి), రామచంద్ర శతకం మొదలయినవి అముద్రితాలు చాల ఉన్నాయి మరొక్క సంగతి చెప్పడం మరిచాను 1983లో ఒంగోలులోని ఎర్రన కళాపీఠం వారి మొదటి అవార్డు 3000 రూపాయలు శ్రీరామచంద్ర రచనకే లభించింది మద్రాసు విశ్వవిద్యాలయం తెలుగు శాఖ శ్రీ కోరాడ రామకృష్ణయ్య డాక్టర్ నిడుదవోలు వేంకటరావు గార్ల వంటి పరిశోధన పరమేశ్వరు లుండినట్టినది పరిశోధనకు కాణాచి అయినట్టిది శ్రీ కోరాడ వారి ఆంధ్ర భారత కవితా విమర్శము తెలుగు సంది డాక్టర్ నిడుదవోలు వారి దక్షిణాంధ్ర వాఙ్మయం వంటి పరిశోధన గ్రంథాలు అపూర్వమయినవి శ్రీ రామచంద్ర వారికి దీటుగా పరిశోధనలు పార ప్రవచనాలు నిర్వహించి ఆ శాఖ కీర్తిని పునరుద్ధరింతురు గాక! సచ్ఛీలురు సహృదయులు సత్కృషి కలవారు గనుక ఆయనపై నాకు ఎన్నో సాహిత్య సాంస్కృతిక వాంఛలున్నాయి అవన్నీ తీరడానికి ఆయన నమ్మిన వేంకటేశ్వరుడు ఆయనను శతాయుష్కులుగా సార్థక జీవులుగా చేయుగాక!

## ఉపశ్రుతి

ఓ తా! తాతా! నాకు కథక్కళి నృత్యం నేర్పిస్తావా?- అని అడిగాడు నన్ను మనవడు ఉదయాన బాబూ నీకు ఒకరు నేర్పడమేమిటి? నాంపల్లినుంచి గాంధీనగర్ మీదుగా సికిందరాబాద్‌కు వెళ్లే 20వ నెంబరు బస్సు ఎక్కి రోజుకు రెండు సార్ల ప్రకారం నెల రోజులు తిరుగు కథక్కళిలో విశారదుడవు అవుతావు అన్నారు పక్కన వున్న పెద్దమనిషి

**తిరుమల రామచంద్ర**

# మృత్యువుపై విజయంసాధించిన13 ఏళ్ళ క్రీడామయూరి జూలీ హంట్

అవిటి అంగవైకల్యం కలిగిన వారు అంటే సమాజంలో గుర్తింపు లేదు వారిని ఎందుకు పనికిరాని వారిగా అనర్హులుగా లెక్కిస్తాము దురదృష్టము సంఘటనలు అనారోగ్యము వలన అవిటి అయితే వారి పాప ఫలము అంటాము ఇది మన బలహీనత కృంగిపోవు వారికి ధైర్య వచనములు చెప్పవలసిన పెద్దలు సహితము వారు చేయు ప్రతి పనికి వంకలు పెట్టడం జరుగుతున్నది కాని వారిలో కూడా ప్రతిభావంతులు ఉంటారు సరియైన ప్రోత్సాహము మనో ధైర్యము యిస్తే రాణించ గలరు పరిస్థితులను అవగాహన చేసుకొని మనో నిబ్బరముతో ఎదుర్కొని సమాజంలో తనకంటూ ఒక స్థానము కలిగించుకున్న ఒక అవిటి స్త్రీ యదార్థ గాథ మయూరి చిత్రము చూచి ఆశ్చర్యము పొందిన మేధావులు వున్నారు అంత కంటే అద్భుతము క్రీడా రంగములో మేటి క్రీడాకారులతో సమానముగా ప్రతిభ చూపిన పదమూడు ఏళ్ళ ఆంగ్ల బాలిక గురించి లోకానికి అంతగా తెలియదు దీనికి కారణము ఆమె గురించి చిత్రము ఏది లేదు మన పత్రికలలో అంతగా రాయలేదు పాశ్చాత్య దేశములలో అంగ వైకల్యము పొందిన వారిని కృత్రిమ సాధనములు అమర్చి సామాన్యులతో సరిగా బ్రతకగల అవకాశములు వైద్య శాస్త్ర సహాయములు లభిస్తాయి మన దేశములో యిప్పుడిప్పుడే యిటువంటి ప్రయత్నాలు జరుగు తున్నవి

లండన్‌లో యిటీవల జరిగిన 44 మైళ్ళ కారల్స్‌బర్గ్ రౌండ్ లండన్ బోట్ రేస్ లో పాల్గొన్న వందకు పైగా మేటి క్రీడాకారులలో 13 ఏళ్ళ అవిటి బాలిక చూపిన ప్రతిభ అందరిని ఆశ్చర్యపరిచినది సైన్యం నేవీ యితర అగ్ర గాములు పాల్గొన్న పడవ పోటీలలో పదమూడు ఏళ్ళ, అవిటి బాలిక జూలీ హంట్ 23వ స్థానము పొందటం సంచలనం సృష్టించింది జూలీ కుడి కాలు మడమ నుండి మోకాలు పై వరకు కాన్సర్ వ్యాధికి గురైనందు వల్ల శస్త్ర చికిత్స చేసి తొలగించబడి కృత్రిమ సాదనము అమర్చబడినది అట్టి వారు నడవటమే కష్టము కాని ఎంతో బలవంతులు అగ్రగాములతో పోటీ చేసి గుర్తింపు పొందుట ఆశ్చర్యకరమైనది అన్ని అవయవములు బాగుగా యుండియు యిటువంటి పోటీలలో బాల బాలికలు పాల్గొనటం జరగదు ఒక అవిటి బాలిక చూపిన నైపుణ్యము ఆమె మనో నిబ్బరము పట్టుదల కృషి దృఢ సంకల్పములకు నిదర్శనము

ఈ అద్భుత బాలిక జూలీ లండన్ సమీపములో గల సుందర్‌లాండ్ టైన్ అండ్ వేర్ కు చెందినది రెండేళ్ళ క్రితం మృత్యువుతో ధైర్యముగా పోరాడి విజయం పొందినది యావత్తు వైద్య రంగాన్ని ఆశ్చర్య పరిచింది

తల్లి జూనా నర్సు నలుగురు సోదరులు సోదరీమణులు తండ్రి సహకారము ఆ కుటుంబమునకు లేదు ఒక రోజు జూలీ పాఠశాల నుండి కుంటుచు వచ్చి కాలు నొప్పిగా ఉన్నదని తల్లితో చెప్పినది సామాన్యము అయిన నొప్పి అని భావించి జూనా ఎక్స్‌రే తీయించినది వైద్యులు ఎక్స్‌రే పరిశీలించి జూలీ హంట్ కాలులో 26 సెంటీ మీటర్లు ప్రమాదకరమైన కంతి యున్నట్లు కనుగొన్నారు కాన్సర్ వలన కాలు వాపు కలిగినట్లు అది శరీరమంతా ప్రాకే అవకాశములు యున్నట్లు తెలుసుకున్నారు నివారణకు జూలీ కుడి కాలు శస్త్ర చికిత్స చేసి తొలగిస్తే బ్రతికే అవకాశము ఉండవచ్చునని వారు చెప్పారు శస్త్ర చికిత్స సమయములో ఆమె ప్రాణమునకు ప్రమాదము ఉండవచ్చునని వైద్యులు భావించారు వైద్య రంగములో అనుభవము వున్న తల్లి ధైర్యముతో శస్త్ర చికిత్సకు అంగీకరించినది ఆపరేషన్ థియేటర్‌లోనికి జూలీని స్కూలు యూనిఫారముతో తీసుకొని వెళ్ళారు ఆమెలో ఎటువంటి విషాద ఛాయలు కనిపించలేదు సుందరలాండ్ జిల్లా ఆసుపత్రి డాక్టర్లు జూలీకు వెంటనే కెమో థెరపీ చేసి వ్యాది యితర భాగములకు ప్రాకకుండా నిరోధించవలసిన అవసరము ఎంతో యున్నదని నిర్ణయించారు కెమో థెరపీ వలన లాభముతో పాటు జరుగు నష్టము గురించి తల్లి ఎంతో బాధ పడినది ఆరుసార్లు యీ వైద్యము చేయబడినది నరాలు ఉప్పు నీటి ద్రావకము వలన శుభ్రము చేయబడ్డాయి ఈవైద్యము వలన జూలీ శరీరముపై యున్న వెంట్రుకలు రాలిపోయాయి కనీసము కంటి రెప్పలకున్న వెంట్రుకలు కూడా మిగలలేదు శరీరము పసుపు రంగుగా మారినది వాంతులు ప్రారంభమయాయి ఏది తినే స్థితిలో ఆమె లేదు రాత్రులు కలవరించేది తల్లి ప్రక్కనే ఉండి ధైర్యము చెప్పగల స్థితిలో లేదు ఇంత చేసినా ఆపరేషన్ చేసి కాలు తొలగించిన జూలీ బ్రతుకు అవకాశములు 30 శాతం మాత్రము కలవు ఆపరేషన్ చేయు రోజు దగ్గర పడే కొద్దీ యిద్దరూ మొండి ధైర్యముతో పరిస్థితులను ఎదుర్కొనుటకు నిర్ణయించుకున్నారు

కాన్సర్ నిధికై అయిదు మైళ్ళ పరుగు (జాగింగ్)లో పాల్గొన్న జూలీ, ఆమె సోదరి లీసా.



జూలీ, ఆమె తల్లి జోనాహంట్ జూలీకి వివిధ క్రీడా పోటీలలో లభించిన పతకాలు.






కలువబాల లక్కీ డిప్‌లో మొదటి బహుమతి పొందిన శ్రీమతి ఎన్. సుబ్బరత్నమ్మగారికి కలర్ టి. వి. ని అందజేస్తున్న శ్రీమతి రావినూతల సువర్ణా కన్నన్. శ్రీమతి డి. సుజాతాదేవి. శ్రీమతి జంధ్యాల కామేశ్వరీ శంకర్ గార్లని కూడా చిత్రంలో చూడవచ్చు.

# కలువబాల లక్కీ డిప్ బహుమతి ప్రదానోత్సవం

ఆంధ్రపత్రిక ప్రచురణ, నవ వనితా పక్ష పత్రిక "కలువబాల" నిర్వహించిన లక్కీడిప్‌లో విజేతలకి బహుమతి ప్రదానోత్సవం జూలై 25న జరిగింది. ఈ సభకి ప్రముఖ రచయిత్రి శ్రీమతి డి. సుజాతాదేవి అధ్యక్షత వహించారు. సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి రావినూతల సువర్ణాకన్నన్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. విజయవాడ మేయర్ డాక్టర్ జంధ్యాల శంకర్ సతీమణి శ్రీమతి కామేశ్వరీ శంకర్ వేదిక నలంకరించారు. సంస్థ తరఫున విజేతలకి శ్రీమతి సువర్ణాకన్నన్ బహుమతులని అందజేసారు. మొదటి బహుమతి కలర్ టి. వి.ని శ్రీమతి ఎన్. సుబ్బరత్నమ్మ (కనిగిరి), రెండు రెండవ బహుమతులు రెండు బ్లాక్ అండ్ వైట్ టి. వి. లని కుమారి కె. అనూషా (కొత్తగూడెం), కుమారి పద్మజ (కోరుకొండ), మూడు మూడవ బహుమతులు 3 మిక్సర్‌లని శ్రీమతి కె. మంగమ్మ (అనుపర్రు), శ్రీమతి ముప్పాళ అమ్మన్న రాజా (విశాఖపట్నం), శ్రీమతి బి. ఉష (శీర్కాళి, తమిళనాడు), నాలుగు నాలుగవ బహుమతులు 4 లేడీస్ రిస్ట్ వాచీలని శ్రీమతి ఉప్పులూరి లక్ష్మి (పాలకొల్లు), కుమారి ఎస్. విజయలక్ష్మి (సత్తెనపల్లి), కుమారి వి. వెంకట నాగ సూర్యకుమారి (మూలస్థానం), శ్రీమతి కె. వరలక్ష్మి (అయి భీమవరం) గార్లు అందుకున్నారు.

సభాధ్యక్షురాలికీ, ముఖ్య అతిథికీ శ్రీమతి జంధ్యాల కామేశ్వరి శంకర్ ఆంధ్రపత్రిక తరఫున జ్ఞాపికలని అందజేసారు. □



## జూలీ హంట్

తొమ్మిది గంటల సేపు ఆపరేషన్ చేయబడినది. డాక్టరులు జూలీ బ్రతకగల అవకాశముల గురించి ఏమీ చెప్పలేని స్థితిలో ఉన్నారు. స్పృహ పొందిన జూలీ చిరు నవ్వుతో అందరిని పలకరించినది. డాక్టరులు ఆమె ప్రవర్తనకు ఆశ్చర్యపోయారు. ఆపరేషన్ చేసిన ఆరవ రోజు జూలీ మంచము దిగి నడుచుటకు ప్రయత్నము చేయుట మరొక ఆశ్చర్యకరమైన సంఘటన.

జూలీ పూర్తిగా కోలుకోటానికి మరి కొంత కాలము పట్టింది. కృత్రిమ కాలుతో అందరిలాగ స్కూలుకు నడిచి వచ్చిన జూలీని చూచి తోటి విద్యార్థులు, ఉపాధ్యాయులు ఆశ్చర్యపడ్డారు.

ఎప్పటిలాగ అందరితో పాటు చదువు, ఆటలలో పాల్గొనేది. కొద్ది కాలములో పాఠశాలలోనే గాక ఆ ప్రాంతంలో ఆమె ప్రతిభను గురించి, మనో ధైర్యము గురించి అందరూ చెప్పుకోవటం జరిగింది. ఎంతో ఆరోగ్యవంతులైన, క్రీడా యోధులను సహితము సులభముగా ఓడించినది. పడవ పోటీలు, హాకీ, సైకిలింగ్, స్విమ్మింగ్ (ఈత), నెట్‌బాల్, వాటర్ స్కీయింగ్, పారాసెండింగ్‌లలో ఎంతో ప్రతిభ చూపినది.

తనలాగే క్యాన్సర్ వ్యాధితో బాధ పడు వారికి వైద్య సౌకర్యము కొరకు నిధి పోగు చేయుటకు అయిదు మైళ్ళు పరుగెత్తినది. ఆమె ధైర్యము, సేవాబుద్ధికి మెచ్చి "గోల్డ్ స్టార్" అవార్డు బహుకరించబడినది.

కృత్రిమ కాలితో పోటీలలో ముఖ్యముగా ఈత పోటీలలో పాల్గొనుటకు నిర్వాహకులు అభ్యంతరము చెప్పారు. కాని వారిని ఒప్పించి పోటీలలో పాల్గొని విజయం సాధించి క్రీడా, వైద్య రంగాలలో సంచలనం సృష్టించింది జూలీ. తోటి విద్యార్థులు, ఉపాధ్యాయులు, మిత్రులు కుటుంబ సభ్యులు జూలీ బ్రతుకట కష్టమని ఆశ వదులుకోగా, మృత్యువును ఓడించి వైద్య రంగమును ఆశ్చర్యపరచి, క్రీడా రంగములో సంచలనం సృష్టించినది జూలీ. అందుకు కారణం ఆమె మనో ధైర్యము, దృ[illegible] సంకల్పము అనవచ్చును. మనలో కు[illegible] యిటువంటి వారు ఉన్నారు. సరియైన చికి[illegible] ప్రోత్సాహాలే కరువైనవి.

—ముకరం

## అవీ– ఇవీ– అన్నీ

### గడియారం వేంకట శేషశాస్త్రి అవార్డు

కడప 'రచన సాహిత్య వేదిక' తరఫున ఏర్పాటు చేయబడిన మహాకవి, స్వర్గీయ గడియారం వేంకట శేషశాస్త్రి అవార్డుకు ఎంట్రీలను కార్యవర్గం తరఫున శ్రీ విహారి ఆహ్వానిస్తున్నారు. అవార్డు విలువ ఐదు వందల రూపాయలు. 1-1-1982 31-12-1986 మధ్య కాలంలో ప్రచురింప బడిన కావ్యాలు, కవితా సంపుటాలు మాత్రమే పోటీకి ప్రవేశార్హత కలిగి ఉంటాయి. కవిత – పద్య, గేయ వచన కవితా రీతులలో దేనికైనా చెంది ఉండవచ్చు. కావ్యంగానీ, కవితా సంపుటిగానీ ఒకే కవి రచించినదిగా ఉండాలి. వివిధ కవుల సంకలనాలు పరిశీలింప బడవు. ప్రచురణ కర్తలు, ఇతర సాహితీ మిత్రులు ఎవరైనా పుస్తకాలు పంపవచ్చు. కానీ అవార్డు మాత్రం గ్రంథకర్తకే ఇవ్వబడుతుంది. పుస్తకాలు నాలుగు ప్రతులు – జే. ఎస్. మూర్తి, ఎ – 1–9, ఎల్. ఐ. సి. క్వార్టర్స్, కడప – 516004 అన్న చిరునామాకు 31–8–1987వ తేదీలోగా పంపవచ్చు. □